# సోవియట్ విద్యాలయాలు

★

రచన
దీనా లెవిన్

★

అనువాదం
నిడమర్తి అశ్వినీకుమారదత్తు
నిడమర్తి ఉమారాజేశ్వరరావు

★

ప్రజా ప్రచురణాలయం,
నారాయణగూడ, హైదరాబాదు (దక్కన్.)

# ఉద్యోగస్వీకరణ

కొంలది కాలముంది, సోవియట్ విద్యావిధానాన్ని గురించి పూర్తిగా తెలిసికొందామనే ఉద్దేశంతో 1933వ సంవత్సరాంత్య భాగంలో నేను సోవియటుయూనియన్‌కు వచ్చాను. మాస్కోలోని విద్యాలయాలెన్ని చూసి, ఎందరు సోవియట్ విద్యావిధానంలో అభిరుచిగలవారిని దర్శించి, ఎన్ని విషయాలను, విశేషాలను సంగ్రహించినా నేను సముపార్జించిన జ్ఞానము సంపూర్ణమైనది కాదనీ, సంపూర్ణమైన జ్ఞానమును సంపాదించవలెనంటె మాస్కోలో కొంతకాలముండి, ఏదన్నా విద్యాలయంలో పనిచేయవలెననీ తలచి, వెనువెంటనే వాకబు చేయ నారంభించాను.

"ఆంగ్లో-అమెరికన్ విద్యాలయంలో జేరరాదా? అక్కడ ఉపాధ్యాయుల కొరత నువ్వు కొంతవరకు తీర్చిన దానవూ అవుతావు; సోవియట్ విద్యావిధానం గురించి తెలిసికొన్నదానవూ అవుతావు కదా" అని సలహా యిచ్చింది ఒక స్నేహితురాలు.

"నూటికి నూరుపాళ్లు సోవియట్ విద్యాలయంలో పనిచెయ్యాలని నాకుంది. విదేశీయుల కుద్దేశించబడిన ఆ విద్యాలయంలో సోవియట్ విధానం పూర్తిగా అమలు పెట్టబడుతోందో లేదో అని సందేహిస్తున్నాను" అని నేనన్నాను.

ఆంగ్లో-అమెరికన్ విద్యాలయానికి మరునాడే ఉత్సాహంతో బయల్దేరాను. విద్యాలయం, విప్లవానికిముందు ఒకధనిక షాహుకారుకు చెందిన రెండంతస్తుల భవనంలో ఏర్పరచబడింది. పెద్ద పెద్ద కిటికీలున్న ఆ భవనానికి వెనుకగా పచ్చని చెట్లతో నిండిన విశాలమైన పెరడుంది. ఆ పెరడులో బాల బాలికలనేకమంది స్కేటింగు చేస్తున్నారు.

నేను లోపలికి వెళ్ళి ప్రిన్సిపాల్‌ను కలుసుకోవాలని తెలియచేశాను. ఒక ఎర్రని రుమాలును తలకు కట్టుకుని నవ్వుతూ, నా వచ్చీరాని రష్యన్ మాటలకు జరజరా సమాధానాలిస్తూ ఒకయువతి నన్ను లోపలికి కొనిపోయింది.

వరండాల వెంబడి మేము నడిచి పోతూంటే బాల బాలికల కేరింతాల ధ్వని మాచెవులబడింది. ఆ వేళ శలవు రోజయినా అంతమంది బాల బాలికలు ఉత్సాహంగా తరగతి గదుల్లోంచి బయటకూ, బయటనుండి

గదులలోనికీ పరుగెత్తటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. తరువాత పొట్టిలాగులు కట్టుకుని యెంతో ఉత్సాహంగా ఉయ్యాల లూగుతూ, గాలిలోకి యెగిరి మొగ్గలు వేస్తూన్న మొగపిల్లలున్న హాలును గడిచి వెళ్ళాము. ఆ ఆటలన్నీ పదిహేడేళ్ళ బాలుని ఆధ్వర్యాన జరుగుతున్నాయి.

ప్రిన్సిపాల్ యెంతో స్నేహపూర్వకంగా నన్నాహ్వానించి, తమ విద్యాలయాన్ని చూడాలన్న నాకోరికను యెంతో ఉత్సుకంగా విన్నారు. విద్యాప్రబోధంలో ఏడేండ్ల అనుభవముందనీ, సోవియట్ విద్యా విధానమంటే నాకు చెప్పనలవికాని అభిరుచి ఉందనీ, కొంతకాలం ఏదన్నా సోవియటు విధానంలో నడపబడుతూన్న విద్యాలయంలో పనిచేసి సోవియట్ విద్యావిధాన మూలమును గ్రహించవలెనని కోరికగా ఉందనీ నేను తెలియచేశాను.

" మా విద్యాలయాన్నెంతో సంతోషంగా చూపుతాను. బహుశా మీకూ తెలిసే ఉంటుంది. యీ వేళ శలవనేసంగతి. అందుచేత అన్ని విద్యాలయాలవలెనే మాదికూడా విలాసభవనంగా మారుతుంది. వచ్చి పిల్లలేంచేస్తున్నారో చూడండి " అన్నారు ప్రిన్సిపాల్.

చదరంగము, కేరమ్సు మొదలైన ఆటలాడుతోన్న బాల బాలిక లున్న గదిని మొదట చూశాం. " ప్రస్తుతం చదరంగపు పోటీ జరుగుతోంది. ఈ పూట, అడుగో ఆ మూల పొడుగ్గా, నల్లగా ఉన్న బాలుణ్ణి చూశారా, అతని ఆధ్వర్యాన జరుగుతోంది పోటీ " అని ప్రిన్సిపాల్ తెలియపరచారు.

ఒక గదిలో బాలబాలికలందరూకూడి కర్రముక్కలతో యేదో నిర్మిస్తున్నారు. వీరిపై తనిఖీకి యెవరూ లేకపోయినా పని అంతా సలక్షణంగా, అల్లరిలేకుండా, అతి చురుకుగా సాగుతూన్నట్లు గ్రహించాను. అందులో ఒక చిన్నారి బాలికను, 'ఏమిటమ్మా మీరు చేసేది ?' అని అడిగాను. 'వోల్గానదిమీద నిర్మింపబడుతోన్న వంతెనకు నమూనా తయారు చేస్తున్నాం. వివరాలన్నీ వార్తాపత్రికల్లో చూశాం. మా నమూనా తయారయాక వస్తు ప్రదర్శనశాలలో పెడతాం.' అని ఆ పదేళ్ళ బాలిక చెప్పింది. విస్తుపోయి నేను చూస్తుంటే 'మా జిల్లా వస్తుప్రదర్శనంలో పెడతాం. మేమేకాదు, అన్ని విద్యాలయ లవారూ శలవల్లో తాముచేసిన నమూనాలు ప్రదర్శనానికి పంపుతారు.' అని ఆ బాలిక పూర్తిచేసింది.

వారిని విడిచివెళ్ళి గ్రంథాలయ, పఠన మందిరాలను దర్శించాము. గోడలమీద యెంతో విలువైన, విజ్ఞాన ప్రదాయకమైన చిత్రాలు, పత్రికలూ వ్రేలాడుతున్నాయి. తరువాత పదునెనిమిదేండ్ల బాలిక నాయకత్వాన, ఉద్రిక్తులైన బాలబాలికలు నాటకం రిహార్సలు వేస్తున్న గదిని గడిచి, ప్రిన్సిపాల్ కార్యాలయానికి చేరుకున్నాం.

ఆ మాటా యీ మాటా మాట్లాడుకున్నాక ప్రిన్సిపాల్ నన్ను తమ విద్యాలయంలో ఉపాధ్యాయినిగా చేరుతారా అని అడిగింది. ఆంగ్లో - అమెరికన్ విద్యాలయాన్ని గూర్చిన నా సందేహాలనూ, సోవియట్ విధానంగురించి సమూలంగా తెలిసికోవాలన్న నా గాఢమైన కోర్కెనూ తెలియచేశాను.

"మా విద్యాలయాన్ని గురించి మీరు పూర్తిగా పొరపడుతున్నారు లెనిన్. మాస్కోలోని యితర విద్యాలయాలన్నింటిలోనూ సోవియట్ విధాన మెంతగా అమలుపరచ బడుతోందో మా విద్యాలయంలోకూడ అంతగానే అమల్లోవుంది. ఎక్కడైతే యేదైనా ఒక భాషను మాట్లాడు కొంతమంది ప్రజలున్నారో అక్కడల్లా సోవియట్ ప్రభుత్వం తన జాతీయ విధానము ననుసరించి ఆ ప్రత్యేకభాషలో విద్యాలయాన్ని తెరుస్తుంది. ఉదాహరణకు మాస్కోలో ఒక జర్మన్ విద్యాలయం, కొన్ని టార్టార్ విద్యాలయాలు, ఒక జిప్సీ విద్యాలయం, మరెన్నో వేర్వేరు జాతీయ భాషలలో విద్యాలయాలు ఉన్నాయి. అమెరికానుండీ, ఇంగ్లండు నుండీ ఎంతోమంది ఉపాధ్యాయులూ, నిపుణులూ సోవియట్ యూనియన్‌లో పనిచేయటానికి వచ్చారు. రష్యన్‌భాష తెలియని వారిపిల్లలు రష్యన్ భాషలో విద్యాభ్యాసం చెయ్యాలంటే ఎంతకష్టమో ఆలోచించండి? విదేశాలలో పనిచేసే సోవియట్ ఉద్యోగస్తుల పిల్లలసంగతికూడా ఇంతే. వారికి రష్యన్ భాషకన్న ఇంగ్లీషు మొదలైన యితర భాషలే యెక్కువ బాగా వచ్చివుంటాయి. అట్టివారు మాస్కోకుగాని, లెనిన్‌గ్రాడుకుగాని తిరిగి వచ్చినప్పుడు తమ విద్యాభ్యాసమును ఆ యా భాషలలోనే కొనసాగించ కలుగుతారు.

"సరిగా మాస్కోలోని యితర విద్యాలయాలన్నీ నడిచే పద్ధతుల మీదనే మా విద్యాలయంకూడ నడుస్తోంది. ఇతర విద్యాలయా లన్నింటి లోనూ అనుసరించే పాఠ్యప్రణాళికను, పాఠ్యగ్రంథాలనే మేమూ అనుసరిస్తున్నాం. పాఠ్యగ్రంథాలన్నీ రష్యన్‌భాషనుండి తర్జుమా చేయబడ్డాయి.

మీ రీ విషయాలన్నీ శ్రద్ధగా ఆలోచించి, మా విద్యాలయంలో పనిచేయుటకే నిర్ణయించు కున్నట్లయితే, సోవియట్ విద్యావిధానమునుగురించి సంపూర్ణంగా తెలుసుకో గలరనీ, మీ మాతృభాషలోనే యిక్కడ బోధన జరుగుట మీకు మరింత వీలైన విషయమనీ నేను హామీ ఇవ్వగలను " అన్నారు ప్రిన్సిపాల్.

ఈ వాదనలన్నీ నా కెంతో సహేతుకంగా కనిపించాయి. నేను విషయమంతా ఆలోచించి రెండు మూడు రోజుల్లో ప్రత్యుత్తర మిస్తానని చెప్పాను కాని అప్పటికే నా మనస్సులో ఒక నిర్ణయానికి వచ్చాను. ఆ ప్రదేశమంటే అప్పటికే ఒక విధమైన సంబంధమూ, యిష్టమూ నాలో యేర్పడ్డాయి.

చివరకు శలవుల ఆఖరున జనవరి 15 వ తేదీనాడు నేను, నాలుగు నెలలపాటు మాతృత్వ శలవుమీద వెళ్ళిపోతోన్న మూడవతరగతి ఉపాధ్యాయిని ఉద్యోగంలో జేరాలనీ వేసవిలో శెలవు తీసికొన్న తరువాత గణితశాస్త్ర ఉపాధ్యాయిని పనికూడా చూసుకోవాలనీ నిర్ణయింపబడింది. ఇంత లోపుగా విద్యార్థులతోబాటు కొన్ని వినోద విజ్ఞాన యాత్రలకు నన్ను కూడా ఆహ్వానించారు. నా విద్యార్థులలో కొంతమంది పరిచయాన్ని ముందుగానే కలుగజేసుకోవచ్చును కదా అని నే నా ఆహ్వానాన్నంగీకరించాను. మేం ప్రథమంగా మాస్కోలో ఒక పార్కుకి వెళ్ళాం.

విద్యాలయ భవనంలో మేము ఉదయం పదింటికి కలుసుకున్నాం. పదిపదునాలుగేండ్ల మధ్యవయస్సుగల పాతికమంది బాలబాలికలువచ్చారు. మొదట్లో నేను చూసినప్పుడు నాటకం రిహార్సల్ వేయించటంలో నాయకత్వం వహించిన బాలికే యిప్పుడుకూడా ఆధ్వర్యం వహించింది. ఆమె మార్గదర్శి సంఘ నాయకురాలని నాకు తెలిసింది. ఆ బాలిక అందరి దగ్గిరా రానుపోను ఖర్చులు పోగుచెయ్యగానే మేము బయల్దేరి ట్రాముపై యిరవై నిముషాల్లో పార్కుకు జేరుకుని స్కైలు కోసమై (మంచుమీద జారుటకుపయోగించు సాధనాలు) వరుసలు తీరి నిలబడ్డాం. స్కైలు తీసికోగానే గడ్డకట్టిన మంచుపై హుషారుగా స్కేటింగు ప్రారంభించాము.

ఆ పార్కు జారుకాలపు ఒక జమీందారుకు చెందినది. అందులో యేపుగా పెరిగిన సుందరమైన చెట్లున్నాయి. కొంతసేపు ఆ చెట్ల మధ్య హుషారుగా స్కేటింగు చేసేసరికి మాకడుపుల్లో తేబ్బా. జెర్రిలూ పాకనారంభించాయి. స్కైలు తిరిగి యిచ్చివేసి, పార్కుద్వారమున కెదు

రుగా ఉన్న పెద్ద భవనములోని విశాలమైన భోజనశాలలో వందలాది యితర బాలబాలికలతోపాటు తృప్తిదీర తిని ఆకలిని అదుపులోనికి తెచ్చుకున్నాం.

భోజనానంతరం దగ్గరలోనున్న విలాసభవనానికి వెళ్ళి, బాలబాలికలకై తీయబడిన ఒక సినీమాను చూశాం. ఆ విధంగా యెంతో ఆనందదాయకమైన రోజును గడిపాక బాల బాలికలందరూ యెవరిండ్లకు వారు తిరిగి వెళ్ళారు.

బాలబాలికల శలవు దినాలను ఆనందమయంగాను, ఆదర్శవంతంగాను చేయుటలో స్థానిక సోవియట్లు విద్యాలయాలకు చేసే సహకార సహాయాలకు మా యీ వినోదయాత్ర ఒక చిన్న ఉదాహరణ మాత్రమేనని నేను తరువాత తరువాత గుర్తించాను. పార్కులు, సినీమాలు, వస్తుప్రదర్శన శాలలు, నాటక ప్రదర్శన శాలలూ బాలబాలికల శలవు దినాలను ఆనంద మయంగాను, తమ తల్లిదండ్రులు పనిలోఉన్న సమయంలో పిల్లలు అల్లరి పనులకు, చిలిపిచేష్టలకు దిగకుండుటకును, వీధులలో అర్థము లేకుండా తిరుగకుండుటకును, వారి చేతుల్లో ఉంచబడ్డాయి. శలవు కార్యక్రమాల్లో పాల్గొనుట, పాల్గొనక పోవుటలు బాల బాలికల యిష్టా విష్టాలమీదనే ఆధారపడినా, ఆకార్యక్రమాలన్నీ అత్యంత ఆకర్షణీయంగా ఆనంద ప్రదాయకంగా ఉండుట కారణంగా యెక్కువ మంది వానిలో పాల్గొంటారు.

నా ప్రథమానుభవం ద్వారానే బాల బాలికలెంతో చురుకైన వారనీ, తెలివైన వారనీ గ్రహించాను. వారిలో యేపనైనా చేయగల శక్తిగూడా చాల అధికమని గుర్తించాను. ఈ విషయాలు నా మనస్సును తీవ్ర ఆలోచనలతో నింపాయి. పది పన్నెండేళ్ళ మధ్య వయస్సుగల ముప్పదిమంది చురుకైన, తెలివైన బాల బాలికలకు ఒక తరగితిలో బోధించటం ! నేనింతవరకు ముతా పద్ధతిలోగాని, డాల్టన్ విధానంలోగాని మాత్రమే బాల బాలికల వ్యక్తిగతాభి వృద్ధికి తావుంటుందని నమ్ముతూ వచ్చాను. ఆ విధానాల్లోనే నే నంతవరకు బోధించినదికూడా. యంత్రములో ఒకే విధమైన వస్తువులు తయారయే విధంగానే తరగతి పద్ధతిలో ఒకే విధమైన విద్యార్థులు తయారవుతారని నమ్ముతూ వచ్చాను. నిజానికి ఆ నిముషం వరకు నేను ' అభివృద్ధి కర ' లేక ' స్వేచ్ఛాయుత ' బోధనాపద్ధతిని పూర్తిగా నమ్ముతూ, ' తరగతి ' పద్ధతిని అసహ్యించుకునేదాన్ని.

"సూపర్వైజరు మీకు కావలసిన సహాయమంతా చేస్తుంది. బోధ నాక్రమమంతా ఆమె పర్యవేక్షణ క్రిందనే జరుగుతుంది." అని చెప్పారు. ప్రిన్సిపాల్.

సూపర్వైజరు, కామ్రేడ్ హాలండు విద్యాలయం తెరువ బడేందుకు కొద్ది రోజులముందు నన్ను కలుసుకొని, నాపని నేవిధంగా విభజించు కోవాలో చూపారు. అచ్చయిన పాఠ్య ప్రణాళిక ననుసరించి యేవారపు పాఠముల నావారమునకు ముందుగానే నిర్ణయించుకుని, వాటిని బోధించు పద్ధతికూడ నిర్ణయించుకోవాలని తెలియజేశారు. పాఠాలను సకాలంలో పూర్తిచేసే పక్షంలో యే విషయాన్నైనా నాకు నచ్చిన విధంగా బోధించ వచ్చునని కూడా తెలియ జేశారు.

ఈ విషయాలన్నీ చెప్పాక. "ఏ విషయంలోనైనా కష్టంకలిగితే తప్పక నన్ను కలుసుకోండి. మీకు బోధనాపద్ధతుల్లోను. క్రమశిక్షణ విష యంలోను సర్వవిధాలా సహాయం చెయ్యటమే నా విధి. ఇంకోసంగతి కామ్రేడ్ లెవిన్, నేను కూడా అప్పుడప్పుడు మీ తరగతులకు హాజ రవటం చూసి గాబరా పడకండి! అది కూడ నా పనిలో ఒక భాగమే" అని చెప్పారు కామ్రేడ్ హాలండు.

ఇదివరకెన్నడూ క్రమశిక్షణ విషయంలో నేను పై అధికారులకు పితూరీ చేసికొని వుండలేదు. ఇకముందుకూడా యెన్నడూ పితూరీలు చేయ కుండా వుండాలని నా ఉద్దేశం. కాని యిల్లాంటి విధానంలో యిదివర కెన్నడూ నేను బోధన చెయ్యలేదు కనుక క్రమశిక్షణ విషయంలో కొంత కష్టం కలుగ వచ్చును. ఏదెల్లా ఉన్నా క్రమ శిక్షణ విషయంలో కామ్రేడ్ హాలండు తనకు తెలియ చెయ్యమని చెప్పటం మటుకు నాకు అమితాశ్చ ర్యాన్ని కలిగించింది. అల్లాంటి సిగ్గుచేటువిషయాలను సాధ్యమైనంతవరకు పై అధికారుల దృష్టినుండి మరుగు పరచాలని నేను భావిస్తూండేదాన్ని!

విద్యాలయం తెరిచేందుకు ఒక రోజుముందు జరిగిన మా ఉపా ధ్యాయుల సమావేశంలో నేను నాసహ ఉపాధ్యాయులను కలిసికొన్నాను. నాతో వారందరూ చాల స్నేహ పూర్వకంగా మెలిగారు. వారిలో చాల మంది అమెరికన్లు, మరొక ఇంగ్లీషు ఉపాధ్యాయినీ, ఇంగ్లీషు చక్కగా మాట్లాడ నేర్చిన యిద్దరు రష్యన్ ఉపాధ్యాయులూ, అమెరికానుండి తిరిగి వచ్చి ఆటలూ, జర్మన్ భాషా బోధిస్తోన్న ఒక ఆస్ట్రియనూ, ఒక ఆస్ట్రే లియనూ వున్నారు. మొత్తం అనేకజాతుల మిశ్రమం అని చెప్పవచ్చును!

ఆ సమావేశంలో, ఏతరగతిలోనూ యే విద్యార్థినీ ఒక యేడుకన్న అధికంగా వుంచరాదనీ, బోధనా విధానంలో ఉన్నత స్థాయిని సాధించాలనీ, ప్రతివిద్యార్థీ పాఠ్యప్రణాళికలోని ప్రతివిషయాన్నీ సాకల్యంగా తెలిసికొనేందుకు తోడ్పడాలనీ వివరించబడింది. తరువాత, జరిగిపోయిన టరమ్‌లో పనిలో వచ్చిన లోటుపాట్లను ఎత్తుకున్నారు. కామ్రేడ్ బోల్టన్ రెండవతరగతి విద్యార్థులకు సరియైన పద్ధతిలో బోధించలేదనీ, క్రమశిక్షణను అతితీవ్రంగా అమలు పరచిందనీ, ఆమె అంటే బాల బాలికలకు ప్రశ్నలు, సందేహాలు అడుగజాలనంతగా భయము కలిగిందనీ సూపర్వైజరు విమర్శించారు. "బాల బాలికల సందేహాలు నివర్తించి, ప్రశ్నలకు సమాధానాలిచ్చి, వారి పనిలో వచ్చే కష్టాలను తీర్చే వయస్సులో పెద్దయైన సహకారిగా, స్నేహితురాలుగా ఉండాలి. అట్లాకాక మీ తీవ్ర క్రమశిక్షణవల్ల మీకూ వారికి మధ్య పెద్ద అఖాతం యేర్పరచారు. వారు మిమ్మొక మానవ మాత్రురాలుగా చూడక భయము కొలుపు ఉపాధ్యాయినిగా చూసేట్లు తయారు చేశారు. ఉదాహరణకి చూడండి, కోల్యా తెలివైనవాడేకదా? బోధన సరిగా లేకపోవడం మూలాన వెంకిగా తయారవుతున్నాడు. పైగా అనేకమందిని తరగతి బయటకు పంపించేశారు. అబ్బే అది సోవియటు పద్ధతి యెంతమాత్రంకాదు! తరగతి పద్ధతే అవలంబింప బడుతున్నా, విద్యార్థులపట్ల వ్యక్తిగతంగాకూడ శ్రద్ధతీసికోవాలి. వారిని మనమూ, మనలను వారూ అర్థం చేసికోవటమూ, వారికీ మనకూ మధ్య పరస్పర ప్రేమా ఉండాలి. సోదర భావమూ, న్యాయమూ ఉన్నచోట మాత్రమే అభివృద్ధి కాగలుగు ఆత్మశిక్షణే సోవియటు ఆదర్శం"

బహిరంగ సమావేశంలో యీ విధంగా విమర్శించటం నాకు మితిలేని ఆశ్చర్యాన్ని కలిగించింది. కామ్రేడ్ బోల్టన్ యీ విమర్శను యే విధంగా గ్రహించారోనని ఆమెవంకకు చూశాను. సమావేశంలో అందరూ ఆమె జవాబుకై నిరీక్షించారు గాని ఆమె యేమీ మాట్లాడలేదు. ఆమె సోవియటు యూనియనుకు కొత్త అనీ, సోవియటు పద్ధతుల నలవరచుకోవటం ఆమెకు చాల కష్టంగా వుందనీ, విదేశాలలో ఆమె పనిచేసిన కాలంలో తరగతిలో చాలమంది పిల్లలుండుటవలన వారిని తీవ్రక్రమశిక్షణ పద్ధతి మీద మాత్రమే అదుపులో ఉంచుకోగలిగే వారనీ నేను తరువాత తెలిసికొన్నాను.

" ఆరేడు తరగతుల విద్యార్థులు చక్కగా చదివి, యింటికిచ్చిన పనినంతాచేసి, తమ పనిలో యెంతో ఉత్సాహంగా పాల్గొంటారుగాని, అయిదవ తరగతి పిల్లలు మాత్రం ఎల్లప్పుడూ అల్లరిచేస్తూ ఇంటికిచ్చిన పనిచేసిన పాపానపోరు. గడచిన టరమ్‌లో వారి అల్లరి మరింత మితిమీరి పోయింది. సమావేశంవారిని యీవిషయంలో నాకు సలహాలివ్వమని కోరుతున్నాను." అని పై తరగతులలో ఇంగ్లీషు బోధించే కామ్రేడ్ యంగ్ ఉపన్యసించారు. ఈ మారు నా ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది! తమ లోపాలను సర్వసాధారణ విషయంవలె బహిరంగంగా అంగీకరించి సవరణకోసమై సలహాలనర్థించటం వింతల్లో వింతగా నాకు తోచింది.

అనేకమంది తమకు తోచిన సలహాలను చెప్పారు. ఇంగ్లీషు తరగతులకు తరుచు హాజరై ఆ విషయంలో మూలం గ్రహించటానికి ప్రయత్నిస్తానని సూపర్వైజరు వాగ్దానం చేశారు. "బహుశా మీ బోధనా పద్ధతి కొంతమార్చాలనుకుంటాను. ఈ తరగతిని ప్రత్యేకంగా చూడాలి. ఏదెల్లావున్నా మీకు కావలసిన సహాయమంతా చేస్తాం. ఈ విషయమై వచ్చే నెల సరి సమావేశంలో నివేదిక నిస్తాం" అని ఆమె చెప్పారు.

సమావేశమంతట్లోనూ ప్రతివిషయంలోనూ ఉపాధ్యాయులందరూ చూపెశ్రద్ధా, లోపాలను స్నేహపూర్వకంగా నిర్దాక్షిణ్యంగా విమర్శించటం నామనస్సు నాకర్షించాయి. విమర్శింపబడినవారుకూడా విమర్శను స్నేహపూర్వకంగానే గ్రహిస్తున్నారనేది సుస్పష్టమే. సమావేశ కార్యక్రమం యావత్తూ పుస్తకంలో యెక్కించుకోబడింది. అవసరమైన అన్ని విషయాలమీదా తీర్మానాలు చేయబడ్డాయి.

సమావేశానంతరం విద్యాలయ అనువాదకురాలైన నెరిసిన జుట్టుగల ఒక అందమైన యువతి నన్ను కలిసికొంది. విద్యాలయ సమితికి కూడ ఆమెయే అధ్యక్షురాలు. రష్యన్ భాష నేర్చుకొనవలెనంటే ఉపాధ్యాయుల రష్యన్ తరగతికి హాజరు కమ్మనీ, నా పనిలో యేమైనా కష్టం కలిగినట్లయితే తనకు చేతనైన సహాయము చేస్తాననీ, అన్నిటికన్న ప్రధానంగా విద్యాలయ నిర్వహణలో నాకు కనిపించిన లోపాలను తప్పక తెలియ చెయ్యమనీ ఆమెచెప్పింది. నేను విద్యాలయానికి కొత్తకాబట్టి వారెవరికీ కన్పించని లోపాలు నాకు కనిపించటానికి అవకాశముందని ఆమె చెప్పింది.

"విద్యాలయ నిర్వహణలో కలుగు లోపాలను సరిదిద్దుట, విద్యాలయ సభ్యులకు సమస్తావకాశాలను కల్పించుట, సినిమాలు, నాటకశాలలు, పార్కులు, ఆటల పోటీలు మొదలైన విలాసకర విషయాలలో పాల్గొనుటకు వివిధావకాశాలను కల్పించుట - ఇంతెందుకు వారి కెందులో అభిరుచి వున్నదో వాటినన్నిటినీ సమకూర్చుటకూడా ఈ సమితి విధుల్లో నివే-" అని ఆమె ముగించింది.

అనేక ఆలోచనలతో నిండిన మనస్సుతో నే వింటికి వెళ్ళాను. అయితే సోవియట్ ఉపాధ్యాయులు బహిరంగంగా తమ లోపాలను వెలిబుచ్చుతా రన్నమాట! - అభివృద్ధి కిదే అత్యుత్తమమైన మార్గమేమో? ఆ విధానమంతా పరస్పర సహాయ సహకారాలమీద ఆధారపడినట్లు తోచింది. విద్యాలయసమితి యీ విషయాలన్నింటినీ చక్కదిద్దే సంస్థగా తోచింది. మరునాటి తరగతిలో నా కేమున్నా కష్టాలు కలిగితే తప్పక పై అధికారుల సహాయ సహకారాల నర్థించాలనే నిర్ణయానికి వచ్చాను....

ఒక వారంరోజులు గడిచేసరికి నా మనస్సు ననేక సందేహాలు బాధించ నారంభించాయి నిర్ణీత కాలంలో బాలబాలికలందరూ పాఠాలను హృదయగతం చేసుకొనే పద్ధతేమిటి? విద్యార్థుల నెవరినీ ఒక తరగతిలో ఒక యేటికన్నా అధికంగా ఉంచరాదనీ, ప్రతి విద్యార్థీ తన పాఠ్య ప్రణాళికలోని ప్రతి విషయాన్నీ సమగ్రంగా నేర్చుకోవాలనీ సమావేశ నిర్ణయం కదా, మందకొడిగా చదివేవారిని అభివృద్ధి పరచడమెట్లా? త్వర త్వరగా ముందుకు పోయేవారికి చేతినిండా పని కల్పించటమెట్లా? తరగతిలో అందరికీ విద్యలో అభిరుచిని కలిగించేదెట్లా? ఈ విషయాలన్నీ ప్రిన్సిపాలుతోనో, సూపర్వైజరుతోనో ఆలోచిస్తేనే బాగుంటుందేమో అనుకున్నాను. కాని సమావేశంలో ప్రతి ఒక్కరూ యెంత స్నేహపూర్వకంగా ప్రవర్తించారో తలుచుకునేసరికల్లా నాలోని అనుమానాలూ, భయాలూ అంతర్ధానమై, నాకు కలిగే కష్టా లెలాంటివైనా వాటిని తీర్చుకోటంలో తప్పక నాకు సహాయం లభిస్తుందనే గాఢనమ్మకం కలిగింది.

•••ం౦ం•••

# ౧౦

# నా తరగతి

'మన మనుసరించేది తరగతి పద్ధతే అయినా, విద్యార్థుల పట్ల వ్యక్తిగత శ్రద్ధను చూపాలి.' నేను హాజరయిన మొదటి ఉపాధ్యాయుల సమావేశంలో సూపర్వైజరు పలికిన యీ మాటలే నా తరగతిలోని చురుకయిన ముప్పది మంది బాల బాలికలకు బోధించుటలో నాకత్యంత సహాయకారులుగా పనిచేశాయి.

మాస్కోలో నా బోధనాకాలంలోని మొదటి సంవత్సరానుభవాల వల్ల విద్యార్థుల మనస్సుల్లో జ్ఞానాన్ని కూరాలని ప్రయత్నించే ఉపాధ్యాయులు గౌరవింపబడరనీ, వారి ప్రయత్నాలన్నీ అనవసర ప్రయాసలేననీ తెలిసికోగలిగాను. వారికి జ్ఞానాన్ని బోధిస్తూ, వారిలోని జ్ఞానాన్ని అభివృద్ధి పరచటం రహస్యములు తలిచే విధంగా అవసరమే. చక్కని శీలాన్ని వారి కలవరుస్తూ, పాఠ్యక్రమాన్ననుసరించి విషయజ్ఞానాన్ని కలిగించడం కూడా అవసరమే. వ్యక్తిగతంగా అందరినీ అర్థంచేసికోవటం ద్వారానూ, సహచరుల వలె వారిని స్నేహ పూర్వకంగా చూడటంద్వారానూ నేను నా విద్యార్థుల గౌరవ ప్రేమలను చూరగొన గలిగాను.

నా విద్యార్థులు చాల తెలివయిన వారనీ, గోలచేస్తూ అదుపుకు సులభంగా రాకపోయినా, పాఠాలలో విపరీతమైన అభిరుచి కలవారనీ గ్రహించాను. మొట్టమొదటగా నేను వారికి బోధించినది గణితశాస్త్రం. చాలినన్ని లెక్కలివ్వటం మూలాన ఆగంటయేమీ గొడవలేకుండానే గడిచిపోయింది. కాని భూగోళపు తరగతి వచ్చేసరికల్లా వారిని అల్లరి చేయకుండా వుంచటానికి నా తాతముత్తాతలు దిగి వచ్చారు. భూగోళమంటే వారందరికీ విపరీతమైన అభిరుచి వుందనే విషయం స్పష్టంగా కపిపిస్తోన్నప్పటికీ, ఒక క్రమమనేది లేకుండా అందరూ ఒక్కపెట్టుగా ప్రశ్నలడిగేసరికల్లా గోలగా తేలింది. నేను పాఠాన్నాపి, క్రమశిక్షణ లేకపోతే పాఠ్యభాగాలను సకాలంలో పూర్తిచెయ్యటం అసంభవమని వారికి నచ్చచెప్పాను. ఒక బాలిక తన చేతినెత్తి లేచినిలబడి, "నియమాలనందరూ యెరిగున్నా ఆచరణలో పెట్టొచ్చేటప్పటికి మర్చిపోతూ ఉంటాం" అని చెప్పింది.

"ఏమి నియమాలు?" అని నేను వింతతోచి అడిగాను.

"ఉపాధ్యాయులు మాట్లాడునప్పుడుగాని, పాఠం బోధించినంత సేపూగాని విద్యార్థులు మాట్లాడక వినాలి. అందరూ ఒక్క పెట్టున మాట్లాడనారంభిస్తే చివరికి మిగిలేది అర్థంలేని గోలే కనుక మాట్లాడ తలచుకున్న విద్యార్థి తన చేతి నెత్తాలి. గత టరమ్‌లోలాగే యీమారు కూడా 4 వ తరగతితో సోషలిస్టు పోటీ చెయ్యాలనికూడా నేను ప్రతిపాదిస్తున్నాను." అని ఆమె జవాబిచ్చింది.

"అవునవును" అని అందరూ సమ్మతించారు.

ఆమె మాటలతో ఆ ఉదయమంతా అల్లరిలేకుండాగడచిపోయింది.

ఆ గంట ఆఖరున ఒక బాలుడూ, ఒక బాలికా గదిలోనికి వచ్చారు. తుమ్మెద రెక్కలవంటి నల్లని శిరోజాలూ, నిగనిగ మెరిసే నల్లనికండ్లూ కల పన్నెండేళ్ళ ఆ అందమైన బాలిక నాఅనుమతిని పొంది, పిల్లలవైపు తిరిగి యీ విధంగా ప్రకటించింది. "మా 4 వ తరగతి విద్యార్థులం యీ క్రింది విషయాలలో మిమ్మల్ని సోషలిస్టు పోటీకి ఆహ్వానిస్తున్నాం. తరగతిలో చక్కని క్రమశిక్షణ, పాఠాలలో తీరని అభిరుచి, శ్రద్ధ, ఆరోగ్య సూత్రాల నమలు పరచుట. సిడ్నీ, నేనూ మా తరగతి ప్రతినిధులుగా యెన్నుకొనబడ్డాం. మీరు పోటీకి ఒప్పుకొన్నట్లయితే, మీరు కూడా ఇద్దరు ప్రతినిధుల నెన్నుకోండి. ఈ నలుగురు ప్రతినిధులూ తమ తమ తరగతులను అభివృద్ధిమార్గాన నడుపుతారు పోటీకి మీరు సిద్ధమేనా ?"

3 వ తరగతి విద్యార్థులు ఏకగ్రీవంగా ఆమోదించారు. ఆ బాలిక, తరగతి ఆఖరున తాము మరల వస్తామనీ, 3 వ తరగతి ప్రతినిధులుకూడ వుండి అభివృద్ధి సూచిక పట్టీని తయారు చేయుటలో తమకు తోడ్పడవలసిందనీ చెప్పి తిరిగి వెళ్ళిపోయింది. 3 వ తరగతి ఎన్నిక ప్రారంభమయింది. భూగోళపు తరగతిలో సోషలిస్టు పోటీని గురించి మాట్లాడిన ల్యూబా అనే బాలికా, ఉదయం అల్లరి చేసిన వారిలో ఒకడైన వోవా అనే అందమైన కళ్లుగల బాలుడూ ప్రతినిధులుగా యెన్నుకోబడ్డారు.

విద్యాలయం వదిలిపెట్టగానే ల్యూబా, వోవాలు నాదగ్గరకువచ్చారు. "అభివృద్ధి సూచకపట్టీ తయారు చెయ్యటంకంటె, టర్కిస్తాన్‌నుండి సైబీరియాకుపోయే రెండు రైళ్ళమధ్య పోటీగా యేర్పాటు చేస్తే బాగుంటుందేమో కామ్రేడ్ ? రెండు తరగతులకీ రెండు కొత్తగాకనిపెట్టిన రకాల రైలు యింజన్లు పెట్టి, గెలిచిన ఒక్కొక్క పాయింటికి ఒక్కొక్క స్టేషనుకు ముందుకు కదిపితే బాగుంటుంది" అన్నాడు వోవా.

"చాలా చక్కటి ఉద్దేశం" అని నేను ఒప్పుకున్నాను.

జూలియా, సిడ్నీలు పెద్ద డ్రాయింగు పేపరూ, పెన్సిళ్ళూ, పెయింటింగు సామాన్లూ తీసికొనిరాగానే ప్రతినిధులు నలుగురూ పని ప్రారంభించారు. రెండు యింజన్లను పెయింటు చేసారు. టర్కీ-సాన్, సైబీరియాల మధ్య స్టేషన్లు గుర్తుపెట్టి ఆ చిత్రాన్ని హాలులోని బోర్డుమీద అంటించారు. ఆ బోర్డుమీద యిదివరకే వ్యక్తులమధ్య సోషలిష్టు పోటీలకు సంబంధించిన పట్టికలనేకమున్నాయి. నేనాపట్టికలు చూస్తోన్న సమయంలో ప్రతినిధులు నలుగురూ పోటీకి సంబంధించిన ఆ మూడు విషయాలూ యెప్పుడెప్పుడే యేవిధంగా పరీక్షించాలో మాట్లాడుకుని నిర్ణయించుకున్నారు.

"రేపు ఉదయానికి రెండు తరగతులకూ క్రమశిక్షణ పుస్తకాలు సిద్ధంగా వుండాలి" అని జూలియా చెప్పింది. "వోవా, ప్రతి తరగతి చివరా ఉపాధ్యాయులచేత క్రమశిక్షణ విషయమై పుస్తకంలో నువ్వు సంతకం చేయించు. అలా చేసేటప్పుడు ముఖ్యంగా క్రమశిక్షణను భంగ పరచిన వ్యక్తులపేర్లుకూడా వ్రాయించు. ఆ విధంగాచేస్తే పోటీలో గెలవకుండా తరగతిని దిగతీస్తోన్నదెవరో సులభంగా తెలిసికోవచ్చును. మా తరగతి పుస్తకం విషయంలో నేను బాధ్యతవహిస్తాను. మొదటి విషయంలో ఈ యేర్పాటు సరిపోతుంది. ఇంక రెండవ విషయాన్ని పరీక్షించటానికికూడా పాఠాలయెడల శ్రద్ధకలిగి వున్నారా లేదా అనేది ఉపాధ్యాయులచేత యెప్పటికప్పుడు వ్రాయిస్తే సరిపోతుంది. తరగతి అధ్యక్షుడుకూడా ఒక పుస్తకంలో యీ విషయాలన్నీ వ్రాసుకుంటే యీ విషయాలను నిర్లక్ష్యభావంతోచూసి, తరగతిని దిగతీసే మహానుభావు లెవరో సమావేశాలలో మనమంతా తెలుసుకోటానికి అవకాశ ముంటుందనికూడా తలుస్తున్నాను."

"విద్యాలయ ఆరోగ్యశాఖవారు ఆరోగ్యపద్ధతుల విషయంలో పరీక్షిస్తే బాగుంటుందను కుంటాను. ప్రతివారమూ మనము ఇంజన్లు ముందుకు కదిపేటప్పుడు వారి నిర్ణయాలు తీసికొనిచేస్తే సరిపోతుంది" అన్నది ల్యూబా.

ఆ నిర్ణయాల తరువాత యెవరిండ్లకువారు బయల్దేరారు. వెళ్ళే ముందు ల్యూబా నాదగ్గరకు వచ్చి, యెంతో ఆతురతతోను, ఉద్రేకంగాను ఇల్లాచెప్పింది: "మన తరగతి తప్పకుండా గెలవాలి. ఒకటి. రెండు తరగతులుకూడా పోటీలో జేరుతున్నాయట. పోటీ మరింత బాగుంటుం

దీసారి. టరమ్ చివరకు ఎవరికి ఎర్రజెండా బహుమతి వస్తుందో! గడచిన టరమ్‌లో 4 వ తరగతివాళ్ళు కొట్టేశారు."

ఎర్రజెండాను సాధించటానికి నాశాయశక్తులా పనిచేయాలని నిర్ణయించుకుని, "తప్పక మనం పోటీలో గెలవాలి" అన్నాను. పోటీలో గెలవాలంటే యేంచెయ్యాలంటావు?" అని అడిగాను.

"పై విషయాలను భంగంచేసి యెవరూ తరగతిని దిగతియ్యకుండా చూడాలి—తరగతి సమావేశమొకటి జరిపి అందులో ఎర్రజెండా సాధించటానికిగల పద్ధతులన్నీ సమాలోచించాలి. త్వరలోనే జరగబోయే తరగతి అధ్యక్ష, మార్గదర్శి సంఘనాయకుల ఎన్నికల సమావేశంలో యీ విషయాలన్నీ నిర్ణయించుకుంటే బాగుంటుందనుకుంటాను," అని ల్యూబా చెప్పింది. తరగతి సమిష్టి అభ్యుదయంపట్ల ల్యూబా చూపే దీక్ష, పట్టుదల నాకాశ్చర్యాన్ని కలిగించాయి. ఆమె నమస్తే! చెప్పి యింటికి వెళ్ళిపోగానే, నేనుకూడా నా తరగతి పిల్లలతోబాటు కష్టపడి పనిచేసి ఎర్రజెండా సాధించటంలో నాశక్తికొలదీ వారికి తోడ్పడాలనే ఒక దృఢ నిశ్చయం చేసికొన్నాను.

బోర్డు మీదనున్న సోషలిస్టు పోటీ ప్రకటనలు కొన్ని చదివాను. ఇద్దరు విద్యార్థినులు అన్నింట్లోనూ మంచి మార్కులు సంపాదించవలెననీ, సంఘసేవ చెయ్యాలనీ నిర్ణయించుకున్నారు. సంఘ సేవట! దీని విషయం పూర్తిగా తెలిసికోవాలి. సోషలిస్టు పోటీవలన అభివృద్ధికికలిగే అనేకావకాశాల విషయమాలోచిస్తున్నాను. తరగతిలో క్రమశిక్షణను. పాఠాల యెడల అభిరుచిని అభివృద్ధిపరచుటకు యిట్టి పోటీలు చక్కని మార్గాలని నాకు నమ్మకం కలిగింది. బాల బాలికలలో యిట్టి పోటీలు యీర్ష్యాభావాలకు చోటిస్తాయేమోనని కూడా అనుమానం కలిగింది.

ఉపాధ్యాయుల గదిలో కామ్రేడ్ యంగ్ కలిసికొని, "ఏం కామ్రేడ్, పనెల్లా సాగుతోంది? అని అడిగారు.

"విద్యార్థుల్లో విపరీతంగా వ్యాపించి వున్న సోషలిస్టు పోటీ నాకెంతో ఆశ్చర్యాన్నీ, ఉత్సాహాన్నీ కలుగజేస్తోంది. దానివల్ల సత్ఫలితాలు కలుగుతున్నాయా?" అని నేను ప్రశ్నించాను.

"సత్ఫలితాలుకలుగుతున్నాయా అని నెమ్మదిగా అడుగుతారేమిటి? ఈ పద్ధతి ప్రకారమే మాదేశమంతా అభివృద్ధి పొందుతోంది-పరిశ్రమల్లో, వ్యవసాయంలో, జీవిత పథాలన్నింటిలో చెప్పలేనన్ని మార్పులు కలిగి

నదీ, అనంతమైన అభివృద్ధి కలిగినదీ యీ సోషలిస్టు పోటీవల్లనే. ఎందుకు, రోజులు గడచిన కొలదీ మీరే చూస్తారుగా దానివల్ల కలిగే సత్ఫలితాలు. అన్నట్టు, తప్పక మన విద్యాలయం మీద కలిగిన మీ అభిప్రాయాలను పొందుపరుస్తూ మన ఉపాధ్యాయ గోడ వార్తా పత్రికకు ఒక వ్యాసం వ్రాయాలిసుమా! పత్రిక సంపాదకుణ్ణి నేను వచ్చే సంచికను కొద్దిరోజుల్లోనే ప్రకటించాలి," అన్నారు యంగ్.

ఆచరణలో పురోగతికి, అభ్యుదయానికీ సోషలిస్టుపోటీ ఒక చక్కని మార్గమని తెలిసికొన్నాను. ప్రతిరోజూ యెవరెవరు అభివృద్ధి చెందుతున్నారో చూడటానికి వరండాలో బోర్డుదగ్గర బాలబాలికలు గుంపు గూడేవారు. 5, 6, 7 తరగతులుకూడా సోషలిస్టు పోటీ నేర్పాటు చేసికొన్నాయి. వారు ప్రకటించే అభివృద్ధి సూచక పట్టీలనుచూస్తే, పోటీలో యెవరు గెలుస్తారనేది నిర్ణయించటం చాలా కష్టంగా కనిపించేది. పోటీ వలన యీర్ష్యాభావాలు కలుగవచ్చుననే నా అనుమానాలకు, భయాలకు ఆస్కారమేమీ కనుపించలేదు. కొన్ని రోజులపాటు మా 3 వ తరగతీ 4 వ తరగతీ అభివృద్ధిమార్గాన సమానంగావున్నాయి. అప్పుడు జూలియా "కామ్రేడ్! రెండుతరగతులూ గెలుస్తే మరీ బాగుంటుంది కదండీ?" అన్నది నాతో.

ఆ మాటవిన్న వోవా "మన విద్యాలయంలో అన్ని తరగతులూ ఎర్రజెండాలు సాధించి, జిల్లాపోటీలో నిలబడితే ఇంకాబాగుంటుంది!" అన్నది.

ఈ మాట మా విద్యాలయపోటీకి ఒక నూతనరూపం కల్పించింది. మా విద్యాలయంలోని తరగతులన్నీ అభివృద్ధి చెందినట్లయితే జిల్లా పోటీలో నిలబడి ఎర్రజెండాను సాధించటానికి అవకాశముంటుంది. మా జిల్లా అభివృద్ధి చెందితే రాష్ట్రపోటీలలో పాల్గొనవచ్చును — యీ విధంగా అంతులేని అవకాశా లేర్పడ్డాయి.

నేను విద్యాలయంలో పని ప్రారంభించిన తదుపరి కొద్దిరోజులు పోయాక, మార్గదర్శి సంఘనాయకురాలు సోన్యా నన్ను కలిసికొంది. నల్లని ఉంగరాలు తిరిగినజుట్టూ, చిరునవ్వు లొలకబోసే కళకళలాడే చిన్నారి అందమైన ముఖమూ, తళతళమెరుస్తూ నాట్యమాడే నీల నయనాలూ కలిగిన పదునెనిమిదేండ్ల ఆ అందమైన అమ్మాయి మెడచుట్టూ ఒక ఎర్రని మార్గదర్శి సంఘ చిహ్నమైన రుమాలువుంది.

"ఈ టరమ్‌పనివి మీతో కలిసి చర్చించాలి కామ్రేడ్. నేను మార్గదర్శి సంఘ నాయకురాలి నైనప్పటికీ 3 వ తరగతి విషయంలో నాకెక్కువ బాధ్యతవున్నది. అందుచేత మనం తరుచు కలుసుకుంటో ఉంటాము" అని చెప్పింది.

ఆ అమ్మాయి యెంతో ఆకర్షణీయంగా, అందంగావుంది. ఆమె నవ్వులోనూ, నడకలోనూ జీవం తొణికసలాడుతూ వుంటుంది. విశ్రాంతి కాలంలో ఆమెచుట్టూ యెప్పుడూ పదిమంది జేరుతూవుంటారు. స్నేహపూర్వకస్వరాలు ఆమె నాహ్వానిస్తూవుంటాయి. విద్యార్థులలో ఆమెకుగల పలుకుబడీ, ఆమె అంటే విద్యార్థులకు కల ప్రేమా ఇంతా అంతా అని చెప్పలేము. బాలబాలికలలో చాలమంది మార్గదర్శి సంఘ బాడ్జీలు ధరించినవారే.

"మార్గదర్శి సంఘ బాధ్యతలు, కార్యక్రమమూ నాకు తెలియ చేస్తావ సోన్యా? సంఘసేవ అంటే యేమిటో, మార్గదర్శి సంఘసోవియట్ లంటే యేమిటో, సమావేశా లెప్పుడెప్పుడో నాకు తెలియచెప్పు" అని నేనామె నడిగాను.

"విద్యలో స్థాయిని అభివృద్ధి పరచటమూ, విద్యార్థులకు స్వయం శిక్షణ నలవరచుకొనుటలో తోడ్పడి విద్యాలయ క్రమశిక్షణను కాపాడటమూ మార్గదర్శి సంఘ ప్రధాన బాధ్యత. విశ్రాంతికాలంలో విలాస కరమైన ఆటల నేర్పాటు చేయడమూ, వేసవికాల, శీతకాల విజ్ఞానయాత్రలను నడపటమూ, ఆటల పోటీలను జరపటంకూడ మా పనులే. ఉపాధ్యాయుల సన్నిహిత సహకారంతో పనిచేస్తూ అన్నివిధాలావారికి సహాయభూతంగా వుంటాము. ముప్పదిమంది మార్గదర్శులొక సంఘంగా ఏర్పడతారు. ప్రతి సంఘంలోనూ రెండు మూడు జట్లుం (యూనిట్లు) టాయి. ప్రతి జట్టుకీ ఒక నాయకుడూ. ప్రతిసంఘానికీ ఒక సోవియటూ యెన్నుకోబడతారు. ఈ విధంగా విద్యాలయాల్లో స్వయంపరిపాలన ఏర్పాటు చేశారన్నమాట. మొత్తం విద్యాలయానికి ఒక సోవియట్ ఎన్నుకోబడుతుంది. విద్యాలయ నిర్వహణలో యీ సోవియట్ అతి ప్రముఖమైన పాత్రను వహిస్తుంది." అని సోన్యా చెప్పింది.

"సంఘసేవ అంటే యేమిటో చెప్పలేదు" అని మళ్ళీ అడిగాను.

"సంఘాభ్యుదయానికై వ్యక్తి ఇచ్ఛాపూర్వకంగా చేసేసేవే సంఘసేవ. సోవియట్ యూనియన్‌లో ప్రతిపౌరుడూ సంఘసేవచేస్తూ

వుంటాడు. అదేవిధంగా బాలబాలికలుకూడా చేస్తారు. సంఘసేవ చెయ్య దలచినవారు తరగతి మానిటర్లుగానో, గ్రంథాలయ కార్యాల్లోనో జట్టు నాయకులుగానో, తరగతి అధ్యక్షులుగానో చేరి పనిచేస్తారు. ఈ పని ఇచ్ఛా పూర్వకమే అయినా, యిప్పటి కప్పుడే ఒక ఆచారంగా, సాంప్ర దాయంగా విద్యార్థుల్లో వ్యాపించి, వారిని సమిష్టి క్షేమానికై సంఘసేవా తత్పరులనుగా తయారుచేస్తోంది. ఒక్కొక్కసారి సంఘసేవ చేయదలచు కున్న బాల బాలికలకు యే పని చూపించటానికీ నా తల ప్రాణం తోకకు వస్తుంది. సంఘసేవ అంటే వారిలో అభిరుచి అంతయెక్కువగావుంది." అని ఆమె చెప్పింది.

ఆమె పట్ల అప్పటికే నాకు తీరని ప్రేమ, స్నేహము కలిగి, ఆమెతో పనిచెయ్యటంతో ఉత్సాహజనకంగా, ఆనందదాయకంగా వుంటుందని తలచాను. "టరమ్ కార్యక్రమాన్ని చర్చించు కోటానికె క్కడ కలిసికొందాం?" అని అడిగాను.

"వారంలో ఐదవరోజును 3 వ తరగతికి మార్గదర్శి సంఘదినంగా నిర్ణయిద్దాం. ఆవేళ తరగతుల తదుపరి జట్టుసమావేశాలుగాని, మార్గదర్శి సంఘ సోవియటు సమావేశంగాని, సినిమాకో, వస్తు ప్రదర్శనశాల (మ్యూజియం) కో విజ్ఞాన ప్రయాణంగాని ఏర్పాటు చేద్దాం. ఈసమావేశా లన్నింటికీ మీరు హాజరవుతారని ఆశిస్తున్నాను. 3 వ తరగతిలో మార్గ దర్శులెవరయినా క్రమశిక్షణకు భంగకరంగా ప్రవర్తించినా, చదువుపట్ల శ్రద్ధచూపకపోయినా నాకు వెంటనే తెలియచేస్తే, యీవిషయం మాజట్టు సమావేశాల్లో చర్చకు పెడతాను. అప్పుడప్పుడు నేనుకూడా మా మార్గ దర్శుల ప్రవర్తన విషయంలోను, చదువు విషయంలోను యేవిధంగా వుంటున్నారో చూడటానికి తరగతితో హాజరవుతూవుంటాను. ఈవారం 6 వ రోజున జట్టు, సంఘ ఎన్నికలు జరుపుదాం మీరు కూడా తప్పక రండి." అని ఆమెకోరింది.

నేను ఎన్నికలకు హాజరవుతాననీ, మార్గదర్శి సంఘ సమావేశాల న్నింటికీ వస్తాననీ ఆమెకు మాట యిచ్చాను. ఈ ద్వంద్వ ప్రభుత్వము జయప్రదంగా కొనసాగుతుందా అని నాలో ఆశ్చర్య, సంకోచాలు కలి గాయి. సోన్యాకు వ్యక్తిత్వం విషయంలోను, ఆత్మధైర్యం విషయంలోను యేమీ లోటులేదని త్వరలోనే గ్రహించాను. ద్వంద్వ ప్రభుత్వ విషయం అనుకునేటంత సులభమైనది కాదని తోచింది. ఈ అధికారాలమధ్య పోరు

# మాతా శిశు రక్షణ

సంస్థలు

1913 | 1937

9 | 4,384

44,000 | 48,200,000



సహాయం పొందినవారి సంఖ్య

శిశువులకు క్రెచీలు

1914 | 1938

550 | 723,651



పక్కలు

కిండెర్ గార్టెన్‌లలో శిశువుల సంఖ్య

1927 — 107,500

1936 — 1,056,800



వేసవికాలంలో పిల్లలు ఆడుకొనే ఆటస్థలాలు

1927 — 192,900

1936 — 3,214,500



పులే జనిస్తే బాలబాలికలలోకూడ చీలికలు కలుగవచ్చునని అనుమానం కలిగింది.

సోన్యాతోమాట్లాడిన తరువాత క్రమశిక్షణను మరొక దృక్పథం నుండి చూడటం నేర్చుకున్నాను. ఒక విభిన్న సమాజవిధానంలో ఒక కొత్తరకపు క్రమశిక్షణా సాంప్రదాయాన్ని నిర్మించటం అవసరమనేది నేను గుర్తించాను. ఈ నూతన సమాజంలో, తామెందుకు విద్య నభ్యసిస్తున్నారో గ్రహించినట్టి, తమ విద్యాలయాలు సమాజంలో యెంతటి ప్రముఖపాత్రనువహిస్తున్నాయో గుర్తించినట్టి, తమ విద్యాభ్యాసానంతరం తామే తమ విశిష్ట నూతన నిర్మిత సమాజాభివృద్ధికి పాటుపడవలెనని నిర్ణయించుకున్నట్టి విద్యార్థులలో ఒక నూతన క్రమశిక్షణా విధానము నమలు పరచవలసిన అవసరం కలిగింది. ఈ సమాజంలో నిర్బంధ క్రమశిక్షణ లేదు. 'దండందశగుణ భవేత్' అనే సూత్రానికి తావులేదు. నిర్బంధ విద్య శాసనబద్ధం చేయబడినదికదా అని యిష్టవ్యతిరేకంగా యెవరూ చదవరు. క్రమశిక్షణవిషయంలో ల్యూచా, జూలియా, వోవా, సిడ్నీ మొదలైన చురుకైన పిల్లలిచ్చే సమాధానమిదిగో — ఎప్పుడైనావారు క్రమశిక్షణకు వ్యతిరేకంగా ప్రవర్తించారంటే దానికి కారణం, పాఠమంటే వారికిగల విపరీతమైన అభిరుచి, సమాధానాలు యెవరికివారే తామంటే తాము చెప్పాలనే ఆతురతా, మరపులే కారణం. ఉపాధ్యాయులను ఉద్దేశపూర్వకంగా అల్లరిచేద్దామనిగాని, తిప్పలు పెడదామనిగాని, గడిచినక్షణం మరెన్నడూ తిరిగిరాని విలువైన కాలాన్ని వృథాపుచ్చుదామనిగాని యెంత మాత్రమూకాదు. చదువంటే వారికిగల అభిరుచికి హద్దులేవంటే అతిశయోక్తికాదు. అన్నింటికన్న ముఖ్యంగా వారు సమాజంలో ఉన్నతమైన ఉపయోగకరమైన స్థానాలాక్రమించాలంటే స్వయంశిక్షణ నలవరచుకోవాలి.

5 వ రోజున మా తరగతిలోకల్లా తెలివైనదైన ఎల్గా "జ్ఞాపకముందా కామ్రేడ్, యీ వేళే మార్గదర్శి సంఘదినం. తప్పక వస్తారు కాదూ ?" అని హెచ్చరించింది.

మార్గదర్శి సంఘసమావేశం జరిగేగది యేమంత పెద్దది కాదుగాని అందంగా, ఆకర్షణీయంగావుంది. లెనిన్ విగ్రహానికి వెనుకగా వ్రేలాడ కట్టబడిన ఎర్రజెండాలు గదికొక అపూర్వమైన శోభను చేకూరుస్తున్నాయి. గోడలమీద చిత్రాలు, పట్టికలు వ్రేలాడుతున్నాయి. ఒక మూలనున్న అద్దాల బీరువాలో సంగీత సాధనాలు, కేరమ్సు, చదరంగం మొదలైన

ఆటసామానులు ఉన్నాయి. చదువుకోదలచిన వారికిగాని, ఆడుకోదలచిన వారికిగాని మేజాలు, కుర్చీలు సిద్ధంగా అమర్చబడివున్నాయి.

మా తరగతిలో 30 మంది మార్గదర్శ లోకసంఘంగా యేర్పడ్డారు. మార్గదర్శులగది అంతా బాలబాలికలతో కిటకిట లాడుతోంది. ఎల్గా తన పక్కనే నాకు చోటు చూపింది. కొద్ది నిముషాలలోనే సోన్యా చెప్పిన ప్రకారం బాలబాలికలు మూడుజట్లుగా విడిపోయి జట్టునాయకుల ఎన్నికలు ప్రారంభించారు. ఈ ఎన్నికలు పిల్లలు తమంతట తామే జరుపు కుంటు న్నారు. కోలాహలం మహజోరుగావుంది. వెకిలిచేష్టలు, వేళాకోళాలుగాని కొట్లాటలు పోట్లాటలుగాని మచ్చునకైనా కనిపించలేదు. సోన్యా ఒకజట్టు తరువాత మరొకజట్టు దగ్గరకు వెళ్తోంది. నేను ల్యూబా, వోవాలున్న జట్టులో కూర్చున్నాను.

హాస్యధోరణి కలిగి, నిశ్శబ్దంగావుండే మిల్టన్ నెన్నుకోవాలా ఎప్పుడూ అల్లరిచేసినా పాఠాలుమటుకు బాగా చదివే ఎలియనార్ నెన్ను కోటం మంచిదా అని చర్చించి, చివరకు మిల్టన్ తెలివైన విద్యార్థి అయి నప్పటికీ, యెక్కువ భావాలను వెలిబుచ్చి జట్టు సమావేశాలను యెక్కువ ఉత్సాహవంతం చేయగలిగిన ఎలియనార్‌నే ఎక్కువమంది చేతులనెత్తి ఎన్నుకొని, మిల్టన్‌ను ఆమెకు సహాయకారిగా వుండునట్లు నిర్ణయించి ఉపనాయకునిగా ఎన్నుకున్నారు.

ఒక పావుగంటలో మూడు జట్లూ తమనాయకుల నెన్నుకొని,సోవి యట్ నెన్నుకొనుటకుగాను తిరిగి సోన్యా అధ్యక్షితను సమావేశమయారు.

"మొత్తం సోవియట్‌లో 5 గురుసభ్యులుండాలి. ఇంతకుముందే యెన్నుకొన బడిన జట్టు నాయకులు ముగ్గురూపోను, గోడవార్తాపత్రికకు సంపాదకులుగా ఒకరు, విజ్ఞాన కార్యక్రమాన్ని నడుపుటకొకరు వుంటే సరిపోతుంది. పేర్లు సూచించండి కామ్రేడ్స్" అని ఆమె కూర్చుంది.

'చక్కనిచిత్రాలు గీస్తాడు కనుక' జార్జిపేరూ, 'సొంపుగా వ్యాసాలు రాస్తాడు కనుక' ఫిలిప్ పేరూ సూచించబడ్డాయి. చర్చకొంతసేపు జరిగాక జార్జితనంతటతానే, తనకన్న ఫిలిప్పే సంపాదకుడుగావుంటే బాగుంటుం దని, తాను సహాయ సంపాదకుడుగా వుంటాననీ సూచించాడు. అతని సూచనను విద్యార్థులందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. రాయా అనే బాలిక వైజ్ఞానిక దళనాయకురాలుగా యెన్నుకొన బడిన తరువాత సమా వేశం ముగిసింది. సోవియట్ సభ్యులయిదుగురూ వెనుక దిగబడ్డారు.

సంఘసోవియట్, నెలకొకమారు గోడవార్తాపత్రిక ప్రకటించుట కును, జనవరి 21 లెనిన్ దినోత్సవంనాడు ఒక ప్రత్యేకసంచికను ప్రక టించుటకును, నిర్ణయించుకొన్నారు. కొద్దిరోజుల్లోనే విజ్ఞాన, వినోద యాత్రలకు ఒక కార్యక్రమం తయారు చేస్తానని రాయా ప్రకటించింది. వచ్చేవారాంత సమావేశ సమయానికి జట్టు నాయకులందరూ తమ తమ నెలసరి కార్యక్రమాలను సంసిద్ధం చేయాలని నిర్ణయింపబడింది. సోవి యట్ అధ్యక్షురాలిగా ఎలియనార్ యెన్నుకొన బడిన అనంతరం సమా వేశం సమాప్తి చెందింది.

మార్గదర్శులగది విడిచి వెళ్తోంటే "బాలబాలికల సినీమాహాలుకు యేదో కొత్త సినీమా వచ్చిందట మీకూ్కడా ఒక టిక్కెట్టు తీసికోనా కామ్రేడ్?" అని అడిగింది రాయా.

"తప్పకవస్తా టిక్కెట్టెంత?" అని నేనడిగాను.

పెద్ద తరగతికి 50 కోపెక్కులని ఆమె చెప్పగానే యెంత చవుక అని ఆశ్చర్యపడి టిక్కెట్టుకు డబ్బిచ్చాను.

"సోన్యా! యీ చిన్నారి బాలబాలికలకు అన్ని విషయాల్లోనూ గల శ్రద్ధా భక్తులు నామనస్సును చూరగొంటున్నాయి. వారి లేత మన స్సులు అకాల పక్వాన్ని పొందుతున్నాయేమోనని అనుమానం కలుగు తోందికూడా" అంటూనేను సోన్యా నడుగుతోండగా ఉపాధ్యాయుల గదికి వచ్చాను.

"అబ్బే అల్లాగెప్పుడూ జరగదు. పదిదాటని పిల్లలందరికీ తరగ తిలో యే కొద్ది బాధ్యతలో, ఆత్మ ధైర్యాన్నల వర్చుకుంటూ స్వతంత్రంగా మెలగుట నేర్చుకోటమో తప్ప యదార్థానికి మరెట్టి బాధ్యతలూ వుండవు. ఆఖరుకి 3 వ తరగతిలోకూడ బాలబాలికల మనస్సులకు యేమాత్రము విసుగుగాని, కష్టముగాని కలుగ నంత మాత్రమే పని కల్పిస్తాము. మోయలేని బరువును వారిమీద యెన్నడూవేయం. ఇప్పుడు వారుచేసేపని వారిశీల నిర్మాణాని కత్యవసరమని నాదృఢ నమ్మకం" అన్నది సోన్యా.

"అయితే, నువ్వు మార్గదర్శి శిక్షణ పొందిన దెక్కడ?" అని నేనడిగాను.

"ఓ! నాజీవితమంతా మార్గదర్శి సంఘాల్లో పని చేస్తూనే వున్నాను," అని ఆమె నవ్వింది. "నా 15 వ యేట యువజన కమ్యూ నిస్టు సమితిలో జేరి, కొంతమంది బాల మార్గదర్శులకు శిక్షణనిచ్చే సంఘ

సేవాబాధ్యత తీసి కొన్నాను. ఒక సంవత్సరం తదుపరి విదేశీ భాషలను
నేర్పేపాఠశాలకు వెళ్ళినప్పుడు అప్పుడప్పుడీ విద్యాలయానికి మార్గదర్శి
సంఘ నాయకునకు సహాయపడుటకును, ఇంగ్లీషు నేర్చుకునేటందుకును
వచ్చేదాన్ని. విదేశీ భాషాలయంలో పని పూర్తవగానే యీ విద్యాలయంలో
పని ప్రారంభించాను. నాకు ముందుగావున్న మార్గదర్శిసంఘ నాయకు
రాలు పై చదువుకయి విశ్వవిద్యాలయానికి వెళ్ళింది మార్గదర్శి నాయ
కులకు జరిగేవారం వారీ తరగతులకు హాజరయి మార్గదర్శి సమస్యలను,
వాటి పరిష్కారపద్ధతులను నేర్చుకుంటున్నాను. బాలబాలికలకు సహచారి
ణిగా పనిచేసి, వారి విశ్రాంతికాలమును ఉపయోగకరమైన పద్ధతిలో విని
యోగించటం మాత్రమే నా బాధ్యత " అని ఆమె చెప్పింది.

మానసిక ప్రకోపాలకూ, చిత్తవికార విభ్రమాలకూ లోనుగాకుండా
చిన్న పెద్ద విభేదంలేకుండా అందరిలోనూ పలుకుబడి కలిగిన సోన్యా
చక్కని మార్గదర్శి సంఘ నాయకురాలని నేను గ్రహించాను. అవసర
మున్నచోట, తప్పులున్నచోట మొగమోటంలేకుండా తీవ్రంగా విమర్శించి
నప్పటికీ, యెవరయినా కష్టాలు వెల్లడించి సలహా సంప్రదింపు లర్థించు
వప్పుడు మాత్రం యెంతో సానుభూతితో విని, తనకుతోచిని నివారణో
పాయాల నెంతో ఓపికతో చెప్పేది. ఒక్కొక్కసారి ఆమె మరుపు వలన
పొరపాట్లుచేసి, ఉపాధ్యాయులకు ఖంగారు కలిగించినా త్వరలోనే తన
తప్పును గుర్తించి పునః స్ఫూర్తిగా క్షమార్పణకోరి, పరిస్థితులు శృతి
మించి రాగాన బడక ముందే సర్దుకొని పోతూండడం మూలాన ద్వంద్వ
ప్రభుత్వ చిహ్నాలుగాని, విద్యాలయ నిర్వహణలో ఏకోన్ముఖతను కొర
వడ చేయుటగాని లేకుండా సరిపెట్టుకు పోయేది.

మార్గదర్శిసంఘం ఒక బలీయమైన విద్యాసంస్థఅనీ, విద్యార్థులా
నందదాయకంగా, ఉపయోగకరంగా తమ కాలాన్ని వినియోగించేందుకు
మార్గదర్శులు తోడ్పడుతూ ఉపాధ్యాయుల కృషిలో సహాయకులుగా
వుంటారనీ యీ పై విషయాల వలన మనంసులభంగా గ్రహించవచ్చును.

నేను పని ప్రారంభించాక రోజులు గడచినకొద్దీ, సోవియట్ విద్యా
విధాన మూలమును గ్రహించినకొలదీ విద్యార్థుల జీవితాలలోనేకాక, వారి
తలిదండ్రుల జీవితాలలోకూడ ఉపాధ్యాయులెంతటి ప్రముఖపాత్రను
వహించుతారో గ్రహించ గలిగాను.

యువజన తరాలను నూతన సమాజనిర్మాతలుగా తయారు చేయవలసిన బహుభారమైన బాధ్యత సోవియట్ ఉపాధ్యాయుల భుజస్కంధాలపై వుంది. ఉపాధ్యాయులకు విద్యావిషయిక జ్ఞానమొక్కటేవుంటే సరిపోదు; విద్యార్థుల మానసికాభివృద్ధిలోని ఎగుడు దిగుళ్ళను సరిచేయుటకుగాను వారికి మానసిక తత్వశాస్త్ర పరిజ్ఞానంకూడ అధికంగావుండాలి. అంతేకాదు, సోవియట్ ఉపాధ్యాయులకు వివిధవిషయజ్ఞానం అత్యధికంగా వుండాలి. వారు ప్రత్యేకంగా సోవియట్ యూనియన్‌లో సాధింపబడిన అతి నవీన పరిశోధనలేకాక, అంతర్జాతీయంగా సాధింపబడిన నూతన పరిశోధనలుకూడ తెలిసికొని వుండాలి. సోవియట్ యూనియన్ రాజకీయ నిర్మాణము, ప్రభుత్వసంస్థలు, ఉత్పత్తి కార్యక్రమాలు, యితర కార్యక్రమాలన్నీకూడ తెలుసికొని వుండాలి. ఇంతెందుకు సోవియట్ ఉపాధ్యాయు లెవరన్నా కానీయండి. ప్రతిదినమూ ఆత్మాభివృద్ధికై పాటుపడి చదివి, దైనందిన సమస్యలను గ్రాహ్యము చేసికొని. అతినవీన విషయపరిజ్ఞానాన్ని సంపాదించుకుంటేగాని, దినపత్రికల నతిశ్రద్ధగా పఠిస్తూ అనుదినమూ మున్ముందుకు పోతోన్న ప్రపంచపరిస్థితులను గ్రాహ్యము చేసుకొనే సోవియట్ బాలబాలికలకూ, త్వరత్వరగా తరలిపోయే కాలానికి వెనుకబడి పోతారనేది సత్యవిదూరమైన విషయంకాదు.

3 వ తరగతిలో నా సంవత్సరకాలపు పనిలో, నే నెన్నో విలువైన అనుభవాలను సంపాదించటమేకాక, యెంతో జ్ఞానాన్నిగూడ సమకూర్చుకున్నాను. నన్ను చిక్కులుపెట్టిన కొద్దిమంది విద్యార్థుల విషయంలో వారి గృహపరిస్థితులను, జీవితంపట్ల వారి దృక్పథాలను గ్రహించి, వాటి ననుసరించి వారితో ప్రవర్తించుటద్వారా మాత్రమే వారిని సరియైన మార్గంలోనికి గొనివచ్చి, మంచి విద్యార్థులనుగా చేయగలిగాను.

తరగతి మొత్తంమీద బాలబాలికలందరూ చాల తెలివైనవారు, విజ్ఞానోపార్జనయెడల తీరనికోరిక గలవారే. ఇక నవీన విషయాలపై వారు సాగించే వాదోపవాదాలు, అత్యాధునికమైన అనేక జాతీయ, అంతర్జాతీయ ఘటనలయందు వారికిగల ప్రతిభావంతమైన అపూర్వ జ్ఞానాన్ని వెదజల్లుతూ వుంటాయి. అల్లరివిషయంలో, యే జాతికి చెందిన ఆయీడు బాలబాలికలకూ వారు తీసిపోరు.

ఇంగ్లండు, అమెరికాలనుండిగాని, ఇంగ్లీషు మాట్లాడు మరే యితర దేశమునుండిగాని వచ్చిన బాలబాలికలకు, సోవియట్ విద్యార్థులు

ఒకరిపట్ల మరొకరుగాని, తమ ఉపాధ్యాయులపట్లగాని ప్రవర్తించేపద్ధతి అలవడటం చాలకష్టం. ఈ కొత్తపిల్లలకు తాము 'పితూరీలు చెప్పటం, గౌరవానికి భంగకరంగా ప్రవర్తించటం' అవి నీచంగా తలిచే విషయాలు సోవియట్ యూనియన్‌లో గౌరవ ప్రదము, ఫలవంతము. నిర్మాణాత్మకముఅయిన 'బోల్షివిక్ ఆత్మవిమర్శ', 'సోషలిస్టు విమర్శల' రూపంలో జరుగుచుండుట అమితాశ్చర్యాన్ని కలిగిస్తాయి. బహిరంగ సమావేశాల్లో విస్పష్టమైన, విశితమైన, నిర్మాణాత్మకమైన విమర్శ సాగించుటద్వారాను, విద్యార్థుల, ఉపాధ్యాయుల ఐక్యకృషిద్వారాను సోవియట్ విద్యాలయాలలో సంస్కృతిని ఉన్నతస్థాయికి కొనిపోతున్నారనే సత్యాన్ని వీరు గుర్తించాలి. సోషలిస్టు విమర్శకూ, పితూరీలు చెప్పటానికీ మధ్య ఎంత భేదమున్నదో వీరు గ్రహించటానికి కొంతకాలం పట్టవచ్చును.

బోధనా విషయాల్లో యే విధమైన కష్టాలు కలిగినా ప్రిన్సిపాలో, కామ్రేడ్ హాలండో, సోవియట్ బోధనాపద్ధతుల్లో ఆరితేరిన యే ఉపాధ్యాయినో తన విలువైన సలహాలనిచ్చి నాకు సహాయపడేవారు. ఈ సలహాలన్నింటికన్న విద్యార్థులతో ప్రవర్తించుటలోను, బోధనాపద్ధతుల్లోను నా స్వానుభవమే యెక్కువగా నాకు తోడ్పడింది. విద్యార్థులను శిక్షించుట సోవియట్ యూనియన్‌లో చట్ట విరుద్ధమైన పనికాన కొన్ని సమస్యలను పరిష్కరించుటలో యితరుల అనుభవాలను, సహాయ సహకారాలను స్వీకరించుటే మంచిపనిగా తోచేది.

నా తరగతిలోని పెంకిపిల్లల్లో ఒకడైన రేమండు మొదట్లో చాల బద్దకస్తుడనీ, చదువంటే శ్రద్ధలేనివాడనీ అనుకున్నాను. అడిగిన ప్రతి ప్రశ్నకూ అతడిచ్చు "నాకు తెలియదు" అనే జవాబు విన్నప్పుడు అసలతనికి తెలుసుకోవాలని ఆసక్తయినా వుందా అని అనుమానం కలిగేది. కాని ఒకరోజున తరగతి చివర అతనిని పరీక్షచేసినప్పుడు గణితంలో అతనుచూపిన నైపుణ్యం, చురుకుదనం నాకు విపరీతమైన ఆశ్చర్యాన్ని కలిగించాయి. "మరైతే తరగతిలో యెందుకు చెయ్యవు నువ్వు?" అని అడిగాను. "చేస్తే యేం లాభం? నేను పెద్దవాడినయాక విమాన నిర్మాత నవటమే నా ఆదర్శం. దానికల్లా కొలతలు కొలవడం మాత్రమే కావాలి. అవి నాకు బాగా రానే వచ్చును" అంటూ జవాబిచ్చాడు.

నేను రేమండ్ తల్లిని కలిసికొన్నప్పుడు ఆమె రేమండ్ మాటలను ధృవపరచింది. ఇంటివద్ద అతనెప్పుడూ విమానాల నమూనాలను

తయారు చేస్తుంటాడనీ, విద్యాలయంలో యింటికిచ్చిన పనిని చెయ్యమని తా నెంతగాపోరినా నిష్ప్రయోజనమే అయిందనీ, విమానాలు తప్ప అత నికి వేరుయావ వేరు లోకములేదనీ అతనితల్లి చెప్పింది.

తరువాత రేమండ్‌తో నేను మాట్లాడినప్పుడు విమానాల ప్రసక్తి తెచ్చి, విద్యాలయ విమానాల నమూనాలు తయారుచేసే సమితిలో చేరక పోయావా అని అడిగాను. "వాళ్ళుచేసే నమూనాలన్నీ యిదివరకే నేను చేశాను. అందులో జేరితే పాడినపాటే పాడు దాసరి తంతుగా వుంటుంది. నా పని" అన్నాడు అయితే మనజిల్లా సాంకేతిక విద్యాలయంలో జేరరాదా అని నే నిచ్చినసలహాకు ఎగిరి గంతువేసి అంగీకరించాడు. "నువ్వు చక్కటి విమాన నిర్మాతవవాలంటే రేమండ్, గణితశాస్త్రం చక్కగా అభ్యసించాలి. దశాంకాలూ, భిన్నాలూ బాగా నేర్చుకోవాలి. ఏయే ప్రదేశాల్లో నీ విమానం ప్రయాణంచేస్తుందో, ఆయాచోట్లలో ఎల్లాంటి శీతోష్ణపరిస్థితులుంటాయో నువ్వుతెలిసికోవాలంటే నీకు భూగోళం, పదార్థ విజ్ఞానశాస్త్రంకూడా వచ్చియుండాలి. వీటన్నిటినీ బట్టి నువ్వు బాగా విద్య నభ్యసించ వలసిన అవసరాన్ని గుర్తించావని తలుస్తు న్నాను. ఏదెల్లావున్నా రేపే నిన్ను జిల్లా సాంకేతిక విద్యాలయంలో జేరుస్తాం. ఈ సంగతి మీ తల్లితోకూడ చెప్పు" అని చెప్పాను.

రేమండ్ వెళ్ళిపోగానే జిల్లా సాంకేతిక విద్యాలయంలో విమానాల నమూనాలు తయారుచేసే తరగతి నాయకునకు ఫోనుచేసి సంగతంతా వివ రించి చెప్పాను. అవసరమైనదంతా చేయటానికి సిద్ధంగావున్నానని అతను జవాబిచ్చాడు.

సాంకేతిక కేంద్రంలో తరగతి నాయకుని సహాయంతో త్వరలోనే రేమండ్ పాఠాలలోను, తరగతి కార్యక్రమాలలోను అభిరుచిని, ఆసక్తిని చూపనారంభించాడు. సాంకేతిక కేంద్రంలోని విమానశాఖకు త్వరలోనే కార్యదర్శి అయాడు. తరగతి అనంతరం వారానికి రెండుమార్లు హాజ రవుతూ, యితరులనుకూడ ఉత్సాహ పరచి కేంద్రంలో చేర్చాడు. సాంకే తిక కేంద్రానికి చెందిన వస్తువుల నతి భద్రంగా చూస్తూ, తరగతికి తప్పక విద్యార్థులందరూ హాజరయ్యేటట్లు కృషిచేసేవాడు. తరగతికి ఉపనాయ కుడవ కలిగి నందుకు చాల గర్వము, ఆత్మసంతృప్తి పొందాడు. ఇన్నెం దుకు, తరగతి నాయకుడు చెప్పిన 'రేమండ్ చాలసమర్థుడయిన కార్య దర్శి' అన్న వాక్యంవల్లనే అతనిలో కలిగిన అపారమైన మార్పును

మనం సులభంగా గుర్తించ వచ్చును. విమాన శాఖలో ఇంజనీరు అవా లంటే ఒక్క కొలవడం నేర్చుకున్నంతమాత్రాన సరిపోదు, బాగా చదువు కోవాలని కూడా అతను గుర్తించడం అన్నిటికన్న ముఖ్యమైనవిషయం.

ఎప్పుడూ యింటికిచ్చిన పని చెయ్యకుండా, ప్రతిరోజూ విద్యా లయానికి ఆలస్యంగావస్తూ, పిల్లల నెప్పుడూ యేడిపిస్తూ, బాధిస్తూండే జార్జిఅనే యింకొక పెంకెపిల్లవాడుండేవాడు తరగతి సమావేశం జరిపి అతని విషయ మాలోచించాలని విద్యార్థులంతా కలిసి నిర్ణయించుకున్నారు. ఎంతో తెలివయిన ఆ బాలబాలికలు జరిపే సమావేశమెల్లా వుంటుందో చూడాలని నేను చాల కుతూహల పడ్డాను.

ఎల్గా అధ్యక్షత వహించింది. 'జార్జి విషయమై సమావేశం జరు గుతోంది. ఇష్టంలేనివారు. వెళ్ళి పోవచ్చును.' అని ఆమె హెచ్చరిం చింది. కాని యెవ్వరూ వెళ్ళి పోలేదు.

"మన తరగతి ఎర్రజెండా సంపాదించకుండా జార్జి దిగదీస్తున్నాడు. ఈ వారం జార్జిమూలాన మన ఇంజను 4 వ తరగతి యింజనుకన్న రెండు స్టేషన్లు వెనుక బడింది. అతనింటికిచ్చిన పని చెయ్యటంలేదు, ఆరోగ్య సూత్రాలను పాటించటంలేదు. సోదర విద్యార్థులతో మోటుగాప్రవర్తి స్తున్నాడు. ఇతని విషయంలో నిర్ధారణగా యేదో ఒకటి మనం నిర్ణయిం చాలి. మొదట యెవరు మాట్లాడుతారు ?" అని ఆమె ఉపన్యసించింది.

వోవా మొదలు పెట్టింది: "ఐదు రోజుల కాలమిచ్చి, అప్పటికి కూడ అతనభివృద్ధి కాకపోతే, తరగతి నుండి ఒక వారం రోజులుపాటు తొలగించి, అతనితల్లి దండ్రులకు తెలియపరచి, యింటిదగ్గర తనంతట తానే చదివేలా చేయాలి."

"మన తరగతిలోని విద్యార్థులు అతని విషయంలో అనవసర జోక్యం కల్పించుకోకుండా వుంటే అతనికి చాల సహాయం చేసనవారవు తారు. అతనేదైనా తప్పుచెప్పినప్పుడు కొంతమంది నవ్వుతూండేవారు. దానితో అతని పరిస్థితి మరింత చెడింది. ప్రతిరోజూ అతను యింటి కిచ్చిన పనిచేశాడాలేదా అనేది చూస్తూ అతనికి నేను సహాయం చేస్తూ వుంటాను, అతని పక్కనే కూర్చుంటాను. ఈ మన సమావేశాన్ని గురించీ, యిందులో మనంచేసిన నిర్ణయాలను గురించీ మన ఉపాధ్యా యిని జార్జితలిదండ్రులకు తెలియచెయ్యటంకూడా అవసరమను కుంటాను" అని ముఖాషియైన అలెక్ అనే బాలుడు చెప్పాడు.

"అతనికిష్టముంటే పని బాగానే చేస్తాడు" అన్నది రాయా. "గోదవార్తా పత్రికను ఆకర్షణీయంగా తయారు చెయ్యటానికెంతగా తోడ్పడ్డాడో చూడండి. చక్కని చిత్రాలుగీసి యిచ్చాడు. దీనిని బట్టి, అతను అనుకున్నంత చెడ్డపరిస్థితిలో లేడని తెలిసి కోవచ్చును."

"జార్జికి యింటి దగ్గర ఒక చెడ్డ స్నేహితు డున్నాడు. నేనొక రోజున జార్జియింటికి వెళ్ళినప్పుడే అతనువచ్చి మమ్మల్నిద్దరినీ మరుసటి రోజున విద్యాలయానికి స్వస్తిచెప్పి తనతో ఆటలకు రమ్మని ప్రోత్స హించాడు. నేను మార్గదర్శిననీ, అల్లాంటి పనులు నాకు గిట్టవనీ సమా ధాన మిచ్చాను. ఈ సంగతి మార్గదర్శి సంఘసమావేశంలో బయట పెట్తా నని జార్జికి నేను చెప్పేసరికి తానింక ముందా బాలునితో సహవాసం పూర్తిగా కట్టి పెట్టేస్తానని వాగ్దానం చేశాడు. నేనూ అంతటితో వూరు కున్నాను" అని చెప్పింది. యూజిని.

జార్జి చాల ఖంగారుపడి లేచి మాట్లాడ నారంభించాడు. "ఆబాలు నితో స్నేహం అప్పటినుండీ పూర్తిగా మానేశాను. నాకు అవకాశ మివ్వండి, తప్పక అభివృద్ధి కన పరుస్తాను ఆ బాలుడెప్పుడూ సినీమాకు రమ్మనీ, ఆటలకు రమ్మనీ లాక్కుపోయేవాడు. దానితో ఆ దురలవాట్లు నాలో బాగా ప్రబలి యింటికిచ్చిన పని చేసేవాణ్ణికాదు. ఈ నాటినుండి నా సమస్త విధాలా ప్రయత్నించి అభివృద్ధి చెందుతానని మాట యిస్తున్నాను. అలెక్ పక్కనే కూర్చోటం నాకూ యిష్టమే. అదెంతో ఉపయోగిస్తుందని కూడా తలుస్తున్నాను."

చర్చలు మరి కొంతసేపు జరిగాక అలెక్ సూచనకు ఆమోదం తెలుపుతూనూ, నేను జార్జి తల్లిని కలిసికొని సమావేశ పర్యవసానం తెలియచెయ్యాలనీ నిర్ణయింప బడింది. సమావేశానంతరం జార్జితో మాట్లాడాలని ఆగాను. అతనేదో చక్కని చిత్రాన్ని గీస్తున్నాడు. ఆకళలో అతనికి చక్కని నైపుణ్యముంది. "నీకు చిత్రకళ అంటే అభిరుచి అను కుంటానేమి జార్జ్" అని అడిగాను.

"చిత్రకళ అంటే నాకున్న యిష్టం యీలోకంలో మరిదేనిమీదా లేదు," అని జవాబిచ్చాడు.

"అయితే చిత్రకళా కేంద్రంలో యెందుకు జేరలేదు?" నేనడిగాను

"చాలకాలంక్రితమే చిత్రకళా కేంద్రంలో జేరుదామనుకున్నాను.

గాని, నాకుమార్కులు బాగా తక్కువ రావటం మూలాన సోన్యా పంప కుండా అట్టిపెట్టేసింది, " అని జవాబిచ్చాడు.

"నువ్వు తరగతిలో బాగా ప్రవర్తించి ఒక వారంరోజుల్లో నీ పనిలో అభివృద్ధి కనపరచినట్లయితే చిత్రకళా కేంద్రానికి నిన్నుపంపడం విషయంలో సోన్యాను నేను ఒప్పించటానికి ప్రయత్నిస్తాను. ఈ యేర్పాటుకి నువ్వనుమతిస్తావా ?" అని అడిగాను.

జార్జి ముఖం వికసించింది. "కామ్రేడ్ తప్పక అభివృద్ధిచూపి కళాకేంద్రానికి వెళ్తానని మాటయిస్తున్నాను" అంటూ నిశ్చయ పూర్వకమైన దృక్కులతో యింటికి వెళ్ళాడు.

ఆ రోజునుండి జార్జి అభివృద్ధిచెంద నారంభించాడు. అలెక్ స్నేహం అతనికి బాగా ఉపకరించింది. నేను కూడ అతనికి కష్టంగావున్న విషయాలలో సహాయంచేస్తూ అన్ని పాఠాలలోనూ అభివృద్ధి అయ్యేందుకు తోడ్పడ్డాను. తరగతిలో బాలబాలికలందరూ అతనితో స్నేహపూర్వకంగా ప్రవర్తించారు. మరుసటి సమావేశంలో ఎల్గా యెంతో సంతృప్తితో జార్జి తనమాట నిలుపుకున్నాడని ప్రకటించింది. చిత్రకళాకేంద్రంలో అతనుజేరి వారానికి మూడుమార్లు హాజరౌతూండేవాడు. ఏడాది తిరగకుండానే కేంద్రంలో తనప్రతిభను బాగా వ్యక్తంచేసి బాలబాలికల చిత్రప్రదర్శనంలో తన చిత్రాలెన్నిటికో స్థానం సంపాదించుకున్నాడు. అతనెంతో సగర్వంగా సమర్పించిన మసిబొగ్గుతో గీసిన చక్కని స్టాలిన్ చిత్రమిప్పుడు మా మార్గదర్శుల గదిలో వ్రేలాడుతోంది.

జార్జి తల్లిని విద్యాలయానికిపిలిచి గట్టిగా చివాట్లుపెట్టాను. జార్జి విషయంగాని అతని చెడుస్నేహాలను గురించిగాని ఆమెకేమీ పట్టినట్టు గానే లేదు. వట్టి తిరుగుడు పిట్టలా కనిపించింది. జార్జి పనిచేసేట్టుగాను, చెడుస్నేహాలు పట్టకుండా వుండేట్టుగాను చూసేటట్లు ఆమెవలన వాగ్దానం పొందాను. జార్జి 'చెడ్డ' స్నేహితుని చిరునామా నామెవద్ద గ్రహించి, అతను చదువుతోన్న విద్యాలయపు ప్రిన్సిపాలుతో, అతనిసంగతి సంప్రదించి, అతని జీవితాన్నికూడ సరిదిద్దాలని నిర్ణయించుకున్నాను.

తరగతిలోని యితరపిల్లలు జార్జితో ప్రవర్తించిన విధంనాకు చాల ఆశ్చర్యాన్ని కలిగించింది. సర్వ సాధారణంగా బాల బాలికలు తమలోతాము లోపాలను నిష్కర్షగా విమర్శించుకోటంలోగాని, ఉన్న మంచి అలవాట్లను, సద్గుణాలనూ యెత్తిచూపి వాటి నభివృద్ధి పరచుకొను

టకు తగిన ప్రోత్సాహ మిచ్చుకోటంకోగాని యే దేశంలోనూ ముందుకు రానంతగా సోవియట్ యూనియన్‌లో ముందుకువస్తారు. సమాజక్షేమానికి భంగకరమైన యే పనినిగాని యెవ్వరినీ చేయనియ్యరు. ఈ విషయమై జిమ్మీ ఉదాహరణ నొకటిచ్చి ఇంతటితో యీ విషయం ముగిస్తాను.

జిమ్మీ సమస్య నా మనస్సును చాలకాలం కలతపెట్టింది. పైన పేర్కొన్న యిద్దరి విషయాల్లోనూ. వాళ్ళ తల్లిదండ్రుల సహకారంతో సులభంగానే పరిస్థితులను చక్కబెట్టగలిగాను. జార్జి తల్లి అంతగా చదువుకున్నది కాకపోయినా, ఆమెతో మాట్లాడి ఆమెయింటిదగ్గర జార్జి విషయమై గైకొనవలసిన జాగ్రత్తలను బోధించగలిగాను. ఆమె తప్పక ఆజాగ్రత్తలను తీసికొంటుందనిగూడా నాకు నమ్మకంవుంది. జిమ్మీ విషయంలో అతని గృహ పరిస్థితిని ముందుగా సరిదిద్దవలసి వచ్చింది. ఆ పనిచేసేసరికి మా తలప్రాణాలు తోకలకు వచ్చాయి.

జిమ్మీ యింటికిచ్చిన పనినెప్పుడూ కాపీకొట్టేవాడు. తరగతిలో యెప్పుడూ పాఠాలు జరగకుండా అల్లరిచేసేవాడు. కాని జిమ్మీ అంటే మొదటినుండీ అదొక రకమైన యిష్టముండేది నా మనస్సులో. అదే కారణంగానేమో నేనూ అతనూ స్నేహంగా వుండేవాళ్ళం.

జిమ్మీ తల్లి యేమంత విద్యావతికాదు. విప్లవానికిముందు తనకు అక్షరజ్ఞానమే లేదనీ, తరువాతనైనా తన అనారోగ్యకారణంగా యెక్కువ చదువుకోలేక పోయాననీ ఆమె చెప్పింది. తన భర్త సోవియట్ ప్రభుత్వానికై యంత్రాలను కొనుటకు పంపబడిన సమయంలో కొంతకాలం పాటు అమెరికాలోవుంది. తిగివచ్చాక తన అవిద్యను పారద్రోలేందుకు సాయంసమయ విద్యాలయానికి హాజరయ్యేది. ప్రస్తుతం ఆమె 4 వ తరగతి పూర్తిచేస్తోంది—అంటే ఆమె జిమ్మీకన్న ఒక్కతరగతి మాత్రమే ముందున్నదన్నమాట। అందుచేతను, ఆమె యింగ్లీషు భాషాజ్ఞానం అతి స్వల్పమగుటచేతను ఆమె తన కుమారుని పనిని సరిచూడలేక పోతూ వుంది. ఇంక జిమ్మీ తండ్రి విరామంలేని పనితొందరలో యింటికెప్పుడూ చాల ఆలస్యంగా వచ్చేవాడు.

జిమ్మీ సమక్షంలో అతని తల్లికి ఇంటిదగ్గర అతని ప్రవర్తన విషయమై వారానికొకసారి విద్యాలయానికి తప్పకవచ్చి నివేదికనిస్తూవుండాలని చెప్పాను. అతని తండ్రి మరుసటివారంవచ్చి నన్ను కలిసికోవాలనీ అలా వీలు లేకపోతే కనీసం ఫోనుద్వారానైనా మాట్లాడాలనీకూడ చెప్పాను.

ప్రిన్సిపాల్‌ను జిమ్మీ తండ్రితో మాట్లాడే సందర్భంలో హాజరవ మని కోరాను. కాని ఆమె స్వయంగా తానే మాట్లాడుతానని చెప్పారు. వారు కలిసికొన్న సందర్భంలో జరిగిన సంభాషణను విన్నప్పుడు సోవియట్ యూనియన్‌లో వివిధశాఖలలో పనిచేసే వారిమధ్య యెంతటి గాఢమైన సుహృద్భావం నెలకొనివుందో నా మనస్సుకు తట్టింది.

తండ్రిగా తాను కొడుకుపట్ల జాగ్రత్తను తీసుకొనవలసిన తన ప్రధాన బాధ్యత నతడు నిర్లక్ష్యపరచినందుకు ప్రిన్సిపాల్ చివాట్లు పెట్టింది. ఇకముందునుండి సాధ్యమైనన్నిమార్లు యింటికివచ్చి తన కొడుకును కలిసికొని మాట్లాడి అతనిపనిని సరిచూసి జిమ్మీ అభివృద్ధిని గురించి కనీసం పక్షాని కొకమారైనా విద్యాలయానికి ఫోనులో తెలియ చేయమని గట్టిగా చెప్పింది. "ఇకముందుకూడ నీ కొడుకుపట్ల యెక్కువ శ్రద్ధను చూపకపోయినట్లయితే మీ కర్మాగార కార్మికసమితికి తెలియపరచి యీ ప్రధాన బాధ్యతా నిర్వహణకై నీ కెక్కువ అవకాశము కలిగించ వలసి వుంటుంది" అంటూ పూర్తిచేసింది.

జిమ్మీ విషయంలో ఎక్కువ శ్రద్ధవహిస్తానని జిమ్మీ తండ్రివాగ్దానం చేశాడు. జిమ్మీ యింటిదగ్గర ప్రవర్తించేవిధం తెలిసికోవాలనే వుద్దేశంతో నేను మరుసటివారం అతనియింటికి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను.

ఇంత మాత్రంతోనే జిమ్మీ పరిస్థితి సరియైన మార్గంలోకి రాలేదు. అతని విషయంలో సూచన ప్రాయంగా విజయాన్ని సాధించటానికే యెంతో ఓపికతో కూడిన అనేక మాసాల శ్రమ అవసరమయింది. జిమ్మీ విషయంలో తరువాత తరువాత మమ్మల్నెదురుకొన్న సమస్యలు, మేము వాటిని పరిష్కరించటానికి అనుసరించిన మార్గాలు తరువాత ప్రకరణాల్లో వర్ణించాను. సోవియట్ విద్యావిధానం సామాజిక శాఖలన్నింటితోను, విద్యార్థుల తలిదండ్రులతోను, బాలబాలికల పరిసరాలన్నింటితోను చాల దగ్గర సంబంధం కలిగి వుంటుందని యీ సమావేశంవల్ల నేను గ్రహిం చకలిగాను. సోవియట్ విద్యాలయాలు సమాజంలో ఒకభాగమేకాబట్టి సమాజమంతా బాలబాలికల జ్ఞానోపార్జనలోను, భావినిర్మాణంలోను, అభి వృద్ధి పెంపకాలలోను పాల్గొనాలి. బాలబాలికలయందు. విద్యాలయాని కెంత బాధ్యత వుందో తల్లి దండ్రులకుకూడ అంతే వుంది.

జిమ్మీ సమస్య చాల గడ్డుది. తల్లిదండ్రుల అశ్రద్ధవల్ల అబద్ధాల కోరుగా, మోసకారిగా తయారయ్యాడు. ఇంటివద్ద, విద్యాలయంలోను

అదుపులో వుంచుతోను (తలిదండ్రులుకూడ శ్రద్ధ వహించేలాగు విద్యాలయంవారు చూస్తూను.) ఖాళీ సమయంలో జిమ్మీని వివిధ కేంద్రాలలో జేరుస్తూను అతనికి క్రమక్రమంగా తరగతులెగకొట్టి వీధుల వెంబడి తిరుగుతూ కాలం వృధా పుచ్చటంకన్న ఆటల పోటీలలో నెగ్గటం, యింజనీరింగ్ నమూనాలు తయారు చేయటం చాల మంచిదని చూపాము.

రేమండు, జార్జి, జిమ్మీల ఉదాహరణలతో పెంకిపిల్లల విషయంలో సోవియట్ విద్యాలయాలలో యెల్లాంటి చర్యలు తీసికొన బడతాయో చెప్పాను. పరిసరాలు అననుకూలంగా వున్నట్లయితే వాటిని మార్చి విద్యార్థుల యందు వ్యక్తిగతమైన శ్రద్ధనుచూపి, వారితో సానుభూతితోను, సహనముతోను ప్రవర్తించి వారిని సన్మార్గంలో పెట్టవచ్చును. ఈ పని ఒక్క సోవియట్ విధానములో మాత్రమే సాధ్యమవుతుంది. అచ్చట దినదినము పాతపద్ధతి యిండ్లు కూల్చ బడుతున్నాయి. సంస్కృతిలో స్థాయి హెచ్చుతోంది. ప్రతిబాలుడు, బాలిక సమాజంలో ఉత్తమ సభ్యునిగా సభ్యురాలిగా తయారగుటకు ప్రయత్నించవలసి యున్నా, ఉపాధ్యాయులు మటుకు వారియందు వ్యక్తిగతమైన శ్రద్ధతీసికోవాలి.

స్వల్పకాలంలోనే తరగతి అంతా స్నేహ సహన భావాలతో పనిచేయకున్నట్లు నాకుతోచింది. బాలబాలికల యిండ్లకు కూడ పోయి వారి పూర్తిజీవిత చిత్రమును గ్రహించుటకు నిర్ణయించుకున్నాను. ప్రతి విద్యార్థితోను నెలకు కనీసం రెండుమార్లయినా మాట్లాడి, మార్కులను చూసి, చేసినపనిని పరీక్షించి భావిఅభివృద్ధికి సూచనలిచ్చేదాన్ని. అలాంటి సంభాషణలలో సహజంగానే నిష్కల్మష ప్రేమ సాహిత్యాన్ని గురించి, మనతరగతే ఉత్తమమయిన తరగతిగా పరిగణింపబడితే యెంతో బాగుంటుంది కాన అలాచేయటానికి మార్గాలనుగురించి వారు ముచ్చటించేవారు. వారెన్నో సన్నిహితమైన విషయాలను మర్మం విడిచి వెలిబుచ్చేవారు. నేనుకూడ యెంతోశ్రద్ధగా వినేదాన్ని. అందుచేత వారంతా నన్ను తమ స్నేహితురాలిగా భావించేవారు.

టరమ్ చివర నాల్గవ తరగతితోబాటు యెర్రజండాను పొందటం మాకందరికీ యెంతో ఆనందాన్ని, సంతృప్తిని కలిగించింది. చదువు విషయంలోను క్రమశిక్షణలోను రెండుతరగతులూ ఉన్నతమైనస్థాయిని సాధించాయి. టరమ్‌లో చేసిన తీవ్రకృషికి రెండుతరగతుల బాల బాలికల ముఖకమలాలనుండి వెలువడు ఆనంద జ్యోత్స్నలే తగిన ప్రతిఫలం।

# దేహారోగ్యం - మనోవికాసం

విద్యాలయంలో చాల ముఖ్యులైన సర్వకాల సభ్యుల్లో డాక్టరూ, నర్సూ యిద్దరు. అతినవీనమైన శస్త్రచికిత్సా పరికరాల సంపూర్ణ సహాయం వారికుంటుంది. విద్యార్థుల ఆరోగ్యచరిత్రలను వారు అతి భద్రంగా జాగ్రత పరుస్తారు. ప్రతి ఉదయమూ డాక్టరు విద్యాలయంలో ప్రతిమూలనూ, ప్రతి యిరుకు ప్రదేశాన్నీ పరీక్షించి ఆరోగ్యపరిస్థితివి సరియైన స్థితిలో వుండే టట్లు చూస్తుంది. బాలబాలికల భోజనసమయంలో హాజరై, భోజన పదార్థాలు ఆరోగ్యవంతంగాను, రుచికరంగాను వుండునట్లుకూడ చూస్తూ వుంటుంది. తన దైనందిన నివేదికను ప్రత్యేకంగా ఒక పుస్తకంలోవ్రాసి ప్రిన్సిపాలుచేత చదివించి సంతకం చేయించుకుంటుంది.

డాక్టరుతోను, నర్సుతోను బాలబాలికలు కలసిమెలసి యిష్టంగా ప్రవర్తిస్తారు. యే వ్రేళ్లు తెగినవారో, కంటికేదో చిన్న బాధకలిగినవారో, చివరికి ఊహామాత్రపు బాధకలిగినా డాక్టరుదగ్గరకు తరుచు వెళ్తోవుండటం సాధారణంగా చూస్తోవుంటాం. డాక్టరూ, నర్సూ ప్రతిరోగి విషయమూ, అతని, ఆమె రోగమెంత స్వల్పమైనదైనా ఓపికతోవిని, తగిన చికిత్సచేసి పంపుతూ వుంటారు. బాలబాలికల కేమాత్రం అనుమానంకలిగినా తరగతికి హాజరయేముందు వారు డాక్టరుదగ్గరకు వెళ్ళటం మూలాన అనేకమార్లు వ్యాపిస్తాయని భయపడిన అంటురోగాలుకూడ అంతటితో మటుమాయ మవటం నేను స్వయంగా చూశాను. ఏ తలనొప్పి వంకతోనో తరగతు లెగకొట్టే విద్యార్థులను పట్టుకొని స్నేహపూర్వకంగా జ్ఞానోపార్జనావస్య కతను బోధించి విద్యాలయానికి పంపటం జరుగుతూ వుంటుంది.

ప్పెల్లా, ఈవాలు నేను విద్యాలయంలో ప్రవేశించిన కొత్తలో నా వద్దకువచ్చి తాము తరగతి ఆరోగ్యరక్షకులుగా వుండుటకు నర్సు అంగీక రించిందని చెప్పారు. ఒకతరగతికీ, మరొకతరగతికీ మధ్యతరగతి గదిలో సరిగా వాయుసంచలనం కలిగించటం (జనవరినెలలో రష్యాలో ఉష్ణోగ్రత నీరు గడ్డకట్టే 0 డిగ్రీలకన్న 30 డిగ్రీలు తక్కువలోవుంటుంది) ప్రతివారినీ శుభ్రమైన వస్త్రాలను ధరింపజేయటం, గదులన్నీ దుమ్ము, ధూళి లేకుండా తుడిపించడం మావిధులని వారిద్దరూ చెప్పారు. ఇతర తరగతుల

ఆరోగ్య రక్షకులతోబాటు తాముకూడ వారానికొకమారు నర్సు పెట్టే ప్రథమచికిత్స తరగతికి హాజరవుతామని చెప్పారు.

ప్రథమ చికిత్సాకేంద్రం నెలకొకసారి ఆరోగ్యవిషయాలపై ఒక పత్రికను ప్రచురిస్తోవుంటుంది. జార్జి, కోల్యాల బొమ్మలతోను, వ్యంగ్య చిత్రాలతోను అది ఆకర్షణీయంగా వుంటుంది. ఒక్కొక్కసారి ప్రభుత్వ ఆరోగ్య శాఖవారు ప్రచురించిన ప్రకటనలతోను, ఒక్కొక్కసారి విద్యార్థులేవ్రాసిన వ్యాసాలతోను, ఒక్కొక్కసారి వ్యాసాలు, ఉపన్యాసాలకన్న యెంతో సుబోధకంగాను, చప్పున మనస్సుకు నాటుకునే ఆకర్షవంతమైన చిత్రాలతోను పత్రిక నిండివుంటుంది.

శస్త్రచికిత్సాలయపు గోడలనిండా జలుబువేయకుండా వుండేదెట్లానో, ప్రతిఉదయమూ యెట్టి వ్యాయామం చెయ్యాలో, తెగినప్పుడేలాంటి చికిత్సచేయాలో, ఎముకలు విరిగినప్పుడేమి చెయ్యాలో తెలియచేసే చిత్రాలూ, సూత్రాలూ వ్రాయబడిన అట్టలు వ్రేలాడుతున్నాయి.

చిన్న, పెద్ద బాలబాలికలకు డాక్టరుగాని, నర్సుగాని ప్రథమచికిత్సా తరగతులు నడిపి పరీక్షలో ఉత్తీర్ణులయిన వారికి బాడ్జీలిస్తారు. చాలమంది వీటిని ధరించివున్నారు.

ఆంగ్లో అమెరికన్ విద్యాలయంలో నేను పనిచేసిన నాలుగేండ్ల కాలంలోను యే ఒక్క అంటురోగమూ లేదు. నేను చూసిన యే ఇతర దేశంలోకన్న యీ దేశంలో విద్యాలయాలకు బాలబాలికలు హెచ్చుగా హాజరవుతారు. దీనికి మొదటి కారణం రోగంరాకుండా తీసికొనే జాగ్రత్తలు, రెండవది రోగం వచ్చీరాగానే శాస్త్రరీత్యా చేయబడే వైద్యమూను.

నా తరగతిలో ఒక రోగిని గురించి చెప్తాను. విద్యాలయానికి వచ్చేటప్పటికే తలనొప్పిగా వుండటంమూలాన అతను తరగతికి హాజరవకుండా తిన్నగా డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. అతనికి జ్వరం తగిలిందని డాక్టరుగ్రహించి, శస్త్ర చికిత్సాలయంలో అతనినివుంచి, యితరులెవ్వరూ అక్కడకు రాకుండావుండే ఏర్పాట్లుచేసింది. కొద్దిగంటల్లోనే అది చుక్కల జ్వరంగా మారింది. వెంటనే ఆమె జ్వరవైద్యాలయానికి తంతినిచ్చింది. అక్కడి నుండి ఆంబ్యులెన్సు రాగానే ఎలీ దానిమీద పంపి వేయబడ్డాడు. వెంటనే ఎలీ తల్లిదండ్రులకు కూడ తెలియ చెయ్యబడింది. జ్వరవైద్యాలయంనుండి పూర్తిగా రోగ నివారణమైన తదుపరిమాత్రమే ఎలీ తిరిగి విద్యాలయానికి వచ్చాడు.

ఎలీకి జ్వరం వచ్చిన రోజుననే జిల్లా ఆరోగ్య శాఖవారు పంపిన వ్యక్తులువచ్చి విద్యాలయమంతా క్రిమి ధ్వంసక రసాయనాలను జల్లి వెళ్ళారు. ఆ టరమ్‌లో ఒక్కరుకూడ మరల చుక్కలజ్వరపు వాతనుపడ లేదు. మరుసటి రోజునుండీ పాఠాలు యధాప్రకారంగా జరిగాయి. ఇల్లాగే అనేక సార్లు జరిగిందిగాని, అన్నిసార్లూ వ్యాప్తిచెందకుండానే రూపుమాప బడింది.

బాలబాలిక లెవరయినా బలహీనంగావున్నా, యెవరికయినా ప్రత్యేక చికిత్సచేయవలసిన అవసరమున్నా వారిని తరగతుల తదుపరి జిల్లా బాల బాలికల వైద్యాలయానికి ప్రత్యేకవైద్యులచేత, ప్రత్యేకచికిత్సకొరకై పంపు తారు. శెలవల్లో నీరసంగావుండే పిల్లలు బాలబాలికల విశ్రాంతి కేంద్రానికి పంపబడి, కోలుకుని శక్తివంతులై తిరిగివిద్యాలయాలకు వస్తూవుంటారు. అంతటితో ఆగకుండా వారిచికిత్సను కొనసాగించి యేలోపమూలేకుండా చూస్తూవుంటారు.

ఈ చికిత్స అంతా ఉచితంగా చేయబడుతుంది, ఉత్తమంగాకూడ వుంటుంది. బాలబాలికల వైద్యాలయాలు, దంతవైద్యాలయాలు. విశ్రాంతి కేంద్రాలు—అన్నీ బాలబాలికల ఆరోగ్యాన్ని కాపాడుతూ వుంటాయి. "రోగం వచ్చిన తరువాత చికిత్స చేయుటకంటే, రోగంరాకుండానే నివారణ చెయ్యటం చాలమంచిది. కాని చికిత్సయే చేయవలసిన అవసరం వస్తే అది అత్యుత్తమమైనదిగా వుండాలి," యిదే సోవియట్ వైద్యుల నినాదం !

ఆరోగ్యకర జీవితపద్ధతులపై విద్యాలయాల్లో జరిగే తీవ్రప్రచారమే తలిదండ్రులనుకూడ ఆరోగ్యకరమైన పద్ధతిలో జీవించునట్లు చేస్తుంది. జారు ప్రభువుల కాలపు మూఢవిశ్వాసాలను, అసభ్య ఆచారాలను యింకా వీడని తమ తలిదండ్రుల గృహాలలో ఆరోగ్యకరమైన జీవిత పద్ధతులనూ, మంచిఅలవాట్లనూ నెలకొల్పుచున్నది బాలబాలికలే. శీతాకాలంలో కనీసం ఒక కిటికీనైనా తెరిచేటట్లునూ, పండ్లను ప్రతిరోజూ శుభ్రపరచేటట్లునూ, పరిశుభ్రమైన దుస్తులను ధరించేటట్లునూ పట్టుపట్టేదికూడ బాల బాలికలే. విద్యాలయవైద్యుడు పిలచినప్పుడు తప్పకవచ్చి తమ తలిదండ్రులు వైద్యుని సలహాలనాచరించునట్లు చూచునదికూడ పిల్లలే.

"మాఅమ్మమ్మ ఆటలాడవద్దని పోరుతుంది" ఒకరోజున స్వెల్లా చెప్పింది. "జలుబు చేస్తుందని వాదిస్తుంది. నేను ధరించిన శీతాకాలపు

# శాస్త్ర పరిశోధనాలయాలు, మ్యూజియంలు, వార్తాపత్రికలు, గ్రంథాలు

శాస్త్ర పరిశోధనాలయాల సంఖ్య

1929



438

1938



806

మ్యూజియంల సంఖ్య

1914



180

1938






761

వార్తాపత్రికల ప్రతులు

1913



27 లక్షలు

1940









9 కోట్ల 80 లక్షలు

గ్రంథాల ప్రతులు



8 కోట్ల 67 లక్షలు








70 కోట్ల 10 లక్షలు

ఉన్ని దుస్తులనే మార్చక ధరిస్తే అంతకన్న తీవ్రమైన జబ్బేవస్తుందని నేను బోధించాను. ఆమె ససేమిరా వినలేదు. పోనీ విద్యాలయ వైద్యురాలిని కనుక్కోమన్నాను. ఆమె అసలే చదువుకోలేదు. ఆమెకు అర్థమవటం చాలకష్టం"

"కాస్రేడ్, మాతండ్రి విపరీతంగా సిగరెట్లుకాలుస్తాడు. ఆపటానికేమన్నా పద్ధతుందా ?" ఒక నాలగవ తరగతి విద్యార్థి వైద్యునడిగిన ప్రశ్నల్లో ఒకటి "ఈవేళ ప్రకృతిశాస్త్ర పాఠంలో సిగరెట్లు కాల్చటం ఆరోగ్యానికెంత చెరుపో చెప్పారు. పొగపీల్చటం చెడ్డదనీ, మార్గదర్శులు పొగపీల్చరనీ యిదివరకే యెరుగుదును కాని యెందువలన చెడ్డదో యీవేళే తెలిసికొన్నాను. కాని మాతండ్రి మానేట్లా చెయ్యటానికి యేమి చెప్పమంటారు ?"

"నీప్రకృతి శాస్త్ర వాచకం చూపించి, నీ ఉపాధ్యాయిని చెప్పిన దంతా బోధించు. సిగరెట్లు విపరీతంగా కాల్చేవారి ఊపిరితిత్తుల బొమ్మలు చూపించు. వాటిని తిరిగి రేపు తీసుకురా," అని చెప్పింది డాక్టరు.

సిడ్నీ తండ్రి సిగరెట్లు కాల్చడం మానాడో లేదో అనుమానమైన విషయమేగాని, సిడ్నీ మట్టుకు పెద్దవాడయాక పొగపీల్చడని నాకు దృఢ నమ్మకమేర్పడింది. శక్తివంతమైన శరీర నిర్మాణానికై ఆటలు, కసరత్తు యెక్కువగా అమలు పెట్టబడుతున్నాయి. తరగతుల సమయంలో వారానికొకమారు ఒక గంటసేపు జరిగే డ్రిల్లు తరగతి, తరగతుల అనంతరం జరిగే వివిధ రకాల ఆటలు, డ్రిల్లు, కసరత్తులకు భూమిక మాత్రమే. మావిద్యాలయ ఆటల కేంద్రంలో అనేక శాఖలున్నాయి—ఈతశాఖ, ఆటలశాఖ, స్కేటింగుశాఖ, డ్రిల్లుశాఖ, కసరత్తుశాఖ, 'సేవకు, రక్షణకు సిద్ధంగావుండే' బాల బాలికలశాఖ వుంటాయి. ఈచివరి శాఖలోనివారు పైశాఖలన్నింటిలోను సమర్థులైవుండి పరీక్షలో ఉత్తీర్ణులవాలి.

ఈతశాఖలోనివారు శీతాకాలంలో విద్యాలయానికి చెందిన చెరువుల్లోనూ, వేసవిలో మాస్కో నదీతీరాలలోను యీదుతూవుంటారు. స్కేటింగుశాఖవారు తమ శలవల్లో వివిధ స్కేటింగు కేంద్రాల్లో స్కేటింగు చేస్తోంటారు.

వేసవిలో విద్యాలయ ఆటస్థలంలోగాని, విజ్ఞానోద్యానవనంలోగాని బాలబాలికలు పరుగు, ఎత్తుదూకుట, దూరం దూకుట, యీతలలో పాల్గొంటూవుంటారు. నావ నడుపుటలోకూడ చాలమంది ప్రవీణులవుతారు.

పై తరగతుల్లోని బాలబాలికలు చాలమంది యెంతో గర్వంగా ఆటల బాడ్జీలను ధరిస్తారు. బాలబాలికలు విచక్షణ లేకుండానే సమానంగా ఆటల్లో పాల్గొంటారు. బాలబాలికలకు జరిగే పరీక్షల్లోమట్టుకు కొలదిగా తేడావుంటుంది.

వేసవికాల విలాస ప్రయాణాలు, బాలబాలికల విశ్రాంతి కేంద్రాలు ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఆధిపత్యంలో వుంటాయి. వీటన్నిటిలోనూ పై మాట, పైచేయి డాక్టరుదే. వేసవి శెలవల కార్యక్రమాలు, బాల బాలికలు తమ చదువును రాబోయే సంవత్సరం నిరంతరాయంగాను, ఉత్సాహ వంతంగాను కొనసాగించటానికిగాను వలయు సంపూర్ణమైన విశ్రాంతిని, ఆరోగ్యాన్నీ బలాన్నీ పొందే విధంగా యేర్పాటు చేయబడతాయి.

1937 శలవల్లో నల్లసముద్ర తీరానవున్న అనప్పాకు వెళ్ళినప్పుడు బాలబాలికల విశ్రాంతికేంద్ర నిర్మాణాన్ని చూచే చక్కని అవకాశం నాకు లభించింది. ఈ విశ్రాంతి కేంద్రాలు జబ్బుపడిన బాలబాలికలకుమాత్రమే కాక, నీరసంగావుండే పిల్లలు కోలుకోటానికికూడ ఉపయోగ పడు తున్నాయి. అనప్పా ఒక బాలబాలికల విశ్రాంతి కేంద్రం. అచ్చట కొండలు, సముద్రతీరమూ తెల్లనిలాగూ, చొక్కాలు, ఉన్నిటోపీలు, తేలికైన చెప్పులు, ధరించిన బాలబాలికలతో కిటకిటలాడుతూవుంటాయి.

సముద్రతీరం చాలమటుకు బాలబాలికల ఆటపాటలకే ఉపయోగ పడుతోంది. అక్కడ వారు స్నానాలుచేస్తూ, ఎండల్లో ఒళ్ళుకాచుకుంటూ తడియిసకతో బొమ్మరిల్లు కట్టుకుంటూవుంటారు. పిల్లలంతా తొనలు తీరిన శరీరాలతో యెంతో హుషారుగావున్నారు. వారిని పలుకరించినప్పుడు చాలహుషారుగా, చురుకుగా జవాబులు చెప్పారు. ఎంతో జాగ్రత్తగా వారి దైనందిన కార్యక్రమం నిర్ణయింపబడి నప్పటికీ తమ యిచ్ఛానుసారంగా గడుపుకోటానికికూడ వారికి చాల కాలముంటుంది.

మూడు నాలుగేండ్ల చిరుతప్రాయపు బాలబాలికలకుకూడ ప్రత్యేక విశ్రాంతి కేంద్రాలు, వేసవి కేంద్రాలు వుంటాయి. ఈ బుడుతలు చెట్టా పట్టాలు కట్టుకొని, తమ చిన్నారి కిన్నెర కంఠాలతో అంతూ పంతూలేని, కల్లకపటములులేని కబుర్లను చెప్పుకుంటూ, పాటలు పాడుకుంటూ, రంగురంగుల గౌనులను ధరించిన యువతులు తమవెంటరాగా తడబడు

తమ హొందైన నడకలతో సముద్రతీరానికి వెళ్ళే దివ్యదృశ్యాలు తరుచు మనకళ్ళను పడుతూవుంటాయి.

తమ బాలబాలికల పెంపకంలో తలిదండ్రులుకూడ భాగం పంచుకోవలసి వున్నప్పటికీ వారి ఆరోగ్య రక్షణవిషయంలో బాధ్యత, చొరవ పూర్తిగా వారికి వదలివేయబడదు. ప్రతిక్రీచీ ( శిశురక్షణాలయం ) లోను, ప్రతికిండర్ గార్డెన్ ( శిశు శిక్షణాలయం ) లోను, ప్రతి విద్యాలయం లోను తప్పక ఒక నిపుణుడైన డాక్టరు ఉంటాడు. మార్గదర్శుల భవనం లోను, బాలబాలికల నగరంలోను, విశ్రాంతి - విజ్ఞాన ఉద్యానవనంలోను కూడ తప్పక నిపుణులైన డాక్టర్లు, నర్సులు వుంటారు. విద్యాలయాల్లో విద్యార్థుల విద్య విషయంలో యెంత హెచ్చుగా శ్రద్ధతీసుకోబడుతుందో ఉపాధ్యాయుల సన్నిహిత సహకారంతో పనిచేసే డాక్టర్ల, నర్సుల కృషి ఫలితంగా వారి ఆరోగ్యం విషయంలోకూడ అంత హెచ్చుగా శ్రద్ధ తీసుకోబడుతుంది.



# ఉపాధ్యాయిని

1934 సెప్టెంబరునుండి పైతరగతుల్లో గణితం బోధించనారంభించాను. నా మూడవతరగతి క్రమంగా నాలుగవతరగతి అయింది. నేను చివరివరకు వారికి తరగతి సలహాదారుగానే వున్నాను.

నాలుగైదారేడు తరగతుల్లో నా బోధనద్వారా విద్యాలయ శాఖలన్నింటిలోని విద్యార్థులతోను పరిచయం కల్పించుకొనుటకు యెక్కువ అవకాశం కలిగింది. నా గతసంవత్సరపు విలువయిన అనుభవాన్ని భద్రపరుచుకున్నాను. మరల గణితశాస్త్రం బోధించటానికెంతో సంతోషం పొందాను.

టరమ్ ప్రథమభాగంలో ఒకరోజున నేనురేఖాగణితం (జ్యామెట్రీ) బోధిస్తోంటే కామ్రేడ్ హాలండు, మా ఇనస్పెక్టరూవచ్చి వెనుకగా కూర్చుని నోట్సు వ్రాసుకున్నారు. ప్రిన్సిపాలు, కామ్రేడ్ హాలండుతల్లిదండ్రులు, ఇనస్పెక్టర్లు తరగతులకు హాజరవటం అలవాటేకనుక నేనుగాని, బాలబాలికలుగాని వారిని గురించి పట్టించుకోలేదు. తరగతి చివర ఇనస్పెక్టరు వచ్చి పాఠం విషయమై మాట్లాడ నారంభించింది. అప్పటికే రష్యన్‌భాషలో సంభాషణ సాగించ గలిగేటంత పరిజ్ఞానాన్ని సంపాదించాను కనుక సంభాషణ సాఫీగాను, సులభంగాను సాగింది.

"మీ బోధనా పద్ధతి నాకుబాగా నచ్చింది. అందరికీ సుబోధకంగా వుండే పద్ధతిలో మీరు చెప్పదలచుకున్నది అరటిపండు ఒలిచి అరచేతిలో పెట్టినట్లు చెప్పగలుగుతున్నారు. మా పద్ధతికీ మీపద్ధతికీ భేదంవుంది. గణితశాస్త్రఉపాధ్యాయులకు జరిగేతరగతులకు రష్యన్‌భాష నర్థం చేసుకోగలుగుతున్నారు కనుక యిష్టమైతే వెళ్ళండి. అవసరమైన వివరాలన్నీ కామ్రేడ్ హాలండు తెలియపరుస్తుంది. మీ బోధనా పద్ధతి విషయమై జిల్లాబోధనా శాస్త్రాలయానికికూడ ఫోనుచేస్తాను. ఆ విషయమై అచ్చటి గణితబోధకుడు తప్పక శ్రద్ధ వహిస్తాడని తలుస్తాను. త్వరలోనే మిమ్మును కలుసుకుంటాను, నమస్తే" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

ఈ విధంగా మాస్కో విద్యాశాఖా ప్రపంచంతో నాకు అసలైన సంబంధ మేర్పడింది. గత సంవత్సరం నా రష్యన్‌భాషా పరిజ్ఞానం స్వల్ప

మవటంచేత, యెవరో ఒకరు భాషాంతరీకరించి విషయం చెప్తోన్నా సమావేశాల్లో పాల్గోటానికిగాని, ఇతర ఉపాధ్యాయులతో మాట్లాడుటకు గాని నాకు కష్టంగా వుండేది.

మా విద్యాలయ ఇనస్పెక్టరు త్వరలోనే జిల్లా బోధన శాస్త్రాలయానికి ఫోనుచేసింది. ఎంతోకాలం గడవకముందే జిల్లా ఉపాధ్యాయ శాస్త్రాలయ ఇనస్పెక్టరు నా తరగతికి హాజరయాడు. (విప్లవాత్పూర్వ దౌర్జన్య వాసన వెదజల్లే ఇనస్పెక్టరు అనే మాటకన్న, ఇనస్ట్రక్టరు (బోధకుడు) అనే మాటే వారి పనిని సరిగా సూచిస్తున్నదని రష్యనులు తలుస్తారు.) తరగతి చివర గణిత శాస్త్ర ఉపాధ్యాయుల సమావేశంలో- ఇంగ్లండులో సాధారణంగా గణితం బోధించే పద్ధతుల మీదా, ప్రత్యేకంగా నా పద్ధతి మీదా ఉదాహరణలతో నన్నుపన్యసించమని ఆయన కోరాడు. నా స్వల్పరష్యన్ భాషాజ్ఞానం విషయంలో వారు ఓర్పు వహించ గలిగి నట్లయితే ఆ పనికి సంతోషంగా పూనుకుంటానని నేను చెప్పాను. ఇంగ్లీషు బాగావచ్చిన ఒక రష్యన్ ఉపాధ్యాయిని నాతోవచ్చి నా ఉపన్యాసాన్ని రష్యన్‌భాషలోనికి తర్జుమాచేసేటట్లును, వాదంలో నేను స్వయంగానే పాల్గొనేటట్లును నిర్ణయించుకున్నాం.

ఇన్స్పెక్టరుతో జరిగిన సంభాషణల్లో అత్యంత సమర్థులైన ఉపాధ్యాయులు తమ బోధనాపద్ధతులను యితర ఉపాధ్యాయులకు బోధిస్తారని తెలుసుకున్నాను. ఇక్కడే పాఠ్యప్రణాళికలోని యినుప గుగ్గిళ్ళవంటి కొన్ని భాగాలను సమిష్ఠి చర్చలద్వారా సుబోధకం చేసుకుంటారని తెలుసుకున్నాను.

"పాఠ్య ప్రణాళికలోని ప్రతి విషయంలోను సాధ్యమైనంత సంపూర్ణమైన జ్ఞానాన్ని బాలబాలికలు సంపాదించుటలో తోడ్పడటమే మా ఆశయం. ఇతర దేశాల్లోవలె సాధ్యమైనంత అధికంగా విద్యార్థులు కనీస జ్ఞానంతో పరీక్షలు గడిచి పై తరగతులకు వెళ్ళటంతో మేము సంతృప్తి చెందం. ప్రతి విద్యార్థి బోధితవిషయా లన్నింటిలోను అత్యధికమైన జ్ఞానాన్ని సంపాదించి ఉత్తమ పౌరులుగా తయారవటమే మా ఆశయం. అందుచేతనే మా ఉపాధ్యాయుల కందరకూ ఉత్తమ బోధనా పద్ధతులనూ, సాంకేతిక నైపుణ్యాన్నీ అలవరచుకొనుటకు అవకాశాలను కల్పించటానికి ప్రయత్నిస్తున్నాం. మన జిల్లాలోని 30 విద్యాలయాలకూ నేను తరుచుగా హాజరవుతాను. ఉపాధ్యాయులలో ఉపాధ్యాయులు ఒకరితరగతికి మరొ

కరు హాజరౌతూవుంటారు. ఒక విద్యాలయంలో ఏర్పాటుచేసే 'బహిరంగ తరగతికి' యితర విద్యాలయాల ఉపాధ్యాయులు హాజరౌతూ వుంటారు. ఉపాధ్యాయులకు అప్పుడప్పుడు యీ తరగతులకు హాజరవటానికి విద్యాలయాధికారులు అవకాశాలు కల్పిస్తూవుంటారు. ఇతర విద్యాలయాల గణిత ఉపాధ్యాయులను అందరినీ మీ ఉపన్యాసాలకు హాజరవమని కోరుతాను మీ రేమీ అనుకోకపోతే. వారికి ఇంగ్లీషు అంతగా తెలియకపోయినా గణితం బాగా తెలుస్తుందిగా!" అని చెప్పింది ఇన్స్పెక్టరు.

నా ఉపన్యాసాన్ని ఉపాధ్యాయులందరూ చాలశ్రద్ధగా విన్నారు. తరువాత వారు సాగించినవాదాలు, సంభాషణలు విన్నతదుపరి సోవియట్ రష్యాలో ఉపాధ్యాయులు తమపని నెంత బాధ్యతాయుతంగాను, శ్రద్ధగాను చేస్తారో నా కర్థమయింది. గణితబోధనలో ఉత్తమ పద్ధతులనుగురించీ, ఏ వయస్సు బాలబాలకల విచక్షణజ్ఞానాన్ని, వాదనాకౌశలాన్నీ అభివృద్ధి పరచుటకే యే రకాల ఉదాహరణ లివ్వాలో, ఏ లెఖ్ఖల కెంతకాలం తీసికోవాలో మొదలైన అనేక విషయాలపై మా వాదాలు సాగాయి.

పైపు చెయ్యబడిన సమావేశ కార్యక్రమమంతా జిల్లా బోధనా కేంద్రంలో యితర ఉపాధ్యాయుల ఉపయోగార్థమై భద్రపరచబడింది.

ఈ విధంగా జిల్లాలోని గణిత ఉపాధ్యాయులందరితోను నాకు పరిచయమేర్పడింది. బోధనాపద్ధతులపై నే ననేక నూతనభావాలను తెలిసికోగలిగాను. మా విద్యాలయంలో యితర ఉపాధ్యాయులుకూడ ఇదే విధంగా తమ తమ బోధనావిషయాలలో బోధించు జిల్లాలోని యితర ఉపాధ్యాయులతో సంబంధాలు కలిగివుంటారు, మొదటిసారిగా జిల్లా బోధనాకేంద్రానికి వెళ్ళినప్పుడు మా జీవశాస్త్ర ఉపాధ్యాయిని కామ్రేడ్ ఎద్మండ్సుకూడా నాతోవచ్చింది. మా విద్యాలయంలో ఆమె నా కన్న ఆలస్యంగా జేరుటవలన, బోధనావిషయాలలో ఆమెకెక్కువ పరిచయంలేదు.

బోధనాకేంద్రం మా విద్యాలయానికి పదిహేను నిముషాల నడకలో వుంది. చక్కని గాలి, వెలుతురు ప్రసరించే ఆ భవనములోని విశాలమైన వేరువేరు గదులలో ఉపాధ్యాయులచేతను, బాలబాలికలచేతను తయారు చేయబడిన ప్రదర్శనయోగ్యమైన పలురకముల వస్తువులు పాఠ్యగ్రంథములు, పత్రికలు, ఆదర్శప్రాయమైన పాఠముల వ్రాతప్రతులు అలంకరింపబడి వున్నాయి. బోధనా నిపుణుల చుట్టూజేరి ఉపాధ్యాయులు పట్టికలు, నివేదికలు తయారుచేస్తూ చదువుతున్నారు. నేనూ, కామ్రేడ్ ఎద్మండ్సు

మొదట ప్రకృతిశాస్త్రపు గది చూశాము. వృక్షశాస్త్రంలో ఆమెకు చక్కని బోధనా నైపుణ్యముంది. ఒక రష్యన్ విద్యాలయంలోని 5 వ తరగతి బాలబాలికలచే తయారుచేయబడిన నమూనా పుష్పాలు ఆ గదిలోవున్నాయి.

"పువ్వులోని భాగాలన్నీచూచిన తదుపరి ఆ చిత్రం విద్యార్థుల మనస్సులపై శాశ్వతంగా ముద్రింపబడుతుంది" అన్నది ఆమె. ప్రదర్శిత వస్తువులపట్ల మా ఉత్సాహాన్ని ప్రకటించినప్పుడు ప్రకృతిశాస్త్ర సలహాదారు యీ విధంగా చెప్పింది.

"కాగితపు నమూనాలుగాని, చిత్రపటాలుగాని యదార్థజీవ సహిత వస్తువులకెన్నడూ సరిరావు. బాలబాలికలు తామే వస్తునుగురించి చదువు చుందురో ఆ వస్తువులనుచూచి, పరీక్షించుట అత్యవసరం. లేకపోయిన విద్యాలయంలో నేర్పబడు విద్యకును, యీ విశాల ప్రకృతిలోని యదార్థ వస్తువులకును సంబంధములేక విద్య నామమాత్రమైనదిగా, ఉపయోగ విరహితమైనదిగా పరిణమిస్తుంది. సజీవమైన ప్రకృతితోనే సంబంధము లేనప్పుడు ప్రకృతిశాస్త్రపఠనం నిర్జీవమైనదిగా, నిరర్థకమైనదిగా, ఉత్సాహ శూన్యమైనదిగా వుంటుంది."

మేము కొంతసేపు గణితశాస్త్రపుగదిలో గడిపాము. మా స్నేహితురాలైన గణితశాస్త్రపు సలహాదారు, తన చుట్టూజేరిన ఉపాధ్యాయులతో చురుకుగా సంప్రదింపు చేస్తోంది.

మేము వెళ్ళిపోతూ ఉపాధ్యాయుల నైక్యపరచి, పరస్పర అనుభవ పరిగ్రహణానికీ, విద్యారంగంలో వచ్చే అతినవీనమైన అభివృద్ధులను తెలిసికొనుటకూ యెంతగానో ఉపయోగపడే యీ అత్యద్భుత విధానాన్ని గురించి సంభాషించుకున్నాము. బోధనా కేంద్రపు కాలెండరు ననుసరించి మేమిరువురమూ అధికంగా కేంద్రంలో జరిగే సమావేశాలకూ, వాగ్వాదాలకు హాజరవాలని నిర్ణయించుకున్నాము.

ప్రతిటరము చివరనూ ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు,విద్యాసమితి సభ్యులతో కూడిన విద్యాసేవకుల సమావేశాలు టరములో జరిగిన పని సింహావలోకనం నిమిత్తమై ప్రతిజిల్లాలోనూ జరుగుతూవుంటాయి.

జిల్లా విద్యాసమితి నాయకుని నివేదికా సమర్పణతో సాధారణంగా సమావేశం ప్రారంభమవుతుంది. జిల్లాలోని విద్యాలయాలలో ఉత్తీర్ణుల, అనుత్తీర్ణుల లెక్కలను, ఉత్తమ, అధమ ఫలితాలను సాధించిన విద్యాల

యాలపేర్లను, ముఖ్యంగా ఉపాధ్యాయులపేర్లను, ఆ నివేదికలో ఆయన ఉదహరిస్తాడు.

అనంతరం జిల్లాలోని యే ఉత్తమ విద్యాలయ ప్రధానోపాధ్యాయుడో, ఉపాధ్యాయుడో తమ విద్యాలయం యే పద్ధతుల నవలంబించుట వలన అట్టి ఉత్తమ ఫలితాలను సాధించిందో, కలిగిన కష్టాలను, సమస్యలను యేవిధంగా పరిష్కరించుకొన్నదో యదార్థ ఉదాహరణలతో సహా ఉపన్యసిస్తారు.

ఆ ఉపన్యాసాల సమయంలో అనేకమంది ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు వాదనలో తమ నిశితము, నిర్మాణయుక్తము అయిన విమర్శలతో విద్యాసమితిలోని, సలహాదారులకున్న లోపములనెత్తి చూపుతారు.

నేను హాజరైన పైరకపు ప్రథమసమావేశంలో యిట్టి విమర్శలు విన్నప్పుడు నాకు కలిగిన ఆశ్చర్య, సంభ్రమాలకు మేరలేదు. "విద్యాసమితి నాయకులీ విమర్శలతో ఉక్కిరి బిక్కిరి అయ్యుంటారు. పరిస్థితులను సరిదిద్దటానికి విమర్శ వజ్రాయుధమనటంలో అతిశయోక్తి లేదనుకోండి...." అని నాఉద్దేశం వెల్లడించాను.

"పరిస్థితులను చక్కబెట్టుటకిదే సరియైన పద్ధతి. నిజానికి, విమర్శలో కంగారుకు తావుగాని, కోపానికి కారణంగాని యేమాత్రమూలేదు. సరియైన విమర్శలో వ్యక్తిదూషణకుగాని, అసూయకుగాని స్థానంలేదు. విమర్శవిన్నప్పుడు నీకు కలిగిన కంగారుకు కారణం నీపూర్వ జీవిత పరిణామాన్ని, దురతిశయాన్ని అబ్బజేసిన పరిసరాలను పరిశీలిస్తే గోచరిస్తుంది. స్నేహపూర్వకంగా చేసినవిమర్శలో కోపకారణమేముందిచెప్పు? పోనీ ఒకవేళ విమర్శను గట్టిగా పాటించినట్లయితే విమర్శ కారణమైన లోపాన్ని సరిదిద్దుకోటానికి ప్రయత్నిస్తావు! విద్యాసమితి నాయకురాలు తన అంత్యోపన్యాసంలో తనపై వచ్చిన స్నేహపూర్వకమయిన విమర్శలనెంతో స్నేహపూర్వకంగా ఆమోదించి, వాటికి తగిన సమాధానాల నెలా యిస్తుందో చూడు." అని జవాబిచ్చింది మా ప్రిన్సిపాలు.

ఆమె చెప్పినట్లుగానే జరిగింది. అంత్యోపన్యాసంలో న్యాయమైన లోపాలు అంగీకరించ బడ్డాయి. రాబోయే టరముకి చక్కని కార్యక్రమం ప్రతిపాదింప బడింది. మా కాలాన్నావిధంగా సద్వినియోగం చేసినందుకు సంతృప్తితో ఇంటికి తిరిగి వెళ్ళాము.

ఆ సాయంత్రానికి ఉపాధ్యాయుల విలాసభవనానికి వెళ్ళటానికి టిక్కెట్లు లభించాయి. అది అనేక సంస్కరణలతో తిరిగి ప్రారంభమవుతోంది. ఇతర జిల్లా విలాస భవనాలన్నింటివలెకాక, యీ అఖిల మాస్కో ఉపాధ్యాయ విలాస భవనం సుందరమై, సువిశాలమైవుంది. మధ్య హాలు ఆరువందలమంది కూర్చోటానికి సరిపోయేటంత విశాలంగావుంది. ఒక పఠనశాల, గ్రామఫోనులు, రేడియోలు, సుఖప్రదాయకమైన పడక కుర్చీలు కలిగిన అనేక విశ్రాంతిశాలలు ఆ భవనంలో వున్నాయి. అర్ధరాత్రి వరకు ఆరోగ్యకరమైన ఆహారము దొరికే భోజన శాల పైఅంతస్థులో యేర్పరుప బడింది.

సోవియట్ యూనియన్‌లోకెల్ల ఉత్తమోత్తమ గాయకులని పేర్వడసిన ప్రఖ్యాత గాయకులు పాల్గొన్న నాటికలు, నాట్యములు, చెకోవ్ గాథలూ ప్రదర్శింపబడ్డాయి.

ఉపాధ్యాయుల విలాస భవనమొక్క విలాస కేంద్రమేగాక విజ్ఞాన కేంద్రముకూడా. అక్కడ వివిధభాషలు నేర్చుకోటానికీ, విద్యాచరిత్రను తెలిసికోటానికీ, నాటక కళనుగావి, నాట్యకళనుగాని, వ్యాయామ కళను గాని అభ్యసించటానికీ, అనేక అవకాశాలున్నాయి. పై వాటి కన్నింటికి స్థానిక ట్రేడుయూనియన్ సంస్థలద్వారా టిక్కెట్లు ఉచితంగానే లభ్యమవుతాయి. హాజరయిన వారి సంఖ్యను పరీక్షిస్తే విలాసభవనం చాల హెచ్చు మందికి ఉపయోగ పడుతోందని గ్రహించవచ్చును. విలాసభవన నిర్వహణలో కలుగు లోపములు నెలవారీ సమావేశాలలో విమర్శింపబడి, నిర్వాహకులచే ఆ లోపాలు సరిదిద్దుకో బడుతూ వుంటాయి.

ఉపాధ్యాయుల నెలవారీ సమావేశాలు అభివృద్ధి నిరోధక సంఘటనల నరికట్టుకోటానికీ, ఉపాధ్యాయుల కృషిలో ఉన్నత స్థాయిని సాధించటానికీ యెంతగానో ఉపకరిస్తాయి. ఆ సమావేశాల్లో లోటుపాట్లు, విజయాలు సింహావలోకనం చేయబడతాయి. తరువాత ఉపాధ్యాయుల వ్యక్తిగతాభివృద్ధీ, ఆటు తర్వాత సాధారణ వాగ్వివాదమూ జరుగుతాయి.

వివిధ విషయాలు బోధించు ఉపాధ్యాయులు ఒండొరుల తరగతులకు హాజరవుతూ వుంటారుకాన ప్రతి ఉపాధ్యాయునికీ మొత్తంమీద విద్యాలయ పరిస్థితి దృష్టిలోవుంటుంది. అంచేత తమ అభివృద్ధి విషయమై మాత్రమేకాక మొత్తం విద్యాలయాభివృద్ధికొరకై కూడ వారు శ్రద్ధతీసికో గలుగుతారు. ప్రతివిద్యార్థి అభివృద్ధికి బాధ్యతవహించు తరగతి సలహాదా

రులు మరింత తరుచుగా తరగతులకు హాజరౌతూవుంటారు. కాన ప్రతి వారూ వాగ్వివాదంలో శ్రద్ధతో పాల్గొంటారు. మా విద్యాలయోపాధ్యాయులం జిల్లా విద్యాలయాలలో ప్రముఖ స్థానాన్ని సంపాదించవలెననీ, సాధ్యమైతే ఎర్రజెండా బహుమతిని పొందాలనీ నిర్ణయించుకున్నాము.

1936 లో ఉపాధ్యాయుల మార్పువల్ల క్రమశిక్షణ సమస్య తిరిగి తలయెత్తింది.

ఒరము సమావేశంలో ఇంగ్లీషు ఉపాధ్యాయిని కామ్రేడ్ యంగ్ యీ సమస్యను ప్రతిపాదించింది. "ఉపాధ్యాయుల మార్పు కారణంగా మనం సాధించిన స్థాయిని కోల్పోయాం. క్రమశిక్షణ విషయమై ఒక్కొక్క ఉపాధ్యాయినికి ఒక్కొక్క అభిప్రాయముండుటచే మొత్తంమీద పై తరగతుల క్రమశిక్షణలో స్థాయి క్షీణించింది. గతసంవత్సరం చక్కని క్రమశిక్షణను సాధించి, తత్కారణంగా ఉత్తమ విజయాలను సాధించిన కామ్రేడ్ ఎర్మండ్సు తనపనిలో మరల అశ్రద్ధను చూపుతోంది. కామ్రేడ్ ఇవనోవా యితర ఉపాధ్యాయుల తరగతులకు హాజరై క్రమశిక్షణా విషయాలు కొంతఅభ్యసించటం అత్యవసరం. ఈపరిస్థితుల్ని సమీక్షచేస్తే యీ విషయాలు తేల్తాయి. ఉపాధ్యాయులు మాట్లాడినంతసేపూ బాల బాలికలు మాట్లాడరాదు. ఆ విధంగా మాట్లాడగోరువారు చేతులెత్తి ఉపాధ్యాయుని అనుమతిని ముందుగా పొందాలి. ఈ సూత్రాలు రెండూ ప్రధానమైనవీ, బాలబాలికలందరూ సులభంగా అర్థంచేసుకోగలవీను. యివే అమలు జరుగకపోతే క్రమశిక్షణ అమలు జరగటం దుస్సాధ్యం."

కొత్తగా చేరిన రష్యను ఉపాధ్యాయిని కామ్రేడ్ ఇవనోవా తనలో లోపమున్నదని అంగీకరిస్తూ, ఎంతో ఆసక్తితో ఒక్కుమ్మడిగా ప్రశ్నలు వేసే బాలబాలికల అభిరుచిని అడ్డుకోటానికి తనకు మనస్కరించేది కాదని తెలియచేసింది.

కామ్రేడ్ రోజన్సు ఈవిధంగా జవాబిచ్చింది. "భూగోళశాస్త్రంలో నావిద్యార్థులకున్న ఆసక్తి, అభిరుచులుకూడ యేమాత్రం తక్కువకాదు. అయినప్పటికీ నాతరగతి కాలంలో అందరూ ఒక్కుమ్మడిగా మాట్లాడి అల్లరిజేయటం నువ్వుచూడలేవు. మొదట్లో నేనిక్కడ జేరినప్పుడు నా తరగతిలోకూడ యీవిధంగానే అల్లరిచేసేవారు. సంవత్సర పాఠ్య ప్రణాళికను పూర్తిచెయ్యాలంటే యీవిధమైన అల్లరి ఆటంకమవుతుందనీ, అందుచేత అల్లరిచేయుట మానవలెననీ నిర్మొగమాటంగా చెప్పాను.

అప్పటినుండి బాలబాలికలు క్రమశిక్షణతో మెలుగుతున్నారు. ఆకారణంగా విద్యావిషయికంగా కూడ చాల అభివృద్ధి అయ్యారు."

"అవును. మనం తయారుచేయ పూనుకున్నది అరాచకులనుకాదు. బాలబాలికలకు ఒక్క విషయ పరిజ్ఞానాన్నేకాక, చక్కని జీవితపద్ధతులనూ, సచ్ఛీలాన్నీకూడ బోధించవలసివుంది. ఈ విషయంలోనే కామ్రేడ్ ఇవనోవా పొరపడింది. బోధిత విషయాలన్నింటిలోనూ బాలబాలికలకు చెప్పనలవికానంత ఆసక్తి, అభిరుచి వున్నాయనటానికి సందేహంలేదు. కాని అదిమాత్రమే కాదు కావలసినది. బాలబాలికలకు ఉపాధ్యాయులపట్లను, తమలో తమకును పరస్పర గౌరవముండాలి, ఆ గౌరవానికి ఫలితంగా వారు నాగరికులవలె, విజ్ఞానవంతులవలె ప్రవర్తించాలి. మన విద్యార్థులు విద్యాభ్యసనావస్యకతను గుర్తించి విద్యపట్ల ఉత్సుకతను చూపుతోన్నప్పటికీ వారు వయస్సులో పిన్నలనీ, అందుచేత ఉపాధ్యాయుల ప్రధాన కర్తవ్యం వారిని సన్మార్గంలో నడిపించి, విద్యాపరిపూర్ణులను చేయుటయనీ గుర్తించుకోవాలి" అన్నది మా ప్రిన్సిపాలు.

ఈ సమావేశాలలోవచ్చే నిర్దుష్టమైన విమర్శలవలన అనేకలోపాలు సరిదిద్దబడేవి. విమర్శ వ్యక్తిగతం కానప్పుడు, విమర్శితవ్యక్తి దురభిమానంతో వేరువిధంగా అర్థంచేసికొని కుపితుడు కానప్పుడు, పదిమందిలోను తనలోపాలను బయటపెట్టి తనను అవమానింప పూనుకున్నారని యెంచి దూర్వాసముని యవతారమును ధరించనప్పుడు ఇట్టి విమర్శ అభివృద్ధి కెంతగానో తోడ్పడు ముఖ్యమార్గములలో ఒకటనుటకు సందేహములేదు. అప్పుడు అభిమాన పూరితులమై, విమర్శల కతీతులముగా వుండి యేదో సాధించాలనికూడ భావిస్తూ వుండేవాళ్ళం। విమర్శింపబడుటకు మనసారా అంగీకరించ గలనవి చెప్పలేనుకాని విమర్శనుగూర్చి సవిమర్శకంగా ఆలోచించినపిదప, సాధారణంగా యెవరికివారు గుర్తించుకోలేని స్వల్పమైన లోపములనుకూడ బహిర్గతపరచి, లోపరహితమైన సంపూర్ణత్వాన్ని సాధించటానికి విమర్శ ఉత్తమోత్తమ మార్గములలో ఒకటని ఒప్పుకోకతప్పదు.

స్వల్పమైన వ్యక్తిగత లోపాలనుగురించి వ్యక్తిగతంగానే చర్చిస్తారు. అట్టి చర్చలు ఫలించినప్పుడుగాని, సమస్య అందరికీ సంబంధించినదైనప్పుడుగాని మాత్రమే యిట్టి విమర్శలు బహిరంగ సమావేశాలలో చర్చింపబడతాయి.

ప్రతి సంవత్సరాంత్య భాగంలోనూ ఉపాధ్యాయుల సమావేశం జరుగుతుంది. ఆ సమావేశంలో సంవత్సర ఫలితాల సింహావలోకనం, ఉత్తమ ఉపాధ్యాయుల, తరగతి సలహాదారుల (ఆట్లిచ్నికి) యెన్నికలు జరుగుతాయి. 'ఉత్తమ ఉపాధ్యాయ' బిరుదాన్ని ఉపాధ్యాయులు సంపాదించాలంటే, తమ తరగతిలో యే ఒక్క విద్యార్థీ పరీక్షలో తప్పరాదు. హెచ్చుమంది ఉత్తమ ఫలితాలనూ, మిగిలినవారు కృతార్థతనూ పొందాలి. దానికితోడు రికార్డులన్నీ యెంతోభద్రంగా, శుభ్రంగా వుంచాలి. విద్యాలయంలో పలుకుబడి కలిగి, అందరి మన్ననలకూ పాత్రులైనవారై వుండాలి.

నా ద్వితీయ సంవత్సరాంత సమావేశసమయానికి మా విద్యాలయ ఫలితాలు చాలబాగున్నాయి. కొద్దిమందిమాత్రమే పరీక్షలో తప్పారు. ఆ కొద్దిమందికూడా ఆగస్టులో తిరిగి జరిగే పరీక్షలో కృతార్థులవుతారని నమ్మకం వున్నది. 'ఉత్తమ ఉపాధ్యాయులు'గా కామ్రేడ్ రోజన్సు, మూడవతరగతి ఉపాధ్యాయినీ, నేనూ యెన్నుకోబడ్డాము. నాకు అందరి లోను ఉత్తమ ఫలితాలు వచ్చుటచేత, మాస్కో విద్యాసమితి వారు ప్రేమియమునివ్వ నిశ్చయించారు. మిగతా ఇరువురికీ విద్యాలయంవారే ఇచ్చుట కేర్పాటు చెయ్యబడింది.

కొద్దిరోజుల తదుపరి మా ప్రిన్సిపాలుకూ, నాకూ ఒక పెద్ద సమావేశానికి ఆహ్వానాలు వచ్చాయి. సమావేశము జరిగే భవనంలో ఎర్రని పట్టీలపై "మా ఉత్తమ ఉపాధ్యాయులకు సుస్వాగతం!" "స్టాలిన్ చిరకాలం వర్ధిల్లాలి!" మొదలయిన వినాదాలు వ్రాయబడ్డాయి. ఉత్సాహవంతమైన పాటలు బ్యాండుమేళం వారు పాడుతున్నారు. ఉద్విగ్న హృదయాలతో మా ఆసనాలలో కూర్చున్నాం.

మాస్కో విద్యాసమితి అధ్యక్షురాలి నివేదికా సమర్పణతో సమావేశం ప్రారంభమయింది. క్లుప్తంగా సంవత్సర ఫలితాలను వివరించి, మాస్కోనగరంలోని అరవైమంది 'ఉత్తమ ఉపాధ్యాయుల' నామధేయాలను చదివి, వారికి విద్యాసమితి వారు ప్రేమియము నివ్వ నిశ్చయించుకున్నసంగతిని విశదపరిచింది. మా పేర్లనూ, మా విద్యాలయాల పేర్లనూ చదువనారంభించింది. ఎంతో ఉత్సాహంతో ఒక్కొక్కరే వేదికపైకి వెళ్ళి తోలు అట్టలతో అందంగా తయారుచేయబడిన యోగ్యతా పత్రాన్ని అందుకొని, తాము బహూకరింపబడిన ప్రేమియము మొత్తాన్ని తెలుసు

కుంటోన్న చిత్రాన్ని కన్నుల పండుపుగా తిలకించాము. బంగారు గడియారాలు, కుర్చీలు, సోఫాలు మొదలయిన సామానులు, అయిదు వందల రూబుల్సు ఖరీదుగలిగిన పుస్తకాలు ప్రీమియములుగా యివ్వబడ్డాయి.

ఆకస్మాత్తుగా నా హృదయం యెగిరి గంతువేసింది। నా స్నేహితులు ముందుకు బలవంతాన నెట్టగా కలలో నడచినట్లుగా వేదికపైకి వెళ్ళాను. అధ్యక్షురాలు వెచ్చని కరస్పర్శతోబాటు యోగ్యతా పత్రాన్ని సమర్పించింది. అయిదువందల యాబుల్సుతో నేను బహూకరింపబడ్డాను.

"నీకు ఆశ్చర్యాన్ని కలుగచెయ్యాలనే ముందుగా తెలియ చెయ్యలేదు" అని నెమ్మదిగా చెప్పింది మా ప్రిన్సిపాలు. "విద్యాసమితిచే నీవు సన్మానింపబడ్డావు. ఆ సన్మానానికి నీవెంతయినా అర్హురాలవు. ఇందుకు నాకెంతో సంతోషమయింది." అని అభినందించింది. సోవియట్ యూనియన్‌లో నేను గడిపిన కాలమంతలోనూ ఆ క్షణం ఉద్విగ్నపూరితమూ. మధురాతి మధురమూ అయినదని చెప్పవచ్చును.

సమావేశానంతరం చకోవిస్కీ విరచిత 'మడెప్పా' నాటక ప్రదర్శనం జరిగింది. తోలుపెట్టెలోవి యోగ్యతాపత్రాన్ని చేతబుచ్చుకొని ప్రదర్శనానంతరం యింటికి తిరిగి వెళ్లాను.



# విద్యాలయ కార్యనిర్వహణ

సెప్టెంబరు 1935 లో కామ్రేడ్ హాలండు స్థానంలో ఆమె అమెరికావెళ్ళిపోగానే సూపర్వైజరుగా నియమింపబడ్డాను. విద్యాలయ పరిపాలనా విధానాన్ని సర్వతోముఖంగా తెలుసుకోటానికి యీపదవితో, బాధ్యతతో నాకు చక్కని అవకాశం కలిగింది. బోధన సమయంలో తరగతులకు హాజరవటమూ, ఉపాధ్యాయుల బోధనాపద్ధతులలోనిపొరపాట్లను సరిదిద్దటమూ, విద్యాలయమంతలోనూ ఒకేరకమైన అభివృద్ధిని సాధించు పద్ధతులు సూచించటమూ నాబాధ్యతలు. నేను రోజుకు మూడు గంటలు బోధించి, మిగతా కాలమంతా సూపర్వైజరుగా పనిచేయాలి. దానికై ప్రతి ఉపాధ్యాయునీ, విద్యార్థినీ యెరిగివుండాలి.

నేనీపదవికి నియోగింపబడుటకు ముందు, నాకు పరిపాలనా పద్ధతులలోను, బోధనాపద్ధతులలోను పూర్వానుభవంలేదని కాన ఆపదవి నాకివ్వ వలదని తెలియపరచాను. ప్రిన్సిపాలు, ఇనస్పెక్టరూ నేనాపదవికి తప్పక తగుదుననీ, నాకు కావలసిన సహాయాన్ని జిల్లా బోధనా కేంద్రంనుండి పొందవచ్చుననీ ఉత్సాహపరిచారు. మెరుపు వేగంతో అభివృద్ధి చెందుతూన్న సోవియట్ విద్యా విధానాన్ని అమలుపరచటానికి కావలసినంత మంది ప్రధానోపాధ్యాయులు; సూపర్వైజర్లు అప్పటికింకా సోవియట్ యూనియలోలేరు. ఉన్నతపదవిని పొందనాశించని ఉపాధ్యాయులనుకూడ బోధనిపుణులు, పరిపాలనలో సమర్థులు అన్నకారణంచేత సూపర్వైజరు, ప్రిన్సిపాలు స్థానాలలోవేస్తున్నారు. వారుకూడ తరుచు తమ సామర్థ్యాన్ని ప్రకటించుకోగలుగుతున్నారు.

సూపర్వైజరుగా నేను నియమింపబడిన వెంటనే జిల్లా బోధనా కేంద్రానికి సలహాకై వెళ్ళాను. సూపర్వైజర్ల శాఖకు బాధ్యస్తురాలైన ఒక కామ్రేడ్ సూపర్వైజర్ల బాధ్యతలనూ, పనులనూ తెలియపరచే కరపత్రాలనిచ్చి సహాయపడింది. అంతేకాక, ఆదర్శప్రాయమైన ఒక పరిపాలనాక్రమాన్ని, గ్రాఫ్‌ల సహాయంతో అభివృద్ధి అంచనావేసే పద్ధతులనూ ఆమె నాకు బోధించింది. సూపర్వైజర్లకు శిక్షణనిచ్చే వారపు తరగతులు జరుగుతాయని తెలిసికొని తప్పక హాజరవాలని నిశ్చయించుకున్నాను.

నేను హాజరైన మొదటి సూపర్వైజర్ల సమావేశంలో మాస్కోలో కెల్ల అత్యనుభవపరురాలైన సూపర్వైజరు ఉపన్యసించింది. టెరిమ్ పనియెట్లా అంచనావెయ్యాలో మొదట వివరించి, తరువాత తన అంచనాను చదివింది. ఆవిడ ఉపన్యాసానంతరం జరిగిన వాగ్వాదంలో హాజరైనవారిలో చాలమంది ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ సమావేశంవల్ల చాల మంచి అభిప్రాయాలను నేను పొందగలిగాను. తరువాత జరుగబోయే సమావేశాలన్నింటికీ హాజరవ నిశ్చయించుకున్నాను. ఈ సమావేశ మూలమున మాస్కో-సూపర్వైజర్లు చాలమందినాకు స్నేహితులయారు. వారి విద్యాలయాలకుకూడ నేను హాజరై వారి అనుభవాలనుకూడ నేను అవగతం చేసుకో గలిగాను.

మార్కుల విషయంలో నాకొక కష్టం కలిగింది. సోవియట్ విద్యాలయాలలో వాడే మార్కులల్లా అత్యుత్తమం, ఉత్తమం, మధ్యమం, అధమం, అధమాధమం, మాత్రమే. 'అధమం' 'అధమాధమం' మార్కులు వచ్చినవారు పరీక్షలో తప్పినారన్నమాట. బాలబాలికలు తమ మార్కుల కెక్కువ విలువ నిస్తారు. తమ చదువులో వారికి మార్కులోనే కొలబద్ద. ఈ మార్కులలోనే తరగతిలోని విద్యార్థుల మధ్యా, తరగతుల మధ్యా సోషలిస్టు పోటీలు జరుగుతూ వుంటాయి. ఈ మార్కులు ఉపాధ్యాయులచేత, తరగతి పత్రికలోనూ, విద్యార్థుల దినచర్య పుస్తకాలలోనూ యెక్కించ బడతాయి. ఈ దినచర్యపుస్తకాలలో విద్యార్థులు ఇంటికిచ్చిన పనిని రాయటమేకాక, తమ అభివృద్ధిక్రమాన్ని కూడ భద్రపరుస్తారు.

మార్కుల పద్ధతిని పూర్తిగా వ్యతిరేకించే ఉపాధ్యాయులుకూడ మా విద్యాలయంలో కొందరున్నారు. వారు మార్కుల పద్ధతిలేని విదేశాల నుండి వచ్చారు. సోవియట్ యూనియన్ వంటి అత్యంతాభివృద్ధి చెందిన దేశంలో మార్కుల పద్ధతి వుండరాదని వారి ఉద్దేశం. వ్యక్తిగతంగా ప్రతివిద్యార్థి అభివృద్ధినీ గమనించాలంటే మార్కులపద్ధతి అత్యవసరమనే సత్యాన్ని వారు గుర్తించరు. ఇంతేకాక ఈ మార్కుల పద్ధతి విద్యార్థుల అభివృద్ధినేకాక ఉపాధ్యాయుల కృషినికూడ, ఉపాధ్యాయుల ఉపయోగమునకూ,పాఠశాలా పరిపాలకవర్గపు ఉపయోగమునకూ గుర్తుకు తెస్తుంది.

చివరకు మార్కులపద్ధతిని వ్యతిరేకించిన ఉపాధ్యాయులను కూడ మార్కులఅవసరాన్ని గుర్తింప చేశాము. కాని, తరగతులకు హాజరై గమనించిన తర్వాత యీ మార్కులువేసే పద్ధతి సర్వత్రా ఒకేవిధంగా లేక యెగుడు దిగుడుగా వున్నదనీ, కొందరు ఉపాధ్యాయులు విద్యార్థుల స్వల్పకృషికికూడ యెక్కువ మార్కులు వేస్తున్నారనీ బోధపడింది. మా ప్రకృతిశాస్త్ర ఉపాధ్యాయిని కామ్రేడ్ ఎడ్మండ్సు, అత్యధికంగా మార్కులు వేస్తూన్నదనీ, అంతేకాక ఆమెతరగతిలో శిక్షణఅతిస్వల్పంగా మాత్రమే కాపాడ బడుతోందనీ, ఆమె తరగతిలోని విద్యార్థుల జవాబులు అసమగ్రంగాను, తక్కువరకంగాను ఉంటున్నాయనీ నేను పరీక్షపై తెలుసుకో గలిగాను.

ఆరవతరగతి వృక్షశాస్త్రపు తరగతికి హాజరై, వారు తయారుగా తరగతికి హాజరవక పోవటం గమనించి, తరగతి చివర విద్యార్థులనూ, తరగతి సలహాదారునూ, కామ్రేడ్ ఎడ్మండ్సునూ ఆపాను. "వృక్ష శాస్త్రపు తరగతిలో మీ శిక్షణ యేమీ బాగాలేదు. మీలో యెక్కువమంది యింటికిచ్చిన పనిని చేస్కురాలేదు. కారణమేమిటో తెలియపరుస్తారా? తరగతి అధ్యక్షురాలైన టాన్యా దీనికేం చెప్తుందో మనమంతా విందాము" అని నేను కుండ బద్దలుకొట్టినట్లుగా మొహమాటం లేకుండా అడిగాను.

టాన్యా యీ విధంగా మొదలెట్టింది, "కామ్రేడ్ ఎడ్మండ్సు శిక్షణ విషయంలో యింకా కఠినంగావుండాలి." మార్కు లంత ఉదారంగా వెయ్యకూడదు. 'మధ్యమం' అని వెయ్యవలసినవారికి ఆమె 'ఉత్తమం' మార్కు వేస్తూ వుంటుంది. అందుచేత తరగతిలో చాలమంది యింటి కిచ్చిన పని శ్రద్ధగా చేయటం మానివేశారు. చదవకపోయినా మంచి మార్కులు వస్తున్నాయి కాన వారు శ్రద్ధగా చదువుట మానివేశారు.

టాన్యా ముగించి కూర్చోగానే చాలమంది చేతులెత్తారు.

"ఏమిటి జోసెఫ్, నువ్వేమంటావ్?"

"మా శిక్షణ లోపభూయిష్ట మవటానికి మాకు తరుచు చాలినంత పనిలేకపోవటమే కారణం. వృక్షశాస్త్రమంటే మాకు విపరీతమైన అభిరుచి వుంది. సూక్ష్మదర్శనీ యంత్రంద్వారా చూడవలసి వచ్చినప్పుడూ సినీమా తరగతి వచ్చినప్పుడూ నా హృదయం సంతోషంతో గంతులేస్తుంది. ఉపాధ్యాయిని కష్టతరమైన పనిని యిస్తూండాలి. ఉదాహరణకు యీ వేళ

# విద్యాభివృద్ధి

1913 1940

ప్రాధమిక, ఎలిమెంటరీ పాఠశాలలలో చదివే పిల్లల సంఖ్య



78 లక్షలు





3 కోట్ల 50 లక్షలు

వృత్తి విద్యలు నేర్చుకునే విద్యార్థులు



35,800



951,900

కాలేజీలు, విశ్వవిద్యాలయాలు



71



716

కాలేజీ విద్యార్థులు



112,000



700,000

పాఠ మత్యంత సులభమైనది. ఆ పరిస్థితిలో పాఠం శ్రద్ధగా చదవాలని యెవరు కృషిచేస్తారు చెప్పండి ? "

"నాయకులు మందకొడిగా పనిచేస్తున్నారు, అనుకుంటాను. సమావేశాల్లో యీ వరకే ఈ విషయాన్నిగూర్చి చర్చించి యుండవలసింది. కామ్రేడ్ ఎడ్మండ్సు తరగతుల్లో చక్కగా బోధిస్తోఉంటే, ఆమె యెంత మెత్తని మనస్సుకలదియైనా ; ఆమె పాఠాలను జాగ్రత్తగా వినాలి " అని యెడ్వర్డు అన్నాడు.

ఈ అభిప్రాయంతో అందరూ యేకీభవించారు. 'అతిదయ' 'మెత్తనితనం' అని ఆమె ప్రవర్తనను వారు పిలిచారు. కామ్రేడ్ యెడ్మండ్సు పిల్లలకు అతి మెత్తనిదనంమూలాన్ని లోకువయిచ్చి, వారికి ఎక్కువపని కల్పించలేదు. ఆ విధంగా చురుకుగా, శ్రద్ధాభక్తులతో, నిర్దుష్టంగా పనిచేసేప్రమాణాన్ని వారిముందు ఆశయంగా నిలుపలేకపోయింది.

క్రమశిక్షణకు లోబడి, అమితశ్రద్ధతో చదివేందుకు నిర్ణయించి విద్యార్థులు వెళ్ళిపోయినతరువాత, నేను కామ్రేడ్ ఎడ్మండ్సు యీ విషయాన్నిగూర్చి చర్చించేందుకు ప్రారంభించాము. పిల్లల అభిప్రాయం సరియైనదని ఆమె అంగీకరించింది. మేమిర్వురిమూ కలిసి మూడునాలుగు పాఠముల నెట్లు చెప్పవలయునో, విద్యార్థుల నందరకూ తగినంత పని యెట్లు కల్పింపవలయునో ఆలోచించాము. మరునటి ఒకటిరెండు వారాల లోను ఆమె తరగతులకు హాజరవ వలయునని నిశ్చయించాను. ఆమెకూడా నేనేవిధంగా బోధిస్తానో, మార్కులు యిస్తానో వచ్చిచూచేందుకు అంగీకరించింది.

అటు తర్వాత ఆరవతరగతి క్రమశిక్షణ, చదువులు బాగా అభివృద్ధి చెందాయి విద్యార్థులు చాలాకష్టపడి కృషిచేస్తున్నారు. ఉపాధ్యాయురాలు కూడా జాగ్రత్తగా యింటివద్దచేసుకొచ్చిన పనికిమార్కులు యిచ్చుట యందు హెచ్చుశ్రద్ధ చూపుతోంది. ఆమె పాఠాలు చెప్పేటప్పుడుకూడా అందరిదృష్టి ఆకర్షించి శ్రద్ధ కలిగించ నారంభించింది.

లెక్కలు, భాషలు మినహాయించి తదితర విషయాలన్నిటిలోనూ, ప్రశ్నోత్తరాల పద్ధతి అమలులో వుంటుంది. నాలుగవతరగతిలో చదివే బాలబాలికలు అడిగినప్రశ్నకు, తరగతిలో నిలబడి సరియైన సమాధానాలు చెప్పాలి. తరగతిలో బోధింపబడిన విషయాలను బట్టీ పెట్టడం మాత్రమే కాకుండా, యింటివద్ద తత్సంబంధమైన విషయాలనుగూర్చి చదివిన పుస్త

కాలలోని సంగతులు కూడా అధికంగా సమాధానాలలో చెప్పవలసిన అవసరం సోవియట్ బోధకులు కల్పిస్తారు.

ఈ ప్రశ్నోత్తరాల సందర్భంలోనే మరొక చిక్కు వచ్చింది. ఏడవ తరగతి విద్యార్థులు రసాయనిక, పదార్థవిజ్ఞానశాస్త్ర పాఠాలలో ఉపాధ్యాయులు ప్రశ్నలు వెయ్యడంలేదనీ, వాటిల మార్కులివ్వడంలేదనీ చాల మందివిద్యార్థులు నాతో ఫిర్యాదు చేశారు. అటరమ్‌లో చాలరోజులు గడచిపోయాయి. ఏడవతరగతి విద్యార్థులు చాలామార్కులు సంపాదిస్తామని ప్రతిజ్ఞకూడా చేశారు. ఇంతవరకూ ఉపాధ్యాయుడు మార్కులు వెయ్యటమే మొదలు పెట్టకపోతే ప్రతిజ్ఞా నిర్వహణ మెట్లు జరుగుతుంది?

సోవియట్ ఉపాధ్యాయులు సాధారణంగా, విద్యార్థులపోటీల యందు హెచ్చుశ్రద్ధ చూపుతూ ఉంటారు. కాని క్రామేడ్ గ్రాంటుకు యీ విధానము యింకా నూతనంగానే వుంది. సోవియట్ విద్యాలయ జీవితానికి సంపూర్ణంగా అలవాటు పడలేదు.

ఈ విషయంపై ఆయనతో మాట్లాడగా, మరుసటి పాఠంలో పిల్లలను ప్రశ్నించి మార్కులిస్తానని చెప్పారు. కాని దురదృష్టవశాత్తూ ఆయన వాగ్దానం నిలుపుకోలేక పోయాడు. మా గోడవార్తా పత్రికలో ఆయనపై విమర్శించవలసి వచ్చింది. ఉపాధ్యాయుల సమావేశంలోకూడా యీ సంగతి చర్చకుతేబడింది. క్రామేడ్ గ్రాంటు తన లోపాన్ని సవరించుకుంటానని వాగ్దానం చేశాడు. తరచుగా ఆయనతరగతులకు వెళ్ళి ప్రిన్సిపాలు, నేను పర్యవేక్షణ చేయడం మొదలు పెట్టిన తర్వాత క్రామేడ్ గ్రాంటు శ్రద్ధతో పిల్లలను ప్రశ్నించి మార్కులు వేయనలవరుచుకున్నాడు.

విద్యాబోర్డునకు మేము పంపే టరము నివేదికలో క్రామేడ్‌గ్రాంటు అశ్రద్ధను ఉదహరించి, వేసగి అనంతరము ఆయనను బర్తరఫు చేశేందుకు అనుజ్ఞను కోరాము. సవరించుకోజాలని లోపాలుంటేగాని, ఉపాధ్యాయుల నెవ్వరినీ తీసివేయకూడదు. కాబట్టి ఆలోపాలను సవరించేందుకు తీవ్రంగా కృషిచేయవలసిందనీ, శక్తికి మించుతే, ఆయనకు వృత్తి మార్చుకొనుటకు సలహానీయవలసిందనీ బోర్డువారు చెప్పారు.

ఆ సంవత్సరాంతంలో, క్రామేడ్‌గ్రాంటు స్వయంగానే ఉపాధ్యాయ వృత్తివదలివేసి, నూతన విషయ పరిశీ మొదలెట్టాడు. పదార్థ విజ్ఞాన శాస్త్రమందు ఆయనకుగల అభిరుచి అపారం కాబట్టి, అందులో కృషిచేయవలసిందని, ఆయనకునేనే సలహా యిచ్చాను.

మూడునాలుగు తరగతులకు క్రామేడ్ బ్రౌను ప్రకృతిశాస్త్ర వాచక పాఠములను చెబుతారు. ఉపాధ్యాయుల కొరతగానున్న ఆకాలంలో, అమెరికాలో ప్రగతిపాఠశాలలలో అనుభవంగడించిన ఆయనను యీపనికి నియోగించాము.

క్రామేడ్ బ్రౌను పనిచేయ మొదలిడిన పదిరోజుల అనంతరం ఇద్దరు నాల్గవ తరగతి విద్యార్థులు " క్రామేడ్ దయయుంచి మా తరగతి సమావేశానికి రండి. అది చాలా ముఖ్యమైనది. రహస్య సమావేశము జరుగుతుంది. " అని కోరారు.

ఆశ్చర్యపడి, వారి సమావేశానికి హాజరయ్యాను. వారి అధ్యక్షుడు యీ విధంగా నాకు తెల్పాడు.

" ప్రకృతిశాస్త్ర వాచక పాఠముల తరగతుల్లో మేమేమీ నేర్చుకోవడంలేదు. చేపల పాఠంలో, బొమ్మలే వేస్తో కూర్చోమంటున్నారు. గాని, చేపలనుగూర్చి యేమీ చెప్పడంలేదు. ఆ బొమ్మలను యింటికద్ద గీయమని చేపల అంగనిర్మాణం, అలవాట్లు మున్నగు అనేక విషయాలను మాకు తరగతుల్లో భోదిస్తే మాకు ఉపయోగకరంగా వుంటుంది. మా పాఠ్య గ్రంధంలో సమస్త విషయాలు ఉన్నప్పటికీ, క్రామేడ్ బ్రౌను "పుస్తకాల నావలపెట్టండి" అంటూ వుంటారు. మేము వెనుకబడి పోతున్నామనే భయం వేస్తోంది."

తమలో తాము బాగా తర్కించుకున్న యీ విషయాన్నిగూర్చి క్రామేడ్ బ్రౌనుతోకూడా వారు చెప్పినప్పటికీ, వారికి తృప్తికరమైన సమాధానం లభించనందున, వారు నాతో చెప్పారు. సావధానంగా విన్న తర్వాత జాగ్రత్తగా ఆలోచించి తగుచర్య తీసుకుంటానని చెప్పి, వారి సమావేశం ముగించాను.

నూతనుడైన క్రామేడ్ బ్రౌనుకు మున్ముందు పఠనీయాంశములను గూర్చి ప్రధమముననే పూర్తిగా వివరించాను. ఐనా, యింతవరకూ నేను ఆయన తరగతులకు వెళ్ళి బోధనా విధానమును చూచివుండలేదు. యీ సమావేశానంతరం వెంటనే ఆయన తరగతికివెళ్ళి విద్యార్థులు చెప్పినది వాస్తవమేనని గ్రహించాను.

పాఠశాలను మూసిన తర్వాత ఆయనను బోధనా ప్రణాళికను ఆయనెందుకు అనుసరించలేదని ప్రశ్నించాను. విద్యార్థి సమావేశాన్ని గూర్చి అయనకు తెలియపరిచాను. కాని ఆయన తన బోధనావిధానం

మంచిదనీ, విద్యార్థులు చాలా లబ్ధి పొందుతున్నారనీ వాదించసాగేడు. సోవియట్ బోధనావిధానాన్ని పూర్తిగా ఉపేక్షించి ఉపాధ్యాయుడు తోచిన రీతిగా చెప్పరాదనియు, విద్యార్థులుకూడా అట్టే నేర్చుకొనలేక పోతున్నామని అసంతృప్తి చెందుతున్నారనియు ఆయనతో నిష్కర్షగాచెప్పాను. తమకు తోచినరీతిని స్వేచ్ఛగా పాఠములను చెప్పే దేశాలలో పనిచేసి వచ్చిన బ్రౌనుకు వాస్తవంగా యీ విధానమును అమలు జరపడం కష్టంగా కన్పించినా, వెంటనే ప్రారంభిస్తే, యీ పద్ధతిలోని ఉత్కృష్టత విశదమౌతుందని ఆయనకు నొక్కి చెప్పాను.

కామ్రేడ్ బ్రౌనుకు ప్రణాళిక ననుసరించి బోధించడం అసాధ్య విషయంగా కన్పించింది. ప్రకృతిశాస్త్రతరగతిలో ఆయనకు ఏ చరిత్రయో, భూగోళమో, యేది జ్ఞాపకమువస్తే యేది తత్సంబంధమువితోస్తే, ఆ విషయాన్నిగూర్చి చెప్పడం మానలేకపోయాడు. ఒకనెలరోజుల పరీక్షాసమయానంతరం మేము మరొక ఉపాధ్యాయుని కొరకు వెతుక్కొనవలసివచ్చింది.

సర్వసామాన్యంగా నేను పాఠశాల సమావేశాలకు హాజరవుతాను. ఒకపర్యాయం వేరే పనియుండుటవలన ఆలస్యంగా వెళ్ళాను. ఏడవతరగతి విద్యార్థులు చరిత్ర భూగోళములు బోధించే ఉపాధ్యాయునిపై చేసిన నేరారోపణనుగూర్చి ప్రిన్సిపాలు తదితర ఉపాధ్యాయులు చర్చిస్తున్నారు. ఆ ఉపాధ్యాయురాలు విద్యార్థులకు ఇంటికి హెచ్చుపని ఇస్తోందనీ, ఆమె చెప్పేది వారు గ్రహించలేకుండాపున్నారనీ విద్యార్థులు అర్జీ పెట్టుకున్నారు. పిల్లలతో నేను ఏకీభవించక వారికొరకు, ఉపాధ్యాయురాలికొరకూ కబురు చేశాము నలుగురు వెనుకబడిన పిల్లలు, కామ్రేడ్ రోజెర్సు వచ్చారు.

కామ్రేడ్ రోజర్సు తరగతులకు నేను వెళ్ళి చూచానని, చాలా సంతృప్తికరంగా వుంటాయనీ, శ్రద్ధాళువులయిన విద్యార్థులకు బాగా బోధపడతాయనీ, నేనుచెప్పాను భూగోళపాఠాలు స్వతహాగా కష్టంగా వుంటుంది. కనుక యింటివద్ద పిల్లలు కష్టపడి చదవాలి. బడి పాఠాలయందు శ్రద్ధచూపక, అల్లరి చిల్లరిగా తిరుగ మొదలెట్టిన ఆ నల్గురు విద్యార్థులే ఆమెపై నిందమోపడం కొంచం తమాషాగానే కనపడింది.

కామ్రేడ్ రోజర్సు ఆ ఫిర్యాదునుగూర్చి వినగానే ఆశ్చర్య చకితురాలైంది. నిజంగా ఆమెకు చాలాకోపంవచ్చింది. పాఠాలు బోధపడక పోతే తనతోనే యెందుకు చెప్పలేదని తెలియని విషయాలను అందరూ అడిగి చెప్పించుకుంటున్నారుగదా? వారట్లా చెయ్యక, పైగా వచ్చినట్లు

యింతవరకూ నటిస్తూ, ఆకస్మాత్తుగా యిప్పుడు ఎందుకు విందమోపారని ఆమె అడిగింది.

ఏడవ తరగతి విద్యార్థే ఆ సమావేశానికి అధ్యక్షుడుగా వున్నాడు. ఆమె ఇంటివద్ద చేసుకొనివచ్చుటకు యిచ్చినపని కష్టతరంకాదనీ అర్థం కానప్పుడే ఆవిద్యార్థులు ఆమెను అడిగి వుండవలసిందని అంటూ అప్పు డప్పుడు కామ్రేడ్ రోజర్సు అతివేగంగా మాట్లాడుతుందనీ, విద్యార్థులం దరూ అర్థంచేసుకోవడం కష్టమనీ ఆ అధ్యక్షుడు చెబుతో, ఆవిషయాన్ని గూర్చిన చర్చ ముగించివేద్దామన్నాడు. ఆవిధంగానే ఆపివేశారు. వారి హక్కులకు భంగం కలిగిందని ఎవ్వరూ అనుకోలేదు. పైగా నాటినుండి రోజర్సు యెక్కువ సావకాశంగా, సులభంగా అర్థమగునట్లు పాఠాలు చెబుతో, ఆ నలుగురు విద్యార్థుల విషయంలోనూ ప్రత్యేకశ్రద్ధ తీసుకుంది. విద్యార్థుల సాధక బాధకాలను గుర్తించి నివారించవలసిన విధి ఉపాధ్యా యులది. ఉపాధ్యాయులు కృత్రిమ ప్రతిష్టకై పెనగులాడకుండా తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి.

పైన చెప్పిన ఉదాహరణలనుబట్టి విద్యార్థులలో క్రమశిక్షణ సంపూర్ణంగా ప్రజాతాంత్రిక పద్ధతులపైనే అమలు జరుప బడుతుందనీ, ఉపాధ్యాయులే పైకి కనుపడనిరీతిని బాలబాలికల నిర్ణయాలను, ఉద్దేశ్యా లను సరిదిద్దుతూ ఉండాలనీ స్పష్టమౌతుంది. విమర్శనాస్వేచ్ఛ అపరిమి తంగా వుంటుంది విద్యార్థులు హెచ్చుగా విమర్శించినా, ఉపాధ్యాయులు స్నేహభావంలోనే తీసుకొని యుక్తమని తోచినచోట్ల, విమర్శనను అమో దించుతూ ఉంటారు. అందువలన విద్యార్థులుకూడా నిర్భయంగా తమకు తోచినరీతిని విమర్శిస్తారు.

విద్యాలయ నిర్వహణకూడా ప్రజా తాంత్రిక పద్ధతులమీదనే జరుగు తుంది. స్థానిక విద్యాసంస్థకు బాధ్యత వహించవలసినది ప్రిన్సిపాలే. ఐన ప్పటికీ, ఉపాధ్యాయ సమావేశాలలో చేయబడే నిర్ణయాలను ప్రిన్సిపాలు అతిక్రమించడు. సోవియట్ సంయుక్త సమ్మేళనంలోని భావిసంతతిని అత్యుత్తమ మార్గంలో నడపాలనే బ్రహ్మాండమైన ఉత్సాహం, సోవియట్ ఉపాధ్యాయులందరిలోనూ నూతన ఉత్తేజాన్ని, సహకారాన్ని, సడలని ఐకమత్యాన్ని కలిగించింది. విద్యావేత్తలు, ఉపాధ్యాయులూ యీ ఆశ యంతోనే అతిసంతోషంగా తమ విధాయక ధర్మాలను నిర్వహిస్తున్నారు.



# పరీక్షలు

ప్రపంచంలోని అనేక దేశాల బాలబాలికల లేతజీవితాల్లో పరీక్షా దినాలు అత్యంతసంకట సమయాలుగా పరిణమించాయి. ఈ పరీక్షావిధాన మునుగూర్చి చాలకాలంనుండీ విద్యావేత్తలు చర్చిస్తున్నారు. కాని నేటి వరకూ సంతృప్తి కరమయిన పరిష్కారమార్గం కనపడలేదు.

పిల్లల పరిజ్ఞానాన్ని తెలుసుకునేందుకు, ఉపాధ్యాయులు సరియైన బోధనాపద్ధతుల ద్వారా విషయపరిజ్ఞానాన్ని కలిగిస్తున్నదీ లేనిదీ తెలుసుకునేందుకు, నాలుగవ తరగతినుండి బాలకులకు సోవియట్ సమ్మేళనంలో పరీక్షావిధానాన్ని అమలు జరుపుతారు. ఆ ఫలితాలను ఆధారంగాచేసుకొని ఉపాధ్యాయులు తమపద్ధతులను మరుసటి సంవత్సరంలో మార్చుకుంటారు

తరగతుల్లో బోధింపబడిన విషయాలపైనే ప్రశ్నలు వేయబడతాయి. పరీక్షలముందుగా అన్నివిషయాలు సమగ్రంగా సమీక్షచేయబడతాయి. బోధింపబడని పాఠాలలో ప్రశ్నలుండవు. భాషలు, గణిత శాస్త్రములలో తప్ప, తక్కిన అన్నివిషయాలపైనను ప్రశ్నలడిగి పరీక్షిస్తారు.

ప్రతివిషయంపైనను పాఠ్యసూచిక విపులంగా వ్రాయబడి, ప్రతితరగతిలోను పరీక్షలకు ఒక నెలరోజులముందుగా, విద్యార్థుల సౌకర్యార్థమై అంటిస్తారు. పాఠ్యసూచికను చదివిన పిల్లలు సులభంగా పరీక్షలలో వచ్చే ప్రశ్నల నూహించుకో గలుగుతారు. పరీక్షరోజున ప్రశ్నపత్రములను విద్యార్థులు తీసికొని, వాటికే ప్రశ్నలిస్తారు.

ఉపాధ్యాయుడు, ప్రిన్సిపాలు, స్థానిక విద్యాసంస్థ సభ్యుడు కలిసి పరీక్షకొనసాగిస్తారు. రోజునకొక పరీక్షమాత్రమే వుంటుంది. ప్రశ్నోత్తరాల పరీక్ష నలుబది ఐదు నిముషముల కాలం జరుగుతుంది.

నేను తరగతి సలహాదారుగా ఉన్నందున, మా విద్యార్థులు వార్షిక పరీక్షలకెట్లు తయారౌతున్నదీ చాలాశ్రద్ధగా గమనించేదానను. పరీక్షాదినాలకు చాలముందుగానే బడికిపోనిరోజుల్లో జరిగిన పాఠములను సరిగా బోధపడని అంశములను, బాలురు పాఠశాల సమయానంతరం ఉపాధ్యాయులవద్దకు వెళ్ళి, తెలుసుకో వలసిందిగా హెచ్చరించేదానను. పఠనీయాంశ సూచిక అంటింపబడగానే, జట్లుగా విద్యార్థులను వెంటబెట్టుకొని,

వారితోచదివి, చర్చించి, వారికికష్టంగా ఉన్న విషయాలను మరల బోధించవలసిందిగా ఉపాధ్యాయులతో చెప్పేదానను.

తరగతిసమావేశాలలో తెలివితేటలుగల విద్యార్థులు పరీక్షలకు తామెట్లుసన్నద్ధులౌతోన్నదీ చెప్పేవారు. వెనుకబడిన బాలురుకూడా చెప్పేవారు. చురుకయిన పిల్లలు తక్కినవారికి తోడ్పడుతారు. ఈ విధంగా తరగతిలోని బాలబాలికందరూ తరగతిమొత్తానికి పేరువచ్చునట్లు శ్రమిస్తారు. ఈ పరీక్షలు పిల్లల విషయ పరిగ్రహణ శక్తినే కాక సంవత్సరం పొడుగునా వారు చేసే కృషినికూడా యేవిధంగా వెల్లడిస్తాయో తెల్పుతాను.

నావిషయాన్ని బోధించేటప్పుడు కనీసం పదినిమిషాలైనా ముఖ్యాంశాలన్నిటినీ. నేను సమీక్ష చేస్తాను వెనుకబడిన విద్యార్థులను వెనుకబడిన వెంటనే కనిపెట్టి, తక్కిన వారితో సమానంగా తీసికొని వచ్చేందుకు ప్రయత్నిస్తాను.

తలిదండ్రుల సమావేశములు జరుపబడి, పరీక్షసమయాల్లో వారు తమ బిడ్డలకెట్లు తోడ్పడాలో చెప్పేవాళ్ళము కోపగించడము, భయపెట్టడము విసిగించడం చేయరాదనీ, పిల్లలచేత సకాలంలోచదివి, సకాలంలో విశ్రమించునట్లు చేయాలి. ఇంటివద్ద చేసుకురావలసిన పని విషయంలో శ్రద్ధతీసుకోవాలి అని నచ్చచెప్పేవాళ్ళము. ఇంటివద్ద చేయవలసిన పనికి సోవియట్ విద్యావేత్తలు చాలా ప్రాముఖ్యత ఇస్తారు. విద్యార్థుల స్వయం శక్తిని వృద్ధిపరిచే ముఖ్యసాధనగా పరిగణిస్తారు.

మొత్తంమీద పిల్లలు పరీక్షల సమయంలో అపరిమితంగా కష్టపడరు. యథాప్రకారంగానే, కృషిచేస్తారు. మరీ భయస్థులను వైద్యులు పరీక్షచేసినమీదట, సంవత్సరం పొడుగునా వారు చూపిన ఫలితాలనాధారం చేసుకొని, పై తరగతుల్లోకి పంపుతారు.

నోటి ప్రశ్నోత్తర పరీక్షసమయాల్లో, బాలురు యిచ్చే ఆత్మవిశ్వాస పూరిత సమాధానాలనుబట్టి, వారు పూర్తిగా తయారైనట్లు తెలుస్తుంది. పరీక్షపత్రాలలోని ఒక్కొక్క ప్రశ్ననేచూచి, మందహాస చంద్రికల నొలికిస్తో, ప్రత్యుత్తరాలను వ్రాయబూనుకునే బాలబాలికలను చూడటం బహు ముదావహంగా వుంటుంది.

ఏడవ తరగతికి జంతుశాస్త్రంలో జరుపబడే పరీక్షను ఉదహరిస్తాను. ఆతరగతిలోని విద్యార్థులకు సర్వసామాన్యంగా పదిహేనేండ్ల వయస్సు వుంటుంది. మొత్తం తరగతిని రెండుభాగాలుగా విభజించాము.

లేకపోతే చాలామంది విద్యార్థులుండుట వలన, విసుగు జనిస్తుంది. చాలా కాలం పడుతుంది. మొదటిభాగమునకు తొమ్మిది గంటలకు, రెండవ భాగమునకు రెండుగంటలకు పరీక్షలు జరిపాము. పాఠ్యప్రణాళికలో వుండే అన్నివిషయాలకు సంబంధించిన బొమ్మలు, లెక్కలను ఉదహరించిన పెద్ద పత్రములు నాలుగుగోడలమీద వ్రేలాడ వేయబడినాయి. చేపలు, పక్షులు, పాలిచ్చెడి జంతువులు, ఇంకను ఇతర జంతువుల శల్యములు మున్నగునవి బల్లలమీద పేర్చబడివున్నాయి.

తొమ్మిది గంటలకు ఏడవతరగతి పిల్లలు అల్లరిచెయ్యకుండా తరగతి గదిలోనికివచ్చి, ముందుబల్లను వదలి వెనుక కూర్చున్నారు. కామ్రేడ్ ఎడ్మండ్సు పరీక్షావిధానము ఈ విధంగా బోధపరిచారు. "ముందు ముగ్గురు బాలురజట్టును పిలుస్తాను. వారు వచ్చి యిక్కడవున్న ప్రశ్న పత్రాలలో ఒకటి పుచ్చుకొని, ముందుబల్లమీద కూర్చోవాలి. సమాధానాలిచ్చేముందు నాలుగైదు నిముషాలు ఆలోచించుకోవచ్చును. ఆ బల్లలమీద కాగితాలు, పెన్సిళ్ళు సిద్ధంగా వున్నాయి. ఈ గోడలకు వ్రేలాడతీయబడిన బొమ్మలను, పత్రాలనుచూచి, అవసరమని తోస్తే, మీ బల్లలవద్దకుకూడా తీసికొని వెళ్ళవచ్చును. సమాధానాలు వ్రాసి ముగించినతర్వాత, వెడితే వెళ్ళిపోవచ్చును, లేక వెనుకబల్లలమీద కూర్చోవచ్చును అది మీ ఇష్టం. ప్రతి ముప్పాతికగంటకు ఒకసారి ఆపుతాము. అందరూ పూర్తిచేశాక, ఒక్కొక్కరినే లోపలికి పిలిచి, వాళ్ళ ఫలితాలను చెబుతాను. అందరికీ అర్థమైందా ? ఏమన్నా ప్రశ్నలు వేస్తారా ?"

కొద్ది నిముషాలు ఆగినతర్వాత ఆమె మొదటిజట్టును పిలిచారు. ముగ్గురు విద్యార్థులువచ్చి, ప్రశ్నపత్రాలను తీసికొని, ముందుబల్లలమీద కూర్చుండి, వ్రాయడం మొదలెట్టారు. పెద్దపెద్ద బొమ్మలు, అస్థిపంజరాలు, వగైరాలను ఆలోచనాపూర్వకంగా పరికిస్తున్నారు. ప్రయత్నపూర్వకంగా చురుకైన పిల్లలను యేరి, యితర విద్యార్థులకు ధైర్యం కలిగించేందుకు కామ్రేడ్ ఎడ్మండ్సు ప్రయత్నించింది.

మొదటిజట్టు సమాధానాలిచ్చేందుకు ముందుకురాగానే, రెండవ జట్టును సిద్ధంగావుండి తయారవమన్నారు.

"చేపయొక్క బాహ్యస్వరూపం, లోపలి నిర్మాణం, నాకు వేయబడిన ప్రశ్న. అందువలన, చేప బాహ్యస్వరూప వర్ణనతో ప్రారం

భిస్తాను" అంటూ రోదలిక్ ఒకచేప అస్థిపంజరం తీసికొనివచ్చి, కండ్లకు కట్టినట్లుగా సమగ్రంగా సమాధానం చెప్పాడు.

సమాధానం ముగించి వెనుకబల్లమీద కూర్చోగానే, రోదలిక్కుకు 'ఎక్సెలెంటు' మార్కులు యిచ్చాను. ఆ కుర్రవాడు సమాధానం చెప్పిన తీరే, ఆతనికి ఆ విషయమందు సంపూర్ణ జ్ఞానంవున్న విషయాన్ని వ్యక్తం చేస్తుంది.

విద్యార్థులు ఒకరితర్వాత ఒకరు సమాధానా లిస్తున్నారు. ఒక బాలిక చాలాభయపడి, తడబడటం ప్రారంభించింది. కామ్రేడ్ ఎడ్మండ్సు "కుదురుగాకూర్చొని, రెండు నిమిషాలు ఆలోచించు అమ్మా. మళ్ళీ పిలుస్తాను" అంది. మళ్ళీ లేచినతర్వాత ఆ బాలిక, ఆత్మవిశ్వాసంతో సరిగా సమాధాన మిచ్చింది. మరియొక విద్యార్థికి ప్రశ్నకు సమాధానం తెలియదు. అందువలన మరొక ప్రశ్నపత్రంయిస్తే, దానికి బాగాసమాధానంఇచ్చాడు. కామ్రేడ్ ఎడ్మండ్సు మరికొన్ని ప్రశ్నలువేసి, ఆ ఒక్క ప్రశ్నకుతప్ప, తక్కిన విషయాలను బాగానే అర్థంచేసుకున్న సంగతిని, నిర్ధారించు కున్నారు.

అందరూ పూర్తిఅయిన తర్వాత, నేనూ ఎడ్మండ్సు మే మిచ్చిన మార్కులను సరిపోల్చుకున్నాము. మేము యేకీభవించని కొద్దిమంది విషయాలలో మరల సంప్రదించి, యే మార్కులు యివ్వాలో నిర్ణయించాము. ఆ ఫలితాలు చాలా సంతృప్తికరంగా వున్నాయి. 11 'ఎక్సెలెంటు', 4 'గుడ్' 2 'ఫెయిర్' మార్కులు వచ్చాయి. పిల్లలను పిలిచి, వారికి మార్కులు చెప్పాము. పరీక్ష లైనతర్వాత అనేక రోజుల వరకూ ఫలితముల కొరకు, ఆందోళనతో ఎదురు చూడనక్కరలేకుండానే వారు వెంటనే ఫలితాలనువిని గృహాలకు మరలారు.

పరీక్షలన్నీ ముగిసినతర్వాత, ఉపాధ్యాయుల సమావేశం జరిగింది. 'ఫెయిర్' అటుపైని మంచిమార్కులు వచ్చిన పిల్లలనందరినీ పై తరగతులలోకి పంపాము. 'పూరు' (తక్కువ) మార్కులు వచ్చిన విద్యార్థుల విషయంలో మరల విచారించి, నూత్న సంవత్సరపు తరగతులు ఆరంభ మయ్యేటప్పుడు మరొకపర్యాయం పరీక్షించి ఆ తరగతుల్లోనే నిలిపివేయడమో, పై తరగతికి పంపడమో నిర్ధారణ చేశాము.

# తలిదండ్రులు

'ప్రధానోపాధ్యాయునితో అనుజ్ఞపొందిన మీదట మాట్లాడేందుకు తప్ప, తలిదండ్రులు, విద్యాలయావరణలో అడుగిడరాదు' అని ఒక లండన్ పరిసరాల్లో ఎస్సెక్సు ప్రాంతీయ ప్రాథమిక విద్యాలయం మీద ఒక నోటీసు ఉంది. ఈవిషయం సోవియట్ ఉపాధ్యాయులతో చెప్పగా, అసంభవమని నమ్మేందకు నిరాకరించారు.

విద్యాలయాలతో సన్నిహిత సంబంధాన్ని తలిదండ్రులు కలిగి వుండటం, వారి ప్రధాన విధియని, సోవియట్ సంయుక్త సమ్మేళనంలో విశ్వసిస్తారు. ఈవిధంగా జరుగకపోతే, తలిదండ్రులకు వారి బిడ్డలయెడ గల బాధ్యతలను, ఉపాధ్యాయులు గుర్తుకు తెస్తారు. బోధన తరగతులకు, భోజనశాలలకు వచ్చిచూచి, తమ తమ అమూల్య సలహాలను యీయవలసిందిగా తరుచు తలిదండ్రులు కోరబడతారు.

ప్రతి విద్యాలయానికి సంబంధించి ఒక తలిదండ్రుల సంఘము ఉంటుంది. సంవత్సరానికి ఒక పర్యాయం ఆసంఘం యెన్నుకొనబడుతుంది. ఈసంఘం విద్యాలయ జీవితంలో అతి ప్రముఖ పాత్రను వహిస్తుంది. ఉత్సవములు, విందులు యేర్పాటు చేయుటకోను, ఆటలు, పోటీ పందెముల సమయంలోను, భోజనశాలలో పని నిర్వహణమునకును యీ సంఘం యెక్కువగా తోడుపడుతుంది. తలిదండ్రుల సమావేశంలో విద్యాలయ నిర్వహణంగూర్చి అమలు జరుపబడుతోన్న విద్యావిధానమును గూర్చి విపులంగా ప్రిన్సిపాలు ఒక నివేదికను చదువుతాడు. తలిదండ్రులు చాలా శ్రద్ధతీసికొని చర్చిస్తారు.

సాధారణ సమావేశాలేకాక, నెలకొక పర్యాయం తరగతి సమావేశాలు జరుపబడతాయి. తమపిల్లలనే దృష్టియందుంచుకొని, తరుచుగా తలిదండ్రులు తరగతి ఉపాధ్యాయులను విమర్శిస్తూంటారు. ఆ ఉపాధ్యాయుడు తరగతిలోని విద్యార్థులందరిని మనసునందుంచుకొని సాముదాయిక దృష్టితో తన బోధనావిధానాన్ని అమలు జరుపుతోండటాన్ని, వారికి విశదమగునట్లు చెబుతాడు. తలిదండ్రుల సరళ విమర్శనలు చాల ప్రయోజనకారిగా వుంటాయి.

ఏడవ తరగతి తలిదండ్రుల సమావేశంలో పదార్థ విజ్ఞాన శాస్త్రోపాధ్యాయుని సంగతి చర్చకు వచ్చింది. మా ఉపాధ్యాయుల సమావేశంలో మేము చర్చించిన అంశములనే, అనేకమంది తలిదండ్రులుకూడా ఆయన లోపములనుయెంచి విమర్శించారు. ఆయన లోపములను మాకు కూడా తెలియుననియు, యువకుడుగాన సవరించుకుంటాడని ఆశించామనీ, మా ప్రిన్సిపాలు చెప్పి, ఆయన యీసమావేశంలో హాజరుకానందున, మరుసటి సభలో చర్చించుటకు వాయిదా వేయవలసిందని కోరాడు.

ప్రతివిద్యార్థివద్ద ఒక విద్యాలయ దినచర్య పుస్తకం వుంటుంది. అందులో వివిధ విషయాలలోను వారికి వచ్చిన మార్కులు వేయబడతాయి. ఇంటికీయబడిన పనికూడా వ్రాయబడుతుంది. వారమునకొకపర్యాయము తరగతి సలహాదారు అందుపై అభిప్రాయమును వ్రాసి, తలిదండ్రుల సంతకములకై పంపుతాడు. తలిదండ్రులు తమ బిడ్డల బాగోగులను గుర్తించి, తమ అభిప్రాయాలనుకూడా వ్రాసేందుకు ఒక ప్రత్యేక స్థలంవుంటుంది. ఈపద్ధతిమూలమున తమ బిడ్డలు యింటివద్దచేయవలసిన పనియేమిటో, చదువవలసిన పాఠములేమిటో తెలిసికొనగలరు. సంతకం చేయని సంరక్షకుని వెంటనే టెలిఫోనులో పిలిచి ప్రధానోపాధ్యాయుడు కారణం కనుక్కుంటూ ఉంటాడు.

తరగతిలో వెనుకబల్లమీద తల్లులుగాని, తండ్రులుగాని పాఠాల సమయంలో వచ్చి కూర్చుని, బోధనానంతరం, ఉపాధ్యాయులతో బిడ్డల కష్టసుఖాలనుగూర్చి, బోధనావిధానమునుగూర్చి ముచ్చటిస్తూ ఉండటం బహుతరుచుగా మనం గమనించవచ్చును.

తరగతిలోని విద్యార్థుల కుటుంబ పరిస్థితులను పూర్తిగా సలహాదారు తెలిసికొనవలయును. అందుకొరకు వారి గృహములకుగూడ అప్పుడప్పుడు వెడుతూండాలి. అందువలన సోవియట్ కుటుంబ జీవిత పరిస్థితులను అవగాహన చేసికునేందుకు యెక్కువ సావకాశము లభించింది.

నేను వెళ్ళిన ప్రతిగృహంవద్ద బాలురు నాకు మంచి స్వాగతమిచ్చేవారు. తలిదండ్రులతో వారి లోటుపాట్లను గూర్చి చెప్పేందుకు వచ్చినట్లు తెలిసినా పిల్లలు అమిత సంతోషంతో ఆహ్వానించేవారు. చాలా గృహాలుచూచిన తరువాత, తలిదండ్రులిద్దరూ పనులకొరకు గృహం వదలి వెడితే, పిల్లలపోషణ, చదువు వగయిరాలు యెంతకష్టమో గ్రహించాను. విరామసమయాలలో పిల్లలకుమంచి నడత అలవడునట్లు చూసేందుకు

మాతాపితలు జాగ్రత్తగా ఆలోచించి, తదనుగుణ్యంగా పనిచేయవలసి వుంటుంది.

మాస్కోలో ఆంగ్లంబోధించే పాఠశాల మాది ఒక్కటే. అందు వలన మా విద్యార్థులయిండ్లు మాస్కోలో అన్నిప్రాంతాల్లోనూ వున్నాయి. మా విద్యార్థులలో అల్లరి పిల్లకాయల, అశ్రద్ధపరుల యిండ్లకు ప్రథమంలో వెళ్ళుట ప్రారంభించాను. మాకుయెక్కువ కష్టం కలిగిస్తున్న జిమ్మీయింటికి నేను వారినింటివద్ద కలుసుకునేందుకు ఒకరోజు నిర్ణయించవలసినదిగా వ్రాసి, వారు యేర్పాటు చేసిన రోజుకు జిమ్మీతండ్రిని కలుసుకున్నాను.

విప్లవాత్పూర్వపు రష్యను యిండ్లమాదిరి ఒక కర్రయింటిలో జిమ్మీ నివసిస్తున్నాడు. ఉన్నరెండు గదులు చిన్నవి రెండుకుటుంబాలకు కలిపి ఒకే వంటగది వున్నది. 'ఈ వేసంగిలో మాకొక క్రొత్తయింట్లో భాగం యిస్తారు. అప్పుడువచ్చి మా యిల్లుమీరు తప్పక చూడాలి. ఈవీధి అంతాఖాళీచేసి, క్రొత్తయిండ్లు త్వరలోనేకట్టబోతున్నారు. పాతమాస్కోలో అధికభాగం కర్రయిండ్లే. కాని పది సంవత్సరాలలో ఒక్కటికూడా మచ్చుకు కనపడదు. ఆవరణలో చెట్లు, పూలమొక్కలతో మాయిండ్లు కలకలలాడుతాయి'. అని జిమ్మీ తండ్రి నాకు అతిధ్యం యిచ్చి ఆదరణపూర్వకంగా చెప్పాడు.

టీ అనంతరం నేను వచ్చిన పని చెప్పాను జిమ్మీ యింటికిచ్చిన పని చేసుకు రావడంలేదు. జిమ్మీయింటివద్ద యేమిచేస్తూ ఉంటాడని అడిగితే, బడివదలిన తర్వాత, తిన్నగా యింటికిరాక, చాలా చీకటి పడే వరకు ఆడుతో వుంటాడని తేలింది.

మాసంభాషణనంతా జిమ్మీవింటున్నాడు.

" మీ అమ్మ చెప్పిన విషయం నిజమేనా, జిమ్మీ ?" అని అడిగాను

" ఔను, నిజమే " అని సమాధానం.

" చదువుకోడం యిష్టమేనా ? "

జిమ్మీ తన వద్దనున్న ఇంగ్లీషు, రష్యను పుస్తకాలు చూపాడు. ఆ పుస్తకాలను మేము చూస్తోంటే " మంచులో కర్రలతో జారటం నాకు అపరిమితయిష్టం. వేసంగిలో చేపలు పట్టడం అంటే ప్రాణంలేచివస్తుంది. సాయంసమయాలలో మంచులో రంయ్యిమని జారుతూ వుంటాను, అందు వలననే యింటికి ఆలస్యంగా వస్తాను." అని జిమ్మీ చెప్పాడు.

నేను, జిమ్మీ, తల్లి, తండ్రికలిసి, పాఠశాలానంతర కాలాన్ని జిమ్మీ యేవిధంగా గడపాలో నిర్ణయించాము. జిమ్మీకి ఉత్సాహం కలిగించేందుకు యింజనీరింగు పుస్తకాలు, బాలుర ప్రచురణాలయాలలో వచ్చిన మంచి బొమ్మల పుస్తకాలను కొని చదువులో శ్రద్ధ కలిగించ వలసిందని చెప్పాను.

జిమ్మీ తండ్రి తన కారులో మాస్కోలో కొత్తగా కట్టిన వీధుల లోనికి తీసికొని వెళ్ళాడు. ఆయన అమెరికానుండి తన కారు తెచ్చుకున్నాడు. "కొద్దికాలంలో ప్రపంచంలోకల్లా అందమైనకార్లు మా మాస్కో వీధుల్లో తిరుగుతాయి." అంటూ సగర్వంగా చెప్పి, మాయింటివద్ద దిగబెట్టి వెళ్ళి పోయినాడు.

"వంటపని మంచిదా? విమానం నడిపేపని మంచిదా? ఏదిమంచిదంటారు, కామ్రేడ్?" అంటూ యూజిని ఒకరోజున అడిగింది.

"ఈ ప్రశ్నకు సమాధానంయివ్వడం కష్టమైన పని, అమ్మా. ఎందుకడిగావ్?" అని నా ప్రత్యుత్తరం.

"నా తల్లి వంటగత్తె, ఈనాతల్లి విమానచోదకురాలు. యేది మంచిదా, అని మే మిద్దరమూ వాదా లాడుకుంటున్నాము"

"ఈ విషయాన్ని తరగతి సమావేశంలో చర్చకు తీసికొనివస్తే బాగుంటుందేమో! అందరి అభిప్రాయం తెలుసుకోవచ్చును." అని నేనంటే యూజినీ ఆ అభిప్రాయం బాగుందని యేకీభవించింది.

తలిదండ్రుల వృత్తులమీద చర్చకు యీ విధంగా పునాదిపడింది. ఈ ప్రశ్న చాలా ప్రాముఖ్యమైనది. పండ్రెండేండ్ల వయసుగల బాల బాలికలు యీ చర్చలో అమితోత్సాహంతో పాల్గొన్న తీరుచూస్తే, యీ సమస్యయొక్క ప్రాధాన్యత గుర్తుకు రాకతప్పదు.

'విమానం నడపడంకంటె, వంటపని చాల ముఖ్యమని నా అభిప్రాయం. ఆహారం మనకి ప్రాణావసరం.' అంటూ ఒకబాలిక అభిప్రాయాన్ని వెల్లడించింది.

'కాదు, కాదు. యుద్ధాలు వచ్చినపుడు విమానచోదకులు యెక్కువ అవసరం' అంది మరొకబాలిక.

'మా అమ్మ బట్టలుకుడుతుంది. నా అభిప్రాయంలో, ఆమెవృత్తి యే యితర వృత్తులకంటె తీసిపోదు' అని గట్టిగాచెప్పింది ఇంకొకపిల్ల.

"అసలు సంగతి మనం ఆలోచించవలసింది యేమిటంటే, యూజినీతల్లి మంచి నిపుణురాలైన వంటగత్తెయా, అని. ఆమె పాక శాస్త్ర నిపుణురాలైతే, ఆమె సంఘానికి అతిముఖ్యురాలు. ఆ విధంగానే, ఈ నా తల్లికూడా. ఆమె నిపుణురాలైన విమానచోదకురాలైతే ఆమెకూడా ముఖ్యురాలే. ఆవిధంగానే నేర్పరియైన ప్రతి తల్లికూడా. మాతల్లి ఉపాధ్యాయురాలు, ఆమె సమాజానికి పరమ ముఖ్యరాలు!" అంటూ ఆనీ చెప్పింది.

"నిజం! నిజం!" అంటూ అనేక మంది ముక్తకంఠంతో పల్కారు.

"మా తల్లి పేరుమోసిన వంటకత్తె ఐదువందలమంది భోజనం చేసే, భోజనశాలలో పని చేస్తోంది. ఆరోగ్యకరము, రుచికరమూ ఐన పచనం చేసినందుకు అనేకమార్లు బహూకరింపబడింది" అంటూ యూజనీ గర్వసూచకంగా చెప్పింది.

చర్చ తల్లుల వృత్తులనుగూర్చి మాత్రమే జోరుగా సాగిపోతోంది. మొత్తంమీద పిల్లలందరూ అన్ని వృత్తులు మంచివేననీ, సమాజానికి అవసరమేనని, వారు వారు చేసే పనులలోని విశిష్టతలో మాత్రమే తేడా ఉంటుందనే నిర్ణయం చేశారు. "తల్లులు: వారి వృత్తులు" అను అంశమును గోడ వార్తాపత్రికలో చర్చించుటకు నిశ్చయించాము.

గోడ వార్తాపత్రికలో చర్చ బహు పసందుగాసాగింది. కొందరు తల్లులు బిడ్డలకు చెప్పిన వారి జీవితాల్లోని రోమాంచల, రసవత్తర ఘట్టాలను బిడ్డ ఉదహరించారు. అవ్వి చదివేందుకు చాలా ఉల్లాసంగా ఉంది. వారి వారి పనులలో ప్రఖ్యాతి పొందిన తల్లుల చిత్రపటాలను కూడా అంటించాము. తమ తల్లుల మంచిపేరును తాము తరగతులలో వెనుకబడి వుండి పాడుచేయ రాదనే సత్సంకల్పం పిల్లలలో కలిగేందుకు బాగా ఉపకరించింది. ఏతల్లుల బొమ్మలు గోడ వార్తాపత్రికలో ప్రచురింపబడలేదో, వారి పిల్లలు సిగ్గుచెంది, ఆవిషయాన్ని తల్లులతో చెప్పారు.

ఒక కుర్రవాడు తన తల్లి పనినుండి యింటికి రాగానే, ఆమె కూడా ప్రథమశ్రేణిలో చేరిందా లేదా? అని వేధించ మొదలు పెట్టాడు. ఆమె సిగ్గుపడి. చికాకుచెంది, తన కుమారుని మందలించ వలసిందిగా నాకు టెలిఫోను చేసింది. ఆపిల్లవాడిని పిలిచి అతని తల్లి సర్వశక్తులూ వినియోగించి ప్రథమశ్రేణిలోనికి వచ్చేందుకు ప్రయత్నిస్తోందనీ, మే దినో

త్సవంవరకూ ఆమెను చీకాకు పరచవద్దనీ నచ్చ చెప్పాను. మే దినోత్సవ సమయానికి ఆమెను ప్రథమశ్రేణిలోనికి తీసుకున్నారు ।

పది యేండ్ల బిడ్డయైన కోస్ట్యా తండ్రి కోప స్వభావం కలవాడు. కోస్ట్యా కూడా అల్లరి పిల్లకాయ. అందువలన తండ్రి తరుచుగా కొడుతూం డేవాడు. ఒక రోజున కోస్ట్యా తన తండ్రి కొట్టాడని, పోలీసులతో రిపోర్టు చేశాడు. పోలీసు ఉద్యోగి బహుశా కోస్ట్యా తండ్రి చదువు కోని మూర్ఖుడో, త్రాగుబోతో, అయ్యుంటాడని అనుకొని, వారి ఇంటికి వచ్చి చూడగా, ఆయన చాలా నాగరికుడని తేలింది. తల నొప్పితో బాధపడుతోండగా, కోస్ట్యా అల్లరి చేశాడని, యెన్ని పర్యాయాలు చెప్పినా వినక పెద్దగొంతుకతో మాట్లాడి, విసిగించినందున, ఒక చెంపదెబ్బకొట్టినట్లు తెలిసింది. కోస్ట్యా కూడా దెబ్బతినడం అదేమొదటి పర్యాయం. అందువలన చాలా అభిమాన పడ్డాడు.

నిబంధనల ప్రకారంగా మరల నెల తర్వాతవచ్చి చూస్తాననీ, తండ్రి మళ్ళీ తన బిడ్డను కొట్టడని ఆశించుతున్నానని చెప్పి, కోస్ట్యాను "ఇంత క్రితమెప్పుడూ నీతండ్రికొట్ట లేదుకదా, యెందుకు రిపోర్టు చేశావని" పోలీసు ఉద్యోగి అడిగాడు.

"మా తండ్రి సోవియట్ దేశంలో లాయరు. సోవియట్ బాలబాలి కలను, వారి తలిదండ్రులు కొట్టకూడదను, నిబంధన ఉండటం తెలిసి కూడా, ఆయన నన్ను యెందుకు కొట్టాలి ?? అని కోస్ట్యా సమాధానం యిచ్చాడు.

—✦—

పంచాయతీ
వేమన గ్రంథాలయ

# పాఠ్యేతర కార్యకలాపాలు

తెలప్రోలు

పిల్లలీల్లభిట్లులు. అభిమాన విషయములను మాత్రమే పాటించకుండా, తరగతులలో పాఠ్యప్రణాళిక ననుసరించి, అన్ని పాఠములను బోధించుటద్వారా విద్యార్థులకు విజ్ఞానమును వృద్ధిపరుచుట సరియైనమార్గమని సోవియెట్ విద్యావేత్తలు నమ్ముతారు. చాలమంది విద్యార్థులకు కొన్ని ప్రత్యేకవిషయములయందు ఆసక్తిమెండు. ప్రతివిద్యాలయమునకు సంబంధించి పాఠ్య కాలానంతరం అభిరుచుల ననుసరించి ఆయా సమాజములలో ప్రత్యేక కృషి చేసేందుకు విద్యార్థులకు సావకాశం కలదు. నాటక, సారస్వత, చిత్రకళ, పదార్థవిజ్ఞాన, రసాయనిక, మున్నగు అనేక సమాజములలో విద్యార్థులుచేరి తమతమ విజ్ఞాన కళా నైపుణ్యములను అభివృద్ధి పరచుకొనవచ్చును.

ఈ సమాజములకు విద్యార్థులు ఐచ్ఛికంగానే వెడతారు. కాని, నిర్బంధములేదు. జేరినపిల్లలు మాత్రం క్రమంతప్పక కొంతకాలంపని చేయవలసి వుంటుంది. ప్రతిసమాజమునకు సమర్థుడైన ఒక నాయకుడు ఉంటాడు. విద్యాలయమే అతనికి జీతమిస్తుంది. ఒక విద్యార్థి కార్యదర్శి ఆ సమాజం తాలూకు యావత్తుపనిని, చేస్తుంటాడు.

నవంబరు విప్లవ, మే, ఉగాది, దినోత్సవాలకు వివిధ సమాజములు కలిసి ఉత్సాహపూరితమయిన కార్యక్రమం జరుపుతాయి. నాటక సమాజంవారు ఒక నాటకం వేస్తారు. దానికి కావలసిన తెరలు, రంగస్థల అలంకరణ మున్నగు వాటిని కళోపాసకులు, కాంతికిగాను వివిధరంగుల విద్యుచ్ఛక్తి బల్బులతో రంగస్థలమును అమర్చుట శాస్త్రసమాజికులు చేస్తారు. జంత్ర గాత్ర వాయిద్యగాంధ్ర సమాజికులు కార్యక్రమంలో పాల్గొని సభికుల మనస్సు రంజిస్తారు. అట్టి ఉత్సవసమయాల్లో వివిధ సామాజికులు చేసిన వస్తువుల, చిత్రముల, విమానముల, ఓడల నమూనాల యొక్క ప్రదర్శనం జరుగుతుంది.

మా విద్యాలయంలో మంచి చురుకైన కళోపాసకుల సమాజం వున్నది. అందులో పదిమంది సభ్యులున్నారు. వారే నాటకాలలోను, తదితర ప్రదర్శనములలోను అలంకరణచేసేవారు. ఏడవ తరగతిలో చదువుతూన్న ఆర్థరు వారికి నాయకుడు. అతని చిత్రములు గొప్ప ప్రతిభను,

వ్యక్తిత్వమును చాటుతాయి. పుష్కిన్ మహాకవి వర్ధంత్యుత్సవ మాస్కో ప్రదర్శనంలో అతనిచే వ్రాయబడిన "జాలరి - చేపలు" అనే చిత్రపటం ప్రదర్శింపబడి, చూపరులచే మిక్కిలి హర్షింపబడింది.

మా విద్యాలయపు ప్రకృతిశాస్త్ర పరిశోధకుల సమాజంలో ఇరువది మంది బాలబాలికలు సభ్యులుగా వున్నారు. వివిధ జంతు ప్రదర్శనశాలల లోని జంతువుల అభివృద్ధి, అలవాట్లు, పెరుగుదల మున్నగువాటిని పరీక్షించడమేకాక, మాస్కోలోని పెద్ద జూ (జంతుప్రదర్శనశాల) బొటానికల్ గార్డెన్సు (పరిశోధన వృక్షవాటికలు) ల లోను ప్రత్యేక విషయములపై కృషిచేసే శాస్త్రవేత్తలకు సహాయకులుగా పనిచేస్తోవుంటారు.

మాస్కోను దర్శించేందుకువచ్చిన ఆంగ్లఉపాధ్యాయులకు మాస్కో వృక్షవాటికను చూపించే సదవకాశం నా కొకపర్యాయం లభించింది. మే మా ప్రాంతం దగ్గరకు వచ్చుసరికి మా బడిలో నాలుగవ తరగతి చదువుతోన్న సేమూరు వమ్మల్ని కలిసి, ఆ వృక్షవాటికలోని వివిధ వృక్షములను, లతలను పుష్పనికుంజములను చూపించేందుకు మొదలు పెట్టాడు. ఆ పిల్లవాని విజ్ఞానం మా ఆంగ్లబోధకులను ఆశ్చర్య చకితులను చేసింది. వరుసలుతీరి ప్రాతబడిన ఆ మొక్కలమధ్యనున్న మార్గముల వెంబడి నడుస్తోన్న మాకు, ప్రతి మొక్కను గూర్చిన వింత విషయములను అత్యద్భుతంగా వివరించాడు. తుట్టతుదకు అంట్లుకట్టి, క్రొత్త రకముల ఫలపుష్పములను, కూరగాయలను కాపించుటయందు ప్రపంచ ప్రఖ్యాతిగన్న నూతన పరిశోధనల సాగించిన మిచురిన్ పద్ధతులపై పెంచబడుతోన్న వాటికకు తీసికొనివెళ్ళాడు. ఇచ్చటకూడా సేమూరు అంట్లు కట్టు విధానమునుగూర్చి వివరంగా చెప్పాడు.

సాంకేతిక విద్యానిపుణులైన విద్యార్థులు జిల్లా సాంకేతిక కేంద్రమునకువెళ్ళి, వివిధ నిర్మాణములను చేయవచ్చును. వివిధ పరికరములతో కూడిన పెద్దశాలలలో, రేడియోలు, వైర్‌లెస్సు, నమూనా ఓడలు, రైల్వే యింజన్లు, విమానాలు నిర్మించవచ్చును. ఉపాధ్యాయుని వద్దనుండి, శ్రద్ధాళువైన విద్యార్థి అనుయోగ్యతాపత్రమును తీసికొని వెళ్ళిన విద్యార్థికి అందు స్థానం దొరుకుతుంది.

ప్రతి జిల్లాకు కేంద్ర గాన, చిత్రకళా విద్యాలయము లున్నాయి. ముందు పరీక్షించి, తగు విద్యార్థులను అందులో జేర్చుకుంటారు. ఆటల

యందు శ్రద్ధగలవారుకూడ జిల్లా కేంద్ర సమాజములలో జేరి, తమ తమ అభిరుచులను, ప్రత్యేక అసక్తులను అభివృద్ధిపరచుకొనవచ్చును.

మార్గదర్శకుల ప్రాసాదమని పిల్వబడే మార్గదర్శకుల కేంద్ర భవనమునకు చెందిన యేదోఒక సమాజములో సభ్యులుగా వుండవలయునని మాస్కోలోని ప్రతిబాలుని ఆశయము. ఆ ప్రాసాదానికి చెందిన నాటకశాల, గ్రంథాలయము, పఠనశాలలకు ఉచితప్రవేశ పత్రం పొందుట గొప్ప ఘనతగా భావిస్తారు. అసాధారణ ప్రజ్ఞగాని, యున్నతగిన సాంఘిక సేవ చేసిన మార్గదర్శక బాలబాలికలకు మాత్రమే పత్రములు లభిస్తాయి.

మార్గదర్శకుల కేంద్రభవనం బాలబాలికలకు స్వప్న ప్రాసాదంవలె వుంటుంది. పైకి చూచుటకు. మధ్యయుగపు రాతి దుర్గంవలె కనిపించినప్పటికీ, లోపల అతి ఆధునికంగా కన్నుల పండువుగావుంటుంది. లలిత కళలు, ఛాయాగ్రహణ చిత్రములు, ఫిల్ములు, ఆధునిక పద్ధతులపై అలంకరింపబడిన రంగస్థలము, ఆటవస్తువులు. ఇంజనీరింగు, శాస్త్ర పరిశోధనలు పిల్లల కుపరించేటి, ఆనందమును కలిగించేటి, సమస్త సాధన సంపత్తితో కలకలలాడుతో ఉంటుంది. సోవియెట్ సమ్మేళనంలో మిక్కిలి ప్రసిద్ధిచెంది ప్రజలందరిచేత విమాన చోదకత్వంలో, నూత్నప్రాంత పరిశోధనలలో వీరులని మన్నింపబడువారు, గొప్ప వ్రాయసగాండ్రు, కవులు, కళావేత్తలు, గాయకులు, యిచ్చుటకు వచ్చి పిల్లలతో, ఆడి, పాడి, మాట్లాడి, వారికి ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తూంటారు.

మార్గదర్శక కేంద్రభవన నాటక రంగస్థలంపై జరిగిన అంతర్జాతీయ ప్రదర్శనంలో పాల్గొనేందుకు మా విద్యాలయ గాయక సమాజానికి ఆహ్వానం వచ్చింది. ఆంగ్ల, అమెరికను జానపద గేయాలను పాడుటకు అంగీకరించి, మాకొరకు వచ్చిన ప్రత్యేక బస్సులో భవనానికి వెళ్ళాము.

భవనం అంతా వివిధదేశ బాలబాలికలతో కిటకిట లాడుతోంది. ప్రేక్షకులంతా ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటూ ప్రదర్శనంకొరకు ఉత్సాహంగా యెదురు చూస్తున్నారు. అకస్మాత్తుగా నటకులు వివిధ వాయిద్యములతో రంగస్థలాన్ని అలంకరించారు. యుక్రేనియను, యూదు, జర్మను, పోలిషు, జిప్సీ, అస్సీరియను, కజక్స్థాను మున్నగు అనేక దేశీయులున్నారు. మెడలో మెరిసే ఎర్రగుడ్డ కట్టుకున్న పది సంవత్సరముల అందమైన పిల్ల ఆ ప్రదర్శకులకు మేళ నాయకురాలు. ప్రదర్శకులను,

కార్యక్రమంలోని ప్రతి ప్రదర్శనపు అంశమును మనోహరంగా ఉత్సాహ పూరితంగా వివరించి ఆమె చెప్పేది.

పాటలు, నృత్యములు, కోలాటములు, కార్యక్రమంలో వున్నాయి. యుక్రేనియన్, జిప్సీ నృత్యాలు నన్నత్యమితంగా ఆకర్షించాయి. ఒక పది యేండ్ల కుర్రవాడు వాయించిన ఫిడేలు వాయిద్యము, ఒక యూను బాలిక పాడుతో అభినయించిన పద్యనాటిక మనోరంజకంగా వుండి ప్రేక్షకుల మెప్పును పొందాయి.

ప్రదర్శకులలో యెవ్వరూ సభాపిరికితనం చూపలేదు. సభా పిరికితనంగాని, సిగ్గుగాని, నూతనుల-టే భయంగాని సోవియట్ బాలబాలికలలో లేకపోవడం, వారి ప్రత్యేక లక్షణం. పిల్లలందరూ వినగోరే కధలను చెప్పారు. సోవియట్ సమ్మేళనంలో ప్రఖ్యాతిచెందిన మహావీరుల జీవితాల్లోని రసవత్తర పట్టాలను రసోచితంగా కొందరు చెప్పారు. నూతన శాస్త్రపరిశోధనలు, ప్రకృతిపై విజయాలను గూర్చి క్లుప్తముగా కొందరు చెప్పారు. ఈప్రబోధనా పద్ధతులవలన సోవియట్ బాలబాలికలు విశాలమైన తమ పితృదేశాన్ని ప్రేమించడం, గౌరవించడం, అప్రయత్నంగా నేర్చుకుంటారు. అంతర్జాతీయ సహోదర భావాన్ని పెంపొందించే ఆటలను కార్యక్రమాలను పిల్లలచే అనుసరింప జేస్తారు.

అంతర్జాతీయ బాలబాలికల వినోద కార్యక్రమములను పేరిట, వివిధ జాతీయ బాలబాలికలచేత రేడియోలో గేయాలు, పాటలు, కధలు, పొడుపుడుకధలు, సమస్యలు, చెప్పిస్తారు. పిల్లల బ్రాడ్‌కాస్టింగు సంఘమువారు సోవియట్ సమ్మేళనంలోని వివిధ ప్రాంతాల పిల్లలతోనూ హెచ్చుగా ఉత్తర ప్రత్యుత్తరాలు, జరుపుతారు. పిల్లలు అనేక కధలు, సమస్యలు, గేయాలువ్రాసి పంపుతారు. అనేక సలహాలు కూడా యిస్తారు. వాటినుండి యేరి, కార్యక్రమంలో జేరుస్తారు.

ఉగాది సోవియట్ బాలబాలికలకు గొప్ప పర్వదినం. ఆరోజున అర్ధరాత్రి వరకూ కూడా పిల్లలు వినోదంగా కాలక్షేపం చేస్తారు. ఒక పెద్ద వృక్షంనిండా వివిధరంగుల విద్యుచ్ఛక్తి దీపాలతో అలంకరించి, వివిధ భక్ష్యములను తింటో, ఉంటారు. ఒకరు ప్రాస్తుతాత వేషం వేసుకొని చమత్కారపు కధలు చెప్పి యుక్తిలెక్కలు, పొడుపుడుకధలు అడిగి అందరనీ నవ్విస్తాడు. ఆ రాత్రి చాలా మీరిపోయే వరకూ పిల్లలు ఆడుతో పాడుతో ఆనందంగా గడుపుతారు.

రాత్రిసమయాలుచాలా సరదాగా గడిపే మరొక విధానం అంతర్జాతీయ నెగడిమకాములు. వివిధ విద్యాలయాలకు చెందిన, వివిధ జాతీయ బాలబాలికలు యేదోవొక విద్యాలయంవద్ద జేరి, ఒక 'నెగడి మంట' రగిల్చి పాటలు, పద్యములు, సమస్యలు, పద్యనాటికలు, రసవత్తరమైన చిన్న కథలు, నృత్యములతో చాలా ఆనందంగా సాయం సమయములు గడుపుతారు. ఈ నెగడి మకాముల కార్యక్రమం వివిధప్రాంతీయుల భాషలు, పాటలు, సంస్కృతి మున్నగునవి పరిచయంచేసుకొని, సోహార్ద్ర సౌభ్రాతృత్వ భావములను పెంపొందింప చేసుకునేందుకు ఉపకరిస్తాయి.

ఈ నెగడి మకాముల వద్ద చాలా ముఖ్యమైన సమస్యలను కూడా చర్చిస్తారు. ఒక పర్యాయం పదిహేనేండ్ల కుర్రవాండ్రు ' స్నేహా ' న్ని గూర్చి చర్చించారు. చుట్టూ అంధకారం క్రమ్ముకొని వున్న చిన్నమంట వెల్తురు. ఉన్నతసమస్యలను చర్చించేందుకు గొప్ప ప్రోద్బలం చేస్తుందనుకుంటాను. ఆ కుర్రవాండ్రు విశాలదృక్పథంతో జాతులమైత్రి, దేశాల మైత్రి, వ్యక్తిమైత్రులను గూర్చి తమ భావాలను వెల్లడించారు. ఒకే పురుషజాతికిగాని, స్త్రీ జాతికిగాని చెందిన యిద్దరు వ్యక్తులయొక్క స్త్రీ పురుషులయొక్క స్నేహభావాన్ని గూర్చి జాగ్రత్తగా తర్కించి, దీర్ఘ చర్చ అనంతరం, యీ యిద్దరియొక్క స్నేహం వారిని సమాజాన్నుండి వేరు పరిచి, దూరంగా తీసికొని పోతే, వారిమైత్రి నిజమయినదికాదు, ఇద్దరికీ అపాయకరమయినది అనే నిర్ణయానికి వచ్చారు. అట్లుకాక సంఘానికి ఉపకారిగానుండి సంఘశ్రేయస్సునకు తోడ్పడితే, వారిస్నేహం సమగ్రమైనది, శ్రేయస్కరమైనది.

ఉపాధ్యాయుల, విద్యార్థుల మైత్రి సమస్యకూడా తరువాత చర్చింపబడినది. ఈ మధ్యనే యితరదేశాలనుండి వచ్చి సోవియెట్ దేశంలో చదువుతోన్న పిల్లలు, తమతమ దేశాల్లో పేముబెత్తాల నుపయోగించే విద్యావిధానంలోని అనుభవాలను వర్ణించారు. ఇంగ్లండు దేశంలోని బాలికాపాఠశాలలలోని ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినుల కొంతమంది వ్యక్తులపై, ప్రత్యేక కారణాలవల్లచూపే ఆదరణను, అందువల్ల బాలబాలికలకు అన్యాయంగా యెక్కువ మార్కులనిచ్చే అక్రమవిధానాన్ని తీవ్రంగా నిరసించారు. ఒక్క సోవియెట్ రష్యాలోనే బోధక, బోధితులమధ్య నిజమైన, న్యాయబద్ధమైన అనురాగము, ఆదరణ, మైత్రి భావాలు కలిగేందుకు సావకాశం వున్నదని అందరూ అంగీకరించారు.

సోదర విద్యార్థులపై 'చాడీలు' చెప్పే విధానంపై వాదన రేగింది. కొందరు విద్యార్థులు పితూరీలు చెప్పరాదని తీవ్రంగా వాదించారు.

'కొండెములు చెప్పడం కూడని పనే' అంటే, విద్యార్థులు సోదరవిద్యార్థుల చాటున, వారిపై పితూరీలు చెప్పడం సహింపరాదు. కాని లోపములుగాని, దోషములుకాని కనిపించినచో, ముందు ప్రత్యేకముగా ఆ దోషితోనే చాటునచెప్పి మందలించాలి. అప్పుడుకూడా, మానకపోతే విద్యార్థుల సభలో బహిరంగంగా విమర్శించాలి. అతని బాగుకోరి చేసే విమర్శ తప్పుకాదు. అని ఒక కుర్రవాడు చెప్పాడు.

'అమెరికాలో యే విద్యార్థి దోషాలనయినా ఉపాధ్యాయునితో చెబితే అతడు శిక్షింపబడతాడు. కాని సోవియెటువిధానంలో శిక్షలు లేవు. పైగా స్నేహపూర్వకంగా సంస్కరించేందుకు ప్రయత్నిస్తారు కనుక, బహిరంగంగా చర్చించడం సోదర విద్యార్థులకు ద్రోహం చేయడం కానేరదు.' అని ఒక అమెరికను బాలకుడు తన అభిప్రాయంచెప్పాడు.

ఆ చర్చను ముగిస్తో, సోన్యా తన అభిప్రాయాన్ని యీ విధంగా క్రోడీకరించాడు. 'ప్రపంచవిద్యార్థు లందరితోస్నేహం పెంపొందించుకునే ఆశయం కొరకు మనం పాటుపడాలనే విషయం మనం మరచిపోగూడదు. ఒక బాలకుడు నీగ్రోగాని యూదుగాని, స్పెయిను దేశీయుడుగాని, టార్టారుగాని, అమెరికన్‌గాని, అరబ్బుగాని మనదేశంలో ఏమీభేదంలేదు. సాంఘిక విద్వేషాలను, వైమనస్యాలను మనదేశంలోలేకుండా తుడిచివేశామనే విషయాన్ని మనమెన్నడూ మరువరాదు. నేటిరాత్రి ఇచ్చట సమావేశమైన దళంలోనివారికి, వ్యక్తులకు, సమూహములకు పెద్దలకుపిన్నలకు మధ్యనుండే మైత్రినిగూర్చి చాలాపుష్టికరమైన భావాలున్నందుకు నాకు సంతోషంగా యున్నది. ఈ సద్భావాలను ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నించుదాము. ఈ చర్చను ముగించినృత్య, గీతాలతో యిక కాలక్షేపం చేదామా?

మేము చూచిన ఒకటి రెండు పిల్లల నాటకములనుగూర్చి ముచ్చటిస్తాను. పిల్లలందరకూ నాటకములంటే అమితమైన సరదావుంది. వారికి ఉత్తమ నటకులందరిపేర్లూ, కంఠతఃవచ్చును. ఆ నాటకాలలోని విప్లవ భావాలు, వారి లేతజీవితాలలో గొప్పమార్పును కలిగిస్తాయి.

మా తరగతి పిల్లలతోకలిసి నేను జారుకాలంలోని రష్యనుపిల్లల విద్యార్థిజీవితాన్ని చిత్రించే చక్కటి నాటకాన్ని చూశాను. పాత్రధారులందరూ చాలా చాకచక్యంతో అతి సహజంగా నటించారు. నేను ప్రేక్షకు

లను, నాటకాన్నికూడా అతి శ్రద్ధతో పరీక్షిస్తున్నాను. నా తరగతిలోని అమెరికను బాలిక నా ప్రక్కకూర్చున్నది. రష్యన్ భాషలోని సంభాషణలను ఆమె సంపూర్ణంగా అర్థం చేసుకోలేమగాన, ప్రక్కనున్న రష్యన్ బాలకుడు ఆమెకు హాస్యపూరిత ఘట్టాలను తర్జుమాచేసి చెబుతున్నాడు. ప్రేక్షకు లందరూ తన్మయులై చూస్తో, ఒక్కొక్క రంగం ముగిసి తెరవాలిన వెనుక చప్పట్లు చరుస్తూ తమ మెప్పుదలను తెలియజేస్తున్నారు. మా పిల్లలందరూ ఆ నాటకంలోని విషయాన్ని, పాత్రధారులను, వారి నటనా కౌశల్యాన్ని గూర్చి నాతో చర్చించారు.

ఖాళీ సమయాల్లో, బయటకువెళ్ళి ఫలహారములుగాని, పానీయము లనుగాని సేవిస్తో, బాలబాలికలు అతి హుషారుగా చర్చించుకుంటున్నారు. కొందరు ఆ కాలపు పాఠశాలలను ప్రస్తుతపు సోవియట్ విద్యాలయంతో పోలుస్తున్నారు. ఈ నాటకాన్ని తాము చూచిన యితర నాటకాలతో మరి కొందరు పోల్చి, విమర్శిస్తున్నారు. మొత్తంమీద సోవియెట్ బాలబాలిక లకు నాట్యకళయందు యెంత అనురాగమూ, అభిరుచీ వున్నదో ఆ నాట కమునుచూచిన తర్వాత నాకు ద్యోతకమైనది.

అలెక్సీ టాలస్టాయి రచించిన 'బంగారు తాళంచెవి' అనే నాటకాన్ని రెండు మూడు తరగతుల పిల్లలతో మరొకపర్యాయం వెళ్ళిచూచాను. ఆ నాటకచావిడి అతి విశాలమైనది. ప్రేక్షకులతో కిటకిట లాడుతోంది. ఏడు, పదమూడు సంవత్సరాల మధ్య ప్రాయపు పిల్లలు, కొద్దిమంది ఉపాధ్యాయులు, తలిదండ్రులు ప్రేక్షకులుగా వచ్చారు. కట్టు కథలలోని వీరుల పరమాద్భుత సాహసకృత్యాలను చూపే ఘట్టాలతో ఆ నాటకం నిండివుంది. కథానాయకుని దంభ వచనాలు, అపూర్వ, అసామాన్య కృత్యాలు ప్రేక్షకుల హర్షాన్ని పొందాయి. పిల్లలందరూ కథాగమనంలో తన్మయులై పోయారు.

కథలోని దుర్మార్గుడు కథానాయకుని ఒక స్తంభానికి కట్టి ఒక గోనెసంచెడు బంగారాన్ని తీసికొని బంగారపుతాళంచెవి యీయవలసినదిగా హింసించునపుడు, ప్రేక్షకులు ఒడలు మరచి 'ఇవ్వద్దు!' 'ఇవ్వద్దు' అంటూ అరచి, ఆ వీరుడు తిరస్కరించినపుడు యెంతో సంతృప్తిని పొందారు. ఆ దుర్మార్గుడు మరొక పర్యాయం బంగారపు చెవిని ఉపయో గించే విధానాన్ని తెలుపుతాననీ, కథా నాయకుని చెట్టువద్దకు రమ్మని

ప్రోత్సహించి నప్పుడు, 'వెళ్ళవద్దు! వాణ్ణి నమ్మవద్దు!' అంటూ ఆవేశంతో అరిచారు. ఆ నాటకం వారికి ప్రారంభంనుంచి అంతంవరకు అత్యమితానందాన్ని కలిగించింది.

నాటకశాలఅంతా చక్కగా అలంకరింపబడివుంది. ప్రేక్షక స్థానంలో చిన్నపిల్లలు సుఖంగా కూర్చునేందుకు వీలుగా వుండే ఆసనాలు పరచి వున్నాయి. గోడలమీద చక్కటి బొమ్మలు చెక్కి వున్నాయి. సోవియెట్ దేశంలోని వివిధ ప్రాంతాలనుండి బాలకులు చిత్రించి పంపిన చిత్రపటములు వ్రేలాడ తీయబడి వున్నాయి. రంగస్థలమునకొక ప్రక్క పియానో వుంటుంది. నాటకం ఆరంభమయ్యేలోపుగా పాటలు పాడుకొంటో, ఆటలు ఆడి ప్రేక్షకులు వినోదించవచ్చును. అవతల యేర్పరచబడిన ఫలహార, పానీయశాలలకు నాటకములాడే రాత్రులందు గొప్పగిరాకీ వుంటుంది.

నాటకంచూచిన మరునటి ఉదయం నాట్యస్థలానికి వెళ్ళి రంగస్థలాలంకరణము, దీపాల యేర్పాట్లు, రంగులద్దడం వగైరా తెర వెనుకటి విషయ వివరాలను తెలుసుకునేందుకు 'ప్రేక్షక జనసంఘ' కార్యదర్శిని కలుసుకుని నన్ను పరిచయ పరుచుకొన్నాను. ఇంతలోనే టెలిఫోనుగంట మ్రోగింది. కార్యదర్శితో మాస్కోలోని ఒక విద్యాలయ మార్గదర్శి సంఘనాయకుడు జరిపిన సంభాషణను విన్నాను.

'నమస్కారం, కామ్రేడ్ ఆనీ బొను తీరుబడి ఐన వెంటనే నన్ను పిలువమనిచెప్పి వెళ్ళాను. రాత్రినాటకం అయ్యేటప్పటికి చాలా ఆలస్యమైంది కనుక, పిల్లల అభిప్రాయాన్ని కనుక్కునేందుకు నాకు, సావకాశం చిక్కలేదు. నాటకంలో యే యే భాగాలు బాగున్నవి, ఏ భాగాలు విసుగు పుట్టిస్తున్నవి, ఎందుచేత? మున్నగు విషయాలపై వారి సహేతుక విమర్శలను ఆహ్వానిస్తున్నాను. మీరుపిల్లలమధ్య కూర్చొని, వారి హావభావాలను కనిపెడుతున్నారు. అందువలన మీ అభిప్రాయంకూడా అమూల్యంగా భావిస్తున్నాను. పిల్లలనందరినీ విడి విడిగా వారి అభిప్రాయాలను కాగితాలమీద వ్రాయమని, నాకుపంపండి. సమూహంగాకూడి వ్రాసినప్పుడుగుర్తుకు రాకపోవడం మూలాన్ని చేర్చబడని, అనేక భావాలు వ్యక్తిగతంగా వ్రాసేటప్పుడు వ్రాయబడతాయి. రెండురోజుల్లో మీరు వాటిని తీసుకురండి. మేము మరల కొద్దిరోజుల్లోనే నాటకం వేయబోతున్నాము. ఆ ప్రదర్శనం ముందుగానే యీ అభిప్రాయ పత్రాలువస్తే, సంస్కరించేందుకు వీలు కలుగుతుంది' అని టెలిఫోను ఆపి నావైపు తిరిగింది,

'మీ టెలిఫోను సంభాషణ, నాకు కావలసిన భోగట్టా కొంత యిచ్చింది. మా విద్యార్థులు మీ ప్రదర్శనాలను అమితంగా హర్షిస్తారు. మీరు చాలా పెద్ద ప్రదర్శనశాలను కలిగివున్నారు. మీ నాటక సమాజాన్ని యెట్లా నడుపుతారు? కార్యనిర్వహణకు సంబంధించిన వివరాలను తెలుసుకోవాలని అభిలషిస్తున్నాను.' అని నేను వచ్చినపనిని తెల్పాను.

'మా నాటక సమాజం బాలురకొరకై ప్రదర్శనములు చేస్తుంది. వారికి వినోద, ఉల్లాసములు కలిగించడమే కాక, ఆలోచించేందుకు, విమర్శించేందుకుకూడా విషయాలను పొందుపరచడం, మా ఆశయం. అందరూ లేత వయస్కులేఐనా, మా నటకు లందరూ కౌమారావస్థను దాటినవారే. అందువలన పిల్లల పాత్రలను ధరించేందుకు, వారితో సంపర్కం అధికంగా కావాలి. అందుకొరకై మేము పిల్లలను వివిధ ప్రాంతములనుండి పిలిపించి, రిహార్సలువేసి అందుపై వారి అభిప్రాయములను తీసుకుంటాము. సహేతుక విమర్శల నాధారంగా జేసుకొని, అభినయంలోను, నాట్యరచనలోను, సంభాషణల తీరులోను పాత్రధారణ విధానంలోను మార్పులు చేసుకుంటాము.' అని ఆమె చెప్పింది.

" ప్రజారంజకమైన 'సెరియా' నాటకాన్ని ప్రదర్శించడం యెందుకు మానివేశారు?" అని నేను అడిగాను.

"దాని విధిని అది నిర్వహించలేక పోతోంది, కనుక మానివేశాం. మా విద్యావిధానం యొక్క ఒక నిర్దిష్ట అభివృద్ధిదశలో, ఒక నిర్దిష్ట సమస్యాపరిష్కారానికై ఆ నాటకాన్ని ప్రదర్శించేవారం. పాఠశాల విధానంలోని లోపాల నెత్తిచూపి, విమర్శించడం మూలకంగా ఏడవ తరగతి నుండి పైతరగతుల విద్యార్థులు ఆ నాటకాన్ని చూచి, ఉల్లాసాన్ని పొందుతో సంస్కరింప బడేవారు. ఈ నాటకం పై తరగతి పిల్లలకొరకు ఉద్దేశింపబడినప్పటికీ, క్రింది తరగతి పిల్లలుకూడావచ్చి, ఆ ప్రయోజనాన్ని గ్రహించలేకపోయేవారు. మారిన నేటిపరిస్థితులు తెచ్చిన క్రొత్తసమస్యల నుదహరిస్తో వ్రాయబడిన ఆధునిక నాటకాలను మాత్రమే నేడు వేస్తున్నాము."

ఈ సంభాషణానంతరం, నేను వారి ప్రదర్శనముల కనేక పర్యాయములు హాజరయ్యాను. ఆ పాత్రధారు లందరకూ, అభినయకళ, మానసిక తత్వశాస్త్రం, ఆధునిక విద్యావిధాన లక్ష్యములు పూర్తిగా తెలుసును కనుక, వారి ప్రదర్శనములు మాస్కో విద్యార్థి జీవన నౌకలకు, చుక్కానులయ్యేవి.

# మకాం

ప్రతి విద్యాలయానికీ వేసవిమకాము లుంటాయి. అందుకు సన్నాహాలు అనేక నెలల ముందునుండే చేయబడతాయి. వేడిపట్టణ ప్రదేశాల నుండి, చల్లటి ప్రాంతాలకుపోయే సావకాశం లేనివారివి. ఆరోగ్యరీత్యా విశ్రాంతి అవుసరమైన విద్యార్థులను యేరి తీసుకొని వెడతారు.

ఈ మకాములకయ్యే ఖర్చులలో అధికభాగం విద్యా సంస్థవారు భరిస్తారు. తలిదండ్రులు కొలది భాగాన్ని మాత్రమే వారి జీతాల ననుసరించి పెట్టుకుంటారు.

ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన వసతి గృహాలలో పిల్లలమకాములుంటాయి. మకాముగృహాలచుట్టూ ఆవరణలలో చక్కటి పుష్పవాటిక లుంటాయి. ఆరోగ్యసూత్రాల ననుసరించి ధారాళంగా వెల్తురు, గాలి వచ్చేందుకు అనువుగా నుండే కిటికీలు, దూరంగా వంటశాల, ఉంటాయి. సోవియెట్ విద్యావేత్తలు, వైద్యులు బహిరంగ ప్రదేశాలలో గుడారాల మకాములకంటె, పిల్లల విశ్రాంతి, ఆరోగ్యాలకిట్టి యేర్పాట్లనే హర్షిస్తారు.

కలూగా పట్టణంపద్ద, ఓకానది గట్టుకు, అరమైలు దూరంలో మా మకాము గృహం వున్నది. ఆరు కర్రయిండ్లలో రెండుమాత్రం మేడయిండ్లు. విశాలమైన భోజనశాలవుంది. దాని వెనుక పఠనమందిరం, దాని ప్రక్క ఆటల మందిరం వున్నాయి.

మా వేసగి శెలవులలో ఒక మాసం విద్యార్థులతో మకాంలో వుండేందుకు నేనంగీకరించాను. ఆపనికికూడా నాకు అదనంగా జీతం యిచ్చారు. పెద్ద విద్యాలయాల్లోని ఉపాధ్యాయులకు ఏబది సంవత్సరాల కొక పర్యాయం యీ అవకాశం లభిస్తుంది.

మా మకాముకు ప్రారంభోత్సవ దినంనాడు నేను మరి ఇరువది మంది తలిదండ్రులతో కలిసి ఉదయం ఆరుగంటలకు, కలూగాపట్టణంజేరి, మా మకాముకు వెళ్ళాము. మకాం నాయకుడు యెదురువచ్చి, మమ్మల్ని ఆహ్వానించి, టీ ఫలహారం యిచ్చాడు.

నేను వచ్చేవరకూ విద్యార్థులతో వున్న కామ్రేడ్ హాలెండు నన్ను హృదయ పూర్వకంగా ఆహ్వానించింది. ఆమె స్థానంలో నేను పని చేసేం

దుకు వచ్చాను కనుక, ఆమె నేడు వెళ్ళిపోతుంది. ఆమె, నేను కలిసి మా మకాము ఆవరణలో కొలది నిముసాలు పచార్లు చేశాము.

"మీరు సలహాదారుగా పని చేయవలసి వుంటుంది. మీరు బదివం తులుగిరీ చెలాయించాలి. మార్గదర్శక సంస్థవారు యీ మకామును నడి పిస్తున్నారు. వారు దినచర్య పట్టికను చక్కగా అమలు జరుపుతారు. వైద్యుడు, నర్సు, దాదులు పిల్లల ఆరోగ్యమందు బాగా శ్రద్ధవహిస్తారు." అని ఆమె చెప్పింది.

"ఐతే యిక నేను చేయవలసిందేముంది?" అంటూ నిరాశా భావంతో అడిగాను.

"నాటక సమాజాన్ని నడుపవచ్చును. పిల్లలను విజ్ఞాన యాత్ర లకు తీసికొని వెళ్ళవచ్చును. పిల్లల తగాదాలు తీర్చాలి. సలహాలు యివ్వాలి. వారి కష్టసుఖాలను విచారించి తోడుపడాలి. ఏమి పనిలేదు అను కోనక్కరలేదు. చాలా సరదాగా, కాలం గడుస్తుంది."

ఒక గృహంలోనుంచి ఐదవ తరగతి కుర్రాడు, విక్టార్ పరుగెత్తి వచ్చి, యీల వూదాడు. కొద్ది నిముసాల లోపుగా పిల్లలందరూ బయటికి వచ్చి, యెత్తు తగ్గుల వారీగా వరుసలో నిలబడ్డారు. వ్యాయామ ఉపాధ్యా యుడు చెప్పిన రీతిగా పది నిముసాలు వ్యాయామం చేసిన తర్వాత, స్నాన, పానాలకు వెళ్ళిపోయారు.

పిల్లలందరూ నన్ను చుట్టముట్టారు. ఎల్లా ఒక రెక్క, జిమ్మీ మరొక రెక్క పట్టుకున్నారు. 'మాగదిలోకి రండి. నేల పరిశుభ్రంచేసి పరుపులు యెత్తివేసి, అలంకరించి వుంచాము. జిమ్మీ తండ్రి, మాబాబును కూడా వెంటబెట్టుకొని కారు మీద వస్తారుట.' అంది ఎల్లా.

'మీరు మాతో వుంటారని కామ్రేడ్ హాలెండు చెప్పారు. బలే, బాగుంటుంది. మనం అందరమూ నదిలో యీదుకోవచ్చును....' అంటూ మరొక పిల్ల అంది. అందరూ మాట్లాడుతో నన్ను మకాంలోకి తీసికొని వెళ్ళారు.

ఎల్లా నిద్రించే యింటిలోనికి వెళ్లాం. 'మా యిల్లు చాలా అనుకూ లంగా వుంటుంది. పెద్ద పిల్లలతో కలిసి, కామ్రేడ్ హాలెండు మేడగది లో నిద్రిస్తుండేవారు.' అని చెప్పి, ఎల్లా వారి వ్యాయామ ప్రదేశానికి తీసికొని వెళ్ళింది. అచ్చట ఊగుడు కుయ్యాల బల్లలు, కర్రలు, ఎక్కుటకు త్రాళ్ళు, చేతిబంతి మొదలైన ఆటలకు పరికరాలు వున్నాయి. త్వరగా

దుస్తులు ధరించిన పిల్లలు వారి కిష్టమున్న ఆటలు ఆడుతో, అందులో యుక్తిపసులను అలవాటు చేసుకుంటున్నారు. అందరూ జీవిత మధువును తృప్తిదీర త్రాగుతో ఆనందోన్మత్తులైన ట్లవిపించింది.

చెట్ల గుబురు మధ్యనుండి యీలగ్రైయ్ మంది. మరల అందరూ భోజనశాల వద్దనున్న స్థలమునకు వేగంగావెళ్ళి వరసలు తీరి నిలుచున్నారు. పిల్లలు పొట్టిలాగులు, బనీనులు తొడుగుకున్నారు. మెడల చుట్టూ ఒక యెర్రగుడ్డను ధరించారు. స్థల కేంద్రంలో ఒక యెత్తైన వేదిక, దానిమధ్య నొక జండా కర్ర ఉన్నాయి.

సోన్యా ఆ వేదికమీద నిలబడింది. బూడిద వర్ణపు కాళు, మోకాళ్ళపైకి ధరించిన పొట్టిలాగు, బనీనుల తెల్లటి వర్ణము, నొక్కులు, నొక్కుల జుట్టు, బంగారపురంగు, ఆమె కొక వింతశోభ నిస్తున్నాయి. " జట్టు నాయకులు నివేదికలను సిద్ధ పరచండి. " అని ఆమె ఆజ్ఞనిచ్చింది. వారి జట్లులకు ఒక అరగజం ముందువిలబడిన నాయకులు, జట్టులోని సభ్యులను లెక్కపెట్టి వచ్చి యధాస్థానంలో నిల బడ్డారు. ' దళనాయకులూ, నివేదికలను తీసికొండి! ' అని ఆమె తరువాతి ఆజ్ఞ. జట్టునాయకులు దళనాయకుల వద్దకు వచ్చి, సలాంచేసి, నివేదికల విచ్చారు. ' దళనాయకులూ, మీ నివేదకలనివ్వండి! ' అని మరల ఆజ్ఞ.

ప్రధమదళనాయకుడు ఆమెవద్దకువచ్చి 'కామ్రేడ్ మార్గదర్శి నాయికా మా ప్రధమదళంలో ముప్పది ఐదుగురు మార్గదర్శకులున్నారు. అందరూ హాజరయ్యారు. ఒక్కడు మాత్రం మెడగుడ్డగట్టుకోలేదు. మరచి పోయానని చెబుతున్నాడు. ' అను నివేదిక నిచ్చాడు. ఈ విధంగానే మిగిలిన దళనాయకులుకూడా నివేదించిన తర్వాత మొదటిదళంలోని రెండవ జట్టుకు పగటిపూటకు మకాంరక్షణ పని విచ్చి, బాండు వాయిద్యంతో భోజనశాలవైపు సైనిక నడకతో వెళ్ళారు.

భోజనం చాలా సంతృప్తికరంగా వున్నది. పనిమీద వున్న జట్టు వారు బల్లలను శుభ్రపరచారు. మిగిలిన పిల్లలు సమీపానఉన్న చెట్లతోపులలోకి తలిదండ్రులతో వెళ్ళి తిరోహిత మయ్యారు.

మా మకాంనుండి నది ఒడ్డు వరకు వివిధ రంగుల గడ్డిపూలతో శోభిల్లుతోన్న పచ్చిక బయలు వుంది. నదిలోస్నానం చేసేందుకు అనుకూలమయిన గట్టుఅది. చిన్నతరంగాలు యీతకు ఆహ్వానిస్తుంటాయి. చల్లని నీడలను విరజిమ్ముతోందే అడవి మా మకాంవెనుక నున్నది. ఆ

అడవిలో వెలగ, మర్రి మున్నగు అనేక రకాలయిన పండ్లు ఉన్నాయని మా శిష్యులు చెబితే, వారిని అడవికి పండ్లు కోసుకునేందుకు తీసుకొని వెడతానని వాగ్దానం చేశాను.

సాయంసమయంలో మైదానంలో ఆటపాటలలో పిల్లలు కాలం గడిపారు. పరుగెత్తుట, ఎత్తు, దూరందూకుట, యీదుట మున్నగు అనేక రకాలయిన వ్యాయామ విధానాలలో నిమగ్నులయ్యారు.

రాత్రి ఏడుగంటలకు భోజనంచేసిన తర్వాత నెగడిచుట్టూ పిల్లలు జేరారు. మకాం నాయకుడు పిల్లల చూడవచ్చిన తల్లిదండ్రులను ఆహ్వానించాడు. పిల్లలను ఆరోగ్యవంతులయి బలిష్ఠులు కండని. శెలవులను మనసార ఆనందంగా అనుభవించవలసిందనీ హెచ్చరించాడు. మకాంలో పాటించవలసిన కొద్దినియమాలను విధులను సరిగా నెరవేర్చ వలసిందని కోరాడు.

ఆతని ఉపన్యాసానంతరం. మార్గదర్శి నాయకురాలు సోన్యా, వాయిద్యాలమధ్య మకాంజండా ప్రతిష్ఠాపన జరిపింది. సుత్తీకొడవలి హత్తిన యెర్రజండా గాలిలో రెపరెపలాడుతూండగా. తీయటి కంఠాలువిప్పి బాలబాలికలు అంతర్జాతీయ గేయాన్ని పాడి జయజయ ధ్వానాలతో ముగించారు.

అనంతరం పిల్లలందరూ నెగడిచుట్టూ కూర్చున్నారు. వచ్చిన తలిదండ్రులలో అంతర్యుద్ధంలో పాల్గొన్న ఒకయెర్రసైనికుడు. పిల్లల ప్రార్థనను మన్నించి, తానుపాల్గొన్న అనేక యుద్ధాలను, రోమాంచలమైన అనేక సాహస ఘట్టాలను మనోరంజితంగా వర్ణించి చెప్పాడు పిల్లలందరూ వడలు గగుర్పాటు చెంద, తన్మయులై విన్నారు.

ఆయన చెపుతోండగా చీకటులు దట్టమయాయి. ఆకసపు నీలవర్ణము ముదిరింది. మా వెనుకనున్ననది కరుడుకట్టిన నల్లటి అంచువలె వుంది. ఒక కుర్రవాడు ఆ కట్టెలకు నిప్పు రగిల్చాడు. మంట నాలుకలు జాచి, అగ్ని కణాలను కక్కుతోంది. ఆ కథ ముగిసింది. ఒక్కక్షణం కమ్మిన నిశ్శబ్దాన్ని ఛేల్చుకొని మధుర కంఠంతో సోన్యా హాయిగొల్పే గేయాన్నిపాడింది. త్వరలో యితరులుకూడా తమ కంఠాలను కల్పారు. ఒకటివెనుక మరొకటిగా అనేక గీతాలను పాడారు. సమీపంలోనున్న పల్లెలోని పిల్లలు, మా పాటల సవ్వడికి ఆకర్షింపబడి, తండాలు, తండాలుగావచ్చి మా చుట్టూ జేరారు.

ఒక పెద్ద కుఱ్ఱవాడు లేచినిలబడి, 'యీ రాత్రి కార్యక్రమాన్ని అమలు జరుపుదాం. మొట్టమొదటి స్టెల్లా నృత్యం' అన్నాడు. జంత్ర గాత్రం ప్రారంభమైంది. ఒక పల్లెటూరి రైతుయువతి దుస్తులను ధరించిన స్టెల్లా జాతీయనృత్యాన్ని అత్యద్భుతంగాచేసి, అందరి మన్ననలను పొందింది.

'నేను జర్మనుభాష మాట్లాడను' అనే ఏకాంకికను మూడవదళం లోని మూడవజట్టువారు ప్రదర్శించారు. ఈ నాటకం హాస్యపూరితంగా వుంది. పరాయి భాషలను నేర్చుకోమనే వారిని విమర్శించే వినోద నాటిక. దీని తర్వాత గేయాలు, నృత్యములు, హాస్య సంభాషణలు, మున్నగు వాటితో గడిచింది.

చూడవచ్చినవారు బస్సుయెక్కి యిండ్లకు వెళ్ళారు. పిల్లలందరూ ఉన్ని దుప్పట్లను తీసికొని ప్రక్కలమీదకు చేరారు. మొదటి దినాన్ని చాలా ఆనందంగా గడిపా ననేతృప్తితో మేనువాల్చి హాయిగా నిద్రించాను.

మరుసటి ఉదయాన్నే లేచి, తువ్వాళ్ళు తీసకొని, స్నానపు దుస్తులతో, మంచు బిందువులతో తళతళలాడె పచ్చికమీద పరుగెత్తి నదిలో దూకి, యీది, మకాముకు తిరిగివచ్చాం.

## కాలక్రమ పట్టిక

ఉదయం:

| | | | |
|---|---|---|---|
| 7–0 | లేచుట, వ్యాయామం | 8–0 | భోజనం |
| 7–15 | కాలకృత్యములు | 8½-11 | విరామం |
| 7–45 | మైదానంలో సమావేశం | 11–12 | ఈత, స్నానం |

మధ్యాహ్నం:

| | | | |
|---|---|---|---|
| 1–0 | భోజనం | 7–0 | రాత్రి భోజనం |
| 1–30–3 | విశ్రాంతి | 8–30 | చిన్నపిల్లల నిద్రాసమయం |
| 4–0 | టీ | 9–15 | సమావేశం |
| 4-30-6-45 | విరామం | 9–30 | నిద్ర |

ఈ కాలక్రమ పట్టిక ననుసరించి ఉదయకృత్యాలన్నీ జరిగిపోతున్నాయి. స్వేచ్ఛాసమయాన్ని పిల్లలెట్లు గడుపుతున్నారో చూచేందుకు ఆ మకాములోని భవనాలన్నీ తిరుగుతున్నాను. ఒక పెద్ద బల్లచుట్టూ

పెద్దపిల్లలజేరి, విమానపు నమూనాలు చేస్తున్నారు. పూల మొక్కలకు బోదెలు చేస్తున్నారు, కొందరు పిల్లలుజేరి. ఇద్దరు కుర్రవాండ్రు గాలి గుమ్మటంచేసి, గాలిలోకి పంపేందుకు అడుగున మంటచేసి, గాలిని తేలిక పరుస్తున్నారు. కొందరు పూలవిత్తనాలు త్రవ్వినమళ్ళలో నాటుతున్నారు.

జిమ్మీ యిద్దరు చిన్నబిడ్డలను చేరదీసి, చేపలనుపట్టే గేలములు కట్టి పెడుతున్నాడు. 'నాకు చేపలుపట్టడం, మహాసరదా. రోజంతా పట్ట మన్నా, పడతాను,' అన్నాడు జిమ్మీ. ఈ మాటవలన ఆ కుర్రవాని మన స్తత్వం నాకు బోధపడింది. పాఠశాలలో తరగతిలో వరుసగా రెండు గంటలు జిమ్మీ యెందుచేత కూర్చోలేడో నాకిప్పుడు అర్థమైంది।"

కొందరు చెట్లనీడను చేరి చదువుకుంటున్నారు. మరి కొందరు వ్రాస్తోనో, బొమ్మలను గీస్తోనో, కబుర్లు చెప్పుతుంటోనో కాలం గడుపు తున్నారు.

పదకొండు గంటలకు అందరూ స్నానపు దుస్తుల ధరించి, మకాం వైద్యునివెంట నడికివెళ్ళారు. బాలురొక రేవులోను, బాలికలు దగ్గిర రేవు లోను దిగారు. వైద్యురాలు యీత యీదడం నేర్పుతోంది. చిన్న పిల్లలు లోతుకు వెళ్ళకుండా పెద్ద పిల్లలు ఒకరి చేతుల నొకరు పట్టుకుని గుండ్రంగా నిలబడ్డారు. తప తప కొట్టుకుంటో ఆనందంగా కేరింతాలు కొడుతోంటే నాకెంతో ఉల్లాసం కలిగింది.

రుచికరమైన వంటకాలతో భోజనంచేసిన పిమ్మట అందరూ పక్క లమీద పడుకొని, నిద్రించారు. మూడు గంటలకు టీ తీసుకొని పళ్లు కోసు కునేందుకు, అడవికి వెళ్ళాం. ఆ చెట్ల గుబురులలో దూరి పండ్ల పొదల నుండి పండ్లనుకోసి కప్పులను నింపి, ఆహ్లాదంతో తృప్తిదీర పండ్లను తినే ఆ పిల్లల ఆనందాన్ని చూచి తీరాలి.

ప్రతిదినం యీ రీతిగానే, మకాంలో జీవితం గడుస్తోంది. మా పిల్లలలో ఒక రిద్దరికి దగ్గు, పడిశమూ తప్పితే, యేమీ జ్వరాలుగాని, జబ్బులుగాని రాలేదు. వైద్యులు పిల్లల ఆరోగ్య రక్షణయందు ప్రాలుమా లిక చూపకుండా, అమితశ్రద్ధ వహిస్తారు. బలహీనులను యెక్కువదూరం పోనీయరు. భోజనం రుచికరమైనది, పుష్టికరమైనది। పిల్లల ఆకలి అదు గుదలకూడా హెచ్చుగా వున్నది. ఒక రిద్దరు ప్రసాదరాయుళ్ళని పేరు కూడా సంపాదించారు.

మాస్కో జిల్లాలోని యితర మకాములతో యెర్రబావుటా కొరకు మా మకాము పోటీ చేస్తోంది. మకాములో తయారైన నమూనాలు, కాగితపు పువ్వులు, బొమ్మలు, నది ఒడ్డున యేరితెచ్చిన రంగు రంగుల గవ్వలు, శంఖాలు మున్నగు వస్తువులను ప్రదర్శించేందుకు ప్రోగుచేసి వుంచారు.

అకస్మాత్తుగా పర్యవేక్షకులు వచ్చి మా మకామును తణిఖీ చేశారు. ఫలితం తెలుసుకునేందుకు, పిల్లలు, నాయకులు, మార్గదర్శకులూ చాలా ఆత్రతతో వేచివున్నారు. ' మీ మకామును మంచి పద్ధతులమీద, తృప్తికరంగా నడుపుతున్నారు. మీకు యెర్రబావుటా రావచ్చును. కాని మాస్కో జిల్లాలో యింకా అనేక మంచి మకాము లున్నాయి. ఐనప్పటికీ యింతవరకూ, మేము తణిఖీచేసిన మకాము లన్నిటిలోనూ. మీ మకాంలోనే ఆరోగ్యం చాలా బాగుంది. అందువలననే మీకు బహుమతీ రావచ్చును ' అని అధ్యక్షుడు చెప్పాడు.

ఈ ఉపన్యాసం ముగిసిన వెంటనే, ఒక ఉత్సాహవంతురాలైన బాలికలేచి, ' కామ్రేడ్స్, మనం తప్పక ఎర్రజండాను గెలుస్తాం. మనలోని అందరమూ యీ బహుమతి సంపాదించాలనే నిశ్చయంతో పనిచేస్తే, యే లోటూ రాకుండా, ఆదర్శప్రాయంగా నడుచుకో గలుగుతాం. మనం తప్పక విజయుల మవ్వాలి! ఎందుకు నెగ్గకూడదు ? ' అంది. ' ఔను. నెగ్గితీరాలి, ' అంటూ అందరూ దృఢస్వరాలతో ఉత్సాహంగా అన్నారు.

అవిధంగానే వారునెగ్గారు. మాస్కోలో జగిన మార్గదర్శక మహాసభలో మా మకామునకు యెర్రజండా బహూకరణ జరిగింది.

సోవియెట్ సమ్మేళనంలోని పిల్లలు సాముదాయిక జీవితానికి బాగుగా అలవాటు పడినారు కనుక, సాధారణంగా క్రమశిక్షణకు భంగంకలుగదు. కాని ఒకరిద్దరు నియమాలకు కట్టుబడలేక- ఉల్లంఘించకపోరు.

పాతకాలక్రమశిక్షణకు యించుమించుగా జిమ్మీఅలవాటు పడినప్పటికి, మకాంవద్ద ఆతనికి అత్యంతఉత్సాహ దాయినియగు చేపలవేట, ఘరల ఆతనిచే క్రమశిక్షణను భంగపరిపిస్తోంది. విశ్రాంతి తీసుకోవలసిన కాలంలో చేపలను పట్టడం మొదలు పెట్టాడు. గంటలకొలది మకాం నుండి మాయమయ్యేవాడు. పిల్లలందరూ సమావేశమై ఆతని శిక్షణా వైరుధ్య ప్రవర్తనవలన తమ మకాం మొత్తమునకు అపకీర్తి గలుగు

తోంది కాన మరొక పర్యాయం నియమోల్లంఘన మొనర్చినచో, మార్గ దర్శి చిహ్నమైన యెర్రగుడ్డను తీసివేస్తామని హెచ్చరించారు.

జిమ్మీ మనస్తత్వమును పరీక్షిస్తున్న నాకు, ఆతనికి పిల్లలయందు కల ప్రేమను ఊతగాగొని, మార్చేందుకు ప్రయత్నించవలయుననే సంక ల్పంకలిగింది.

ఉదయభోజనానంతరం పిల్లలను తీసికొని పళ్లుకోసుకునేందుకు మాతో అడవికి రమ్మని జిమ్మీని పిలిచాను. 'ఓ! తప్పకుండా వస్తాను. పళ్ళు యెక్కడ, యెక్కువగా దొరుకుతాయో, నాకు తెలుసును. అన్నాడు జిమ్మీ. ఆతని ఉత్సాహానికి పట్టపగ్గాలు లేకుండా వున్నాయి. చెట్లలో దూరి మాయమై కొద్ది క్షణాలలోనే, పండ్ల నిండినకప్పుతో ప్రత్యక్ష మయ్యే వాడు. ఆ పళ్ళన్నీ పిల్లలకు పెట్టి తినిపించేవాడు. బాగాపండిన పళ్ళను నాకిచ్చి తినమని, నిర్బంధించేవాడు. అన్నకు తమ్ములయందుండే వాత్సల్య భావాన్ని అమితంగా అందరిపిల్లలయందు చూపుతూవచ్చాడు.

'మళ్ళీపర్యాయం మేము వచ్చేటప్పుడు, నువ్వుకూడా రావాలి, జిమ్మీ' అన్నాను, నేను.

'అంతకంటె సంతోషాన్నిచ్చే పని యింకొకటి లేదు' అన్నాడు, జిమ్మీ.

'ఆ సమానమూ, క్రమశిక్షణకు వ్యతిరేకంగా, సంచరిస్తోంటే మార్గదర్శులనుండి, నిన్ను తీసివేస్తారేమో' అన్నాను.

'అబ్బే! అట్లా యెన్నడూ జరుగదు. విశ్రాంతి సమయాల్లోనే, చేపలు పట్టేందుకు వెడతాను' అన్నాడు. కాని ఆతని కండ్లలోని హాసం మనస్సులోని భావాన్ని దాచలేకపోయింది.

'అందరూ మార్గదర్శకులౌతున్నారని, నీవుకూడా జేరావా? లేక నిజంగా ఆదర్శప్రాయుడవనిపించుకోవలయుననే ఆశయంతో జేరావా?' అని అడిగాను.

"వాస్తవంగా, నాకు మార్గదర్శిగా ఉండాలనే కోరిక వుంది. కాని, చేపలవేట అంటే అత్యమితమైన యిష్టంనాకు. వేసంగి శెలవులకు మకాము కురాను. మాస్కోకు చాలాదూరంలో మా తండ్రితల్లిగారి పల్లెటూరు వుంది. తృప్తి తీరునట్లు, రాత్రిబగళ్ళు చేపలు పట్టుకోవచ్చును" అన్నాడు.

అణపరాని ఆ కోరికకు లొంగిపోయి, మరుసటిదినమున మకాం నిధులను నెరవేర్చవలసిన మరొక కుర్రవానిని ప్రోత్సహించి, చేపలు

పట్టుటకు తీసికొని వెళ్ళినందున, అతని మార్గదర్శి చిహ్నాన్ని తీసివేశారు. అతనికి కండ్లవెంబడి బొటబొట నీరుకారింది. మరల పాఠశాలలో సరిగా విధులను నిర్వర్తించి, యెక్కువ మార్కులు తెచ్చుకున్నప్పుడు మాత్రమే అతనికి ఆ చిహ్నమీయ బడింది.

ఎలిజబెత్తు పద్నాలుగేండ్ల కన్నెపడుచు. స్నేహితులు వస్తున్నారు కనుక ఆమెకూడా వచ్చింది. మధ్యాహ్న సమయాల్లోను రాత్రి పది గంటలకు నిద్రించడం ఆమెకు నచ్చలేదు. ఇంటివద్ద నియమ రహితంగా స్వేచ్ఛగా పెరిగిన ఆమెకు యీ కట్టుబాట్లు అర్థరహితంగా కనపడ్డాయి. పైగా ఆమెకు చిత్రలేఖనమంటే అమితమైన ప్రీతి. ప్రకృతి దృశ్యాలను గీస్తూ కాలం గడుపుతుంది. ఆమె జట్టుకు విధులను నిర్వర్తించడంలో యెన్నడూ తోడుపడదు. అందువలన ఆమె వారి అసంతృప్తికి కారణభూతురాలైంది.

మకాం సాధారణ సమావేశంలో ఆమె ప్రవర్తననుగూర్చి చర్చించి మకాం సాముదాయిక జీవితవిధులను పాటింపని, ఆమెను మార్గదర్శి సంస్థనుండి తొలగించవలెనని అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఎలిజబెత్తుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. 'మీ అభిప్రాయం సబబైనదికాదు. మార్గదర్శి సంస్థఅంటే మీ కెంత అభిమానమున్నదో నాకూ అంతే గౌరవముంది. మీ కంటె నే నేమి తక్కువ పని చేస్తున్నాను?' అని ప్రశ్నించింది.

ఆమెకు జట్టు నాయకురాలైన హెలెన్ ఈ క్రిందిరీతిని సమాధానం యిచ్చింది. 'మన జట్టుకు పని బడినప్పుడు, నీ వంతుపనిని నీ వెందుకు చెయ్యవ్? మనం యే మంత బరువుపని చెయ్యాలి? వంటచెయ్యాలా? బట్టలు వుతకాలా? నేలను పరిశుభ్రంగా వుంచడం, గ్రంథాలయ పుస్తకాలను ఇచ్చి పుచ్చుకోవడం, మొదలైన తేలిక పనులేకదా? మన మకాం విధులను నువ్వెందుకు అపహాస్యం చేస్తావు? మకాం పనుల్లో యెందుచేత జేరి సహాయం చెయ్యవ్?'

'నువ్వు బాగాబొమ్మలు గీస్తావు, రంగులువేస్తావు మన గోడవార్తా పత్రికకు ఒక బొమ్మయైనా వెయ్యవెందుచేత? ఎన్నిసార్లు నిన్నుకోరినా ఒక్క బొమ్మ ఐనా గీశావుకావు!' అని సంపాదకురాలు అందుకుంది.

ఎలిజబెత్తు మాట్లాడలేదు. ఆమె చాలా కోపంగావుంది. మకాం నాయకుడు ఆ చర్చను ముగిస్తూ యీ విధంగా చెప్పాడు.

'ఎలిజబెత్తుకు సాముదాయిక జీవితంయెడల, మకాంయెడల వుండ వలసిన సరియైన దృష్టిలేదు. ఆమెకు చిత్రలేఖనం తెలుసునంటే, బొమ్మలతో గోడవార్తాపత్రికను అలంకరించి, ఆకర్షణీయంగా చెయ్యవచ్చును కదా అని, యెంతో ఆశపడ్డాము. సమాజంలో జీవించే వ్యక్తులు, ఆ సమాజానికి చేయవలసిన విధులు కొన్ని వున్నాయని అందరూ గుర్తుంచుకోవలెను. ఎంత గొప్ప చిత్రకారులైనా, లలిత కళోపాసకులైనా, సామాజిక విధులను విస్మరించరాదు. ఆమెకు మార్గదర్శిగా ఉండటమంటే ఏమిటో తెలియదు కనుకనైనా మనం ఆమె మెడలో ధరించిన చిహ్నాన్ని తీసివేయాలి అనుకుంటాను. భావిలో ఆమెగుర్తించి కోరినట్లయితే, ధరిశాస్తుమీద ఆమెను మరల జేర్చుకోవచ్చును.

సభికులందరూ ఆమెను తొలగించుటకు యేకగ్రీవంగా నిర్ణయించారు. ఎలిజబెత్తు కోపంతో మండిపోతోంది. కాని ఆమె అవమానంతో లోపల కుమిలిపోయింది.

ఎలిజబెత్తు ప్రవర్తనలో యెట్టిమార్పు కలుగుతుందో నేను జాగ్రత్తగా పరిశీలించ మొదలెట్టాను. అందరిచేత గౌరవింప బడాలి, పొగడ్త నందాలి అనే ఆమె ఆశయం, యీ విధంగా ఛిన్నా భిన్నం అవగానే, వెంటనే ఆమె తన స్నేహితుల ఆదరణ గౌరవాలను పొందాలనే దృఢ నిశ్చయంతో, మకాం విధులను జాగ్రత్తగా నెరవేరుస్తో, పత్రికకు భావ గర్భితమైన బొమ్మలు గీసి, నెగడి మకాములవద్ద చక్కటి నృత్యగీతాలతో ప్రేక్షకులను రంజింపజేసి, అందరి మెప్పను త్వరలోనే పొందింది.

ఆగస్టు నెల చివరభాగంలో మకాం ముగిసింది. ఒక ఆఖరి యాత, ఒక ఆఖరి వనవిహారం, ఒక ఆఖరి నెగడికాలక్షేపములతో ఆనంద ప్రదంగా రోజును గడిపి, బస్సులమీద హుషారుగా గొంతెత్తి పాటలు పాడుతో మాపాత మాస్కోపట్టణం జేరుకున్నాము.

---

## ౪౩

# గోడవార్తా పత్రికలు

ఆత్మ విమర్శనల వల్లను, వ్యాఖ్యానాల వల్లను, చదువును, క్రమ శిక్షణను, పని ప్రమాణమును అభివృద్ధి పరిచి, సంస్కరించుకునేందుకు గోడవార్తాపత్రికలను ప్రకటిస్తారు. విద్యార్థులనుండి యెన్నుకొనబడిన ఒక సంపాదకీయవర్గం యీ వ్రాతపత్రికను సకాలంలో ప్రకటిస్తూ వుంటుంది.

ఒక పెద్దకాగితంమీద, చేతితో చక్కగా వ్రాయబడిన వ్యాసాలను అంటిస్తారు. వార, మాస, దైనిక పత్రికలలోవి ముఖ్యమైన విషయములను, చక్కటి వ్యంగ్యచిత్రములను కత్తిరించి అంటిస్తారు. తమ వ్యాఖ్యానాలనుజేర్చి పదిమంది జేసుటకు అనువుగావుండే స్థలంలో అంటించబడిన ఆ పత్రికవద్ద చాలమంది గుంపుగా యేర్పడి చదువుకొని విమర్శించుకుంటో వుంటారు.

మా పాఠశాల గోడవార్తాపత్రికలు చాలాసరదాగావుంటాయి. తరగతి కొక్కొక్క పత్రికవుంది. మా పిల్లలలో చాలమంది వ్యాసకర్తలు, చిత్ర లేఖకులు, వ్యంగ్యచిత్రకారులు, సారస్వత ప్రియులూ ఉన్నారు. ఈతరగతి పత్రికలేకాక, విద్యాలయానికి సంబంధించిన 'విద్యాలయ' ప్రవదా పత్రిక వుంది. సోషలిస్టు పోటీఫలితాలు, తరగతులమార్కులు, వెనుకబడిన విద్యార్థులపై విమర్శలు, దేశీయ అంతర్దేశీయ వార్తలు యీ పత్రికలో ఉదహరింపబడతాయి. స్వయంరచనలు, పద్యాలు చిన్న కథలు వ్యంగ్య చిత్రాలు, బొమ్మలు ప్రకటింపబడతాయి.

'ఉపాధ్యాయవాణి' అనుమాసపత్రికను మా ఉపాధ్యాయులు ప్రకటిస్తారు. వివిధ వార్తా పత్రికలనుండి, కొన్ని వ్యాసభాగాలను ఉదహరిస్తాను.

### పహారా హుషార్

నాలుగవదశ పత్రిక (మూడునాలుగు తరగతులు)

1937 నవంబరు 5 వతేదీ

#### మా తరగతి

నాలుగవతరగతి ఈ అర్ధసంవత్సరంలో బాగా అభివృద్ధిపొందింది. క్రమశిక్షణను అమలు జరిపి, మంచిఫలితాలను చూపుతామని ప్రతిజ్ఞచేసి,

నిర్వహించాము. మా తరగతిలో ఒక్క బాబీయే తక్కువ మార్కులు తెచ్చుకున్నాడు. అతడు శ్రద్ధతో చదువుటలేదు. ఇంటికిచ్చినపని చెయ్యడు. మార్గదర్శి అవపలెనని కోంతే, మంచి అభివృద్ధిచూపాలి.

తక్కిన తరగతుల కంటె యెక్కువ మార్కులు తెచ్చుకుని మంచిఫలితాలు చూపాము కనుక, రేపుజరిగే సమావేశంలో మేమే యెర్ర జండా బహుమతి పొందుతుతామని ఆశిస్తున్నాము.

నీనా (11½ సం॥ల వయస్సు)

## బాబీ

బాబీ మన తరగతికి చెడ్డపేరు యెందుకు తీసికొని వస్తున్నాడు? శెలవుల అనంతరం సమావేశం జరిపి. అతని తల్లిని కూడా ఆహ్వానించాలి. ఇంటివద్ద చేయవలసిన పనినిగూర్చి అనేక సార్లు జ్ఞాపకంచేసి, తోడుపడుతున్నప్పటికీ, మరచిపోతూంటాడు. అతడు చెడ్డవాడు కాడు. కాని మందమతి. ఇంగ్లీషు, రష్యను భాషల్లో మంచి మార్కులు తెచ్చుకునేందుకు మనమందరమూ తోడుపడాలి.

వ్లాదిమర్ (11 సంవత్సరములవయస్సు)

## ఇరువదవ రష్యను అక్టోబరు విప్లవ వార్షికోత్సవం

ఏడవ తేదీనాడు అందరమూ ప్రదర్శనంలో పాల్గొనాలి. ఎచ్చట చూచినా ఎర్రజండాలు, వినాదాలు సోవియట్ సంయుక్త సమ్మేళనం యీ ఉత్సవాన్ని వైభవోపేతంగా జరుపుతుంది.

కార్మికులకే సామాజిక సంపదంతా చెందుతుంది కాబట్టే, మన దేశంలో అందరమూ సుఖంగా వుంటున్నాము. మా తండ్రి స్టాఖనోవ్ వాది. తన తలిదండ్రులెంత దుర్భర జీవితాలను గడిపారో ఆయన నాతో చెప్పాడు. ఇప్పుడో! మేము చక్కటి భవనంలో, కొరత నెరుగని జీవితాన్ని గడుపుతున్నాము. విప్లవం వర్ధిల్లుగాక!

లియాన్ (3 వ తరగతి. వయస్సు 9½ సం॥)

## నవంబరు 7

గత సంవత్సరం నేను అమెరికాలో ఉన్నప్పుడు, నవంబరు విప్లవాన్ని ఆ దేశంలోనే జరిపాము. కాని, నేపో ఎర్ర మైదానంలో నా తలి

దండ్రులతో సోదర కామ్రేడ్సు మధ్య విజయ గర్వంతో ఎర్రబావుటా పట్టుకొని, నినాదాలు ఉచ్చరిస్తో నడిచే భాగ్యం కలిగింది. నా తండ్రి భుజాలమీద కూర్చో బెట్టుకుంటే, కామ్రేడ్ స్టాలిన్, కామ్రేడ్ వొరోషిలోవ్‌ల దర్శనం చేస్తాను. ఆ ఆనందపూరిత దినంనాడు జయ, జయ నినాదాలు చేస్తాను. సేమూర్ (3 వ తరగతి, వయస్సు 10 సం॥)

## సోషలిస్టు పోటీ

**పాఠశాల క్రింది తరగతుల పోటీ ఫలితాలు।**

తరగతి 2 అందరూ ప్యాసు అయ్యారు శిక్షణ ఉత్తమం.

తరగతి 3 రష్యను భాషలో (జార్జి, సెలానా) 2 హీనపు మార్కులు. ఇంగ్లీషులో ఒక హీనపుమార్కు (విక్టార్) 3 రోజులకు మినహాయిస్తే, శిక్షణ ఉత్తమం.

తరగతి 4 ఇంగ్లీషులో 1 హీనపు మార్కు (బాబీ) రష్యను 1 హీనపు మార్కు (బాబీ) శిక్షణ ఉత్తమం.

ఉపసంఘం రెండు ఎర్రజండాలను బహుమతిగా నీయ నిర్ణయించింది. రెండవ తరగతికి 1 జండా, 4 వ తరగతికి రెండవ జండాయున్నూ ఇవ్వబడ్డాయి. బాబీ బాగా చదివి త్వరలోనే లోపాలను సవరించుకోవాలని సలహా యిస్తున్నాము.

సంతకాలు : సేమూర్ ( తరగతి 3 )
ఎవిలిన్ ( తరగతి 2 )
వ్లాడిమర్ ( తరగతి 4 )
ప్రిన్సిపాలు మూడవతరగతి ఉపాధ్యాయుడు.

## క ం చు కా గ డా

### 7 వ తరగతి పత్రిక

**పాఠశాలా సంవత్సరం ముగింపు, వీడ్కోలు**

ఆంగ్లో అమెరికను పాఠశాలలో నాలుగు సంవత్సరములు చదివాను. నా జీవితంలో సంతోషప్రదమైన పీసంవత్సరాలే అవి నా భావం. అన్ని విషయాలలోను, నేను అపరిమితంగా తెలుసుకున్నాను. ప్రిన్సిపాలుకు ఉపాధ్యాయులకు యెవ్విధంగా నా కృతజ్ఞత చూపవలెనో, నాకు తెలియడంలేదు.

అమెరికాలో మాకు విషయబోధ చేసేవారుకాని, దేనికి కారణాలను చెప్పేవారుకారు. ఉదాహరణకు గణితశాస్త్ర లో, లెక్కలు కట్టడం నేర్పే వారుకాని, ఆ శాస్త్రంవెనుకనున్న సిద్ధాంతాన్ని చెప్పేవారుకాదు. మేము యెందుకు చదవాలో, ఆ కారణమే మాకు తెలియదు.

ఇక్కడ మేము చదివే ప్రతివిషయానికి, కారణం, సిద్ధాంతం, తెలుసుకోవడమేకాక, మా జీవితాలే యెంతో సరదాగా, విజ్ఞానపూరితంగా గడుస్తున్నాయి. ఆ విషయాలయందు, అభిరుచి, ఆసక్తి కలుగుతున్నాయి. పాఠశాల మా అభిప్రాయాలను వెల్లడించి, మా శీలాన్ని మెరుగులు పెట్టు కొనే పవిత్ర స్థలంక్రింద పరిగణింపబడుతోంది.

చిత్రలేఖన సమాజంలో నేను చేయగలిగిన కృషినిబట్టి, నాకు ఆ లలిత కళయందు సహజమైన అభినివేశం వున్నట్లుగా గుర్తించగలిగాను. ఈ కళోపాసనలోనే, నా భావిజీవితాన్ని వినియోగిస్తాను.

నా జీవితానికి భద్రతవున్నదనీ, రష్యాలో నిరుద్యోగ పెనుభూతం లేదనీ నాకు తెలుసును. మా తలిదండ్రులు సోవియట్ సమ్మేళనంలోనే స్థిరపడిపోవాలని, చేసిన నిర్ణయం నాకు అత్యంతానంద ప్రదమౌతోంది.

(మేరీ వయస్సు 16 సం॥)

## ఒక సలహా

గణిత, చరిత్ర, భూగోళశాస్త్ర ఉపాధ్యాయులు చాల చక్కగా బోధించినందుకు ప్రథమంలో వారికి నేను వందనము లర్పించవలసివుంది. వీరి బోధనా చాతుర్యంతో నాలో గణితశాస్త్రమందు అభినివేశం కలిగింది. అందువలన ఆ శాస్త్రాన్నే నేను అభ్యసింప నిశ్చయించాను.

ఒక విషయాన్ని మాత్రం నేను విమర్శించకుండా ఉండలేక పోతు న్నాను. రసాయనిక, పదార్థ విజ్ఞానశాస్త్రములు సంపూర్ణంగా తెలిసిన శ్రామేద్ గ్రాంటు తన విద్యార్థులయందు శ్రద్ధతీసుకోరు. పిల్లలకు మార్కులు వెయ్యరు. ఇంటికి అత్యధికంగా పనియిస్తారు. తరగతి సమా వేశాల్లో అనేక పర్యాయములు ఈ విషయాన్ని చర్చించాము. కాని విశేష మైన మార్పేమీలేదు.

ఈ పాఠశాలను వదలి వెళ్ళే యీ తరుణంలో, మా విమర్శనలను మన్నించి, బోధనా విధానాన్ని మార్చుకొని మరుసటి సంవత్సరపు పేదవ

తరగతి విద్యార్థుల కృతజ్ఞతకు పాత్రులవ వలసిందని క్రామేడ్ గ్రాంటును కోరుతున్నాను. (పీటర్ వయస్సు 15 సం॥)

మనమందరమూ ఒకే తరగతులలో చదివి ఉత్తీర్ణులవుతో చక్కగా యిన్ని సంవత్సరాలు కాలం గడిపాము. మనలో వ్యక్తిగత మైత్రులలో భేదమున్నప్పటికీ, మొత్తంమీద అందరమూ చాలా స్నేహంగానే మెలిగాము. ప్రశంసా పాత్రమైన ఐకమత్యాన్ని ప్రదర్శించాము.

మనము చూసిన నాటక ప్రదర్శనాలు, వేసంగి వినోద, విజ్ఞాన యాత్రలు, జరిపిన చర్చలు, చేసిన నృత్యాలు, పాడిన గేయాలు యెవ్వరైనా మరచిపోగలుగుతారా?

మన తరగతి ఉపాధ్యాయులైన క్రామేడ్ రోజర్సుకు నాకృతజ్ఞతా పూర్వక వందనాలు. ఆమె మనయందు చూపినశ్రద్ధ, ఆదరణలు అపారములు. శెలవండి, క్రామేడ్ రోజర్సు!

హెలెన్ (వయస్సు 14 సం॥)

## ఉపాధ్యాయ వాణి

### సంచిక 7 మార్చి

### ఆఖరి టరమ్‌లో మన విధులు

ఈ టరమ్ అంతాన్ని పరీక్షలు వస్తాయి. ఈ సంవత్సరం పొడుగునా మనం బోధించిన పాఠ్యాంశాలను పూర్తిగా అవగతం చేసుకొని, పరీక్షలలో ఉత్తీర్ణ లయ్యేందుకు ప్రతి విద్యార్థికి తోడుపడాలి.

సంవత్సర పాఠ్య ప్రణాళికను సింహావలోకనం చేశేందుకు ప్రతి గంటలోను పది నిముషాలు వినియోగించాలి. పరీక్ష పత్రాలను, ప్రశ్నలను యిప్పటినుంచీ తయారు చేసుకొని వుంచాలి.

ఉపాధ్యాయుల సమావేశంలో వివరాలను చర్చించవచ్చును వేసంగి లోపుగా మనం చేయవలసిన విధులను జ్ఞాపకం చేయడానికే, విద్యార్థుల యెడల మనం తీసుకోవలసిన జాగ్రత్తలను సూచించడానికే యీవ్యాసం.

డి. యల్.

## మహిళా దినోత్సవం

మార్చి 8 నాడు జరిగిన మహిళాదినోత్సవంలో పాల్గొని నేనెంతో సంతోషాన్ని పొందాను. సోవియట్ సమ్మేళనములో నేనొక సంవత్సరం

నుండే వుంటున్నాను కనుక, ఇది నా కమిత ఆనందదాయకమైన కొత్త అనుభవం.

నా పాపాయికి పంపిన బహుమతి చూడగానే, నా హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. సోవియట్ ప్రభుత్వం వివాహమాడిన ఉపాధ్యాయురాండ్రను యెంతగా గౌరవిస్తుంది! వివాహితులై, పిల్లలను కన్న తల్లు లందరూ అవిధంగానే బహుమతుల నందుకుంటే, సోవియట్ రష్యా మాతా శిశువులయెడ కనపరిచే అవ్యాజశ్రద్ధకు నా హృదయం సంతోషంతో గంతులువేసింది.

రాత్రి జరిగిన విందు యెంత ఆనందదాయకమైన అనుభవం! రుచ్యములైన భక్ష్యములు, మధురాసవం, వింతరంగుల దుస్తులతో సీతాకోక చిలుకలవలె కులికిన యువతులు - తిండి, బట్ట లేక మాడుతోన్న రష్యానుగూర్చి మొసలి కంటినీరు కార్చేవారు ఈ విందును, ఈ భోక్తలను చూస్తే, బాగుండు ననిపించింది.

ఔను, కామ్రేడ్స్, వాస్తవంగా సోవియట్ యూనియన్‌లో స్త్రీ పురుషునితో అన్నివిధాలా సమానురాలని, మానవకోటికి తల్లివలె అత్యమితంగా గౌరవింపబడుతుందనీ చెప్పేందుకు యీ ఒక్కరాత్రి విందు చాలదు?

యమ్. కె.

## కార్మిక సంఘం

మన కార్మిక సంఘం యీ మధ్య నెందుచేత నీళ్ళు కారుతోంది? 11 గంటలకు భోజనం యేర్పాటు చేస్తామనీ, చెయ్యడంచాలా సుఖవనీ చేసిన వాగ్దానాలను విస్మరించారేమిటి? లే, కామ్రేడ్ రోజర్సు, కళ్ళు విప్పు! మాటలుకాదు, చేతలు కావసింది!

మన సముదాయంలో నాటక టికెట్లను కొని పంచే పద్ధతినికూడా నేను విమర్శించవలసి వుంది. సంస్కృతిసేవకురాలు సభ్యుల అభిరుచులను గమనించి, విముఖులగువారిలో కూడా సరదా కలిగించవలసి వుంది. నాటక, నృత్య, చలన చిత్రప్రదర్శనాలకు వెళ్ళుటకు అందరూ అభిలషిస్తారు కాని, టిక్కెట్లను తెచ్చుకునే కష్టములు పడుటకు సిద్ధపడరు. కామ్రేడ్ గోల్బర్గు తనకు పేర్లవిచ్చిన వారికి మాత్రమే టిక్కెట్లు కొంటుంది. కాని యెవ్వరికీ శ్రద్ధ కలిగించేందుకు ప్రయత్నింపదు. ఆమె ఒక నోటీసుబల్లమీద నాటక ప్రదర్శనముల కరపత్రములను యేలఅంటిం



సోవియట్ దూరప్రాచ్యానికి చెందిన ఒకనాటి నిరక్షరాస్యులు

# వ్యాయామం, ఆటలపోటీలు

వ్యాయామంలోను, ఆటలపోటీలలోను
స్టాండర్డు పరీక్షలలో ప్యాసైనవారిసంఖ్య

**1933**

**465,000**



**1938**

**4,978,000**

    

   

పురుషులు : 44 లక్షల 66 వేలమంది    స్త్రీలు : 5 లక్షల 10 వేలమంది

చరాదు ? రెండు మూడు నెలల కొకపర్యాయమైనా అందరమూ కలిసి సామూహికంగా ఒక నాటక ప్రదర్శనం చూడాలి.

ఈ విషయంగూర్చి, మీ అభిప్రాయం యేమిటి, కామ్రేడ్ అధ్యక్షా.

జి. సి.

(గమనిక : పై వ్యాసంలోని విషయాలు సబబుగా ఉన్నాయి. ఈ సూచన లను సంతోషంతో స్వీకరిస్తున్నాము — అధ్యక్షుడు.)

## నిరక్షరాస్యత

నాకు యేబదవ పడి దాటినందున, తప్పనిసరిగా చదువ వలసిన అగత్యం లేనప్పటికీ, కార్మిక సంఘంవారిచే నడుపబడుతోన్న వయోజన విద్యా తరగతుల్లో చదివి, నేటికి వార్తా పత్రికలనుచదువుట, వ్రాయుట నేర్చు కున్నాను.

మా తరగతిలోని వారమందరమూ గోడ వార్తాపత్రికలో వ్యాస ములు వ్రాస్తామని ప్రతిజ్ఞ చేశాం.

విప్లవానికి పూర్వం నా జీవితం అంధకారబంధురం. ఉపవాసాలతో శారీరకంగాను, మానసికంగాను కృంగి కృశించి వుండేదానను. నేడో, నా బిడ్డలు పాఠశాలలలో చదువుకుంటున్నారు. నా బిడ్డ లంటారుకదా, 'ఉండవమ్మా, మా చదువులు పూర్తికానియ్యి. నువ్వు కష్టించవలసిన అవుసరముండదు' అని. నేను సాంకేతిక నిపుణురాలను కాకపోయినా, నా బిడ్డలు మంచి నిపుణులై పెద్దజీతాలు సంపాదిస్తారు.

— షూ రా.

## సోషలిస్టు ఒడంబడిక

ఈ క్రింద నుదహరించిన అంశములపై, దిగువ సంతకములు చేసిన మేము సోషలిస్టు పోటీలో ప్రవేశించుటకు ఒడంబడిక చేసుకున్నాం.

1. నూటికి నూరుగురు విద్యార్థులు ఉత్తీర్ణు లగుటకును, కనీసం 500 కి 50 మందైనా ఉత్తమ తరగతి మార్కులు తెచ్చుకొనునట్లు తర్ఫీదు చేయుటకును.

2. నోటి ప్రశ్నలు కనీసం వారమునకు రెండు పర్యాయాలైనా అడుగుటకు.

3. నోటు పుస్తకాలు వెంట వెంటనే సరిదిద్దుటకు.
4. వెనుకబడిన వారి యందు ప్రత్యేకశ్రద్ధ తీసుకొనుటకు.
5. పాఠ్యక్రమ ప్రణాళికను పూర్తిచేసి, సింహావలోకనం చేయుటకు.
సంతకములు : డి. యల్. ( గణితశాస్త్రము )
యల్.జి. ( రసాయనిక భౌతికశాస్త్రములు )

## చెడ్డ పిల్లలు

ఒక రోజున కామ్రేడ్ హాలెండును చూచేందుకు, ఆమె యింటికి వెళ్ళాను. మా యిద్దరి మైత్రి అభివృద్ధి పొందిందికనుక, తరుచుగా మా విరామసమయాన్ని యిద్దరం కలసి గడుపుతున్నాము ఆమె కొత్తగాకట్టిన యింటిలో ఉంటోంది. ఆయింటిచుట్టూ విశాలమైన ఆవరణవుంది. ఇంటి ముందు పచ్చిక యేపుగా పెరిగి గడ్డిపూలతో పచ్చలు పొదిగిన రత్నకంబళం పరిచినట్లువుంది. చిన్నమొక్కలు పెరుగుతున్నాయి. కొలదికాలంలోనే యీ మొక్కలు, వృక్షాలై మంచినీడనిస్తాయి.

మేడ గదులనుండి క్రిందకుదిగుతోంటే, కిందచీడీలవద్ద పెద్దకేకలు వేస్తో ఆడుతోన్నపిల్లల సమూహం కనపడింది. ఆగుంపులో పదమూడేండ్ల కుర్రవాడు సిగరెట్టు కాలుస్తోంటే, మేము ఆగి, వారితో సంభాషణ కుపక్రమించాము.

'సిగరెట్టు యెందుకు కాలుస్తున్నావు?' అని ఆ కుర్రవాణ్ణి అడిగాను.

'జీవితానికి ఆనందంయిచ్చేవాట్లో పొగపీల్చడం ఒక్కటి' అంటూ కొంటెగా సమాధానంవచ్చింది. .

'చాలాబాగుంది. నేను ఆమెరికా వెళ్ళిన తర్వాత నిన్నుగూర్చి చెప్పేందుకు చాలాసిగ్గుపడతాను. సోవియట్ రష్యాలో పిల్లలకు అన్ని సౌకర్యాలు సమకూర్చబడ్డాయి. వారు ప్రపంచ బాలబాలికలకు ఆదర్శ ప్రాయులని మా అమెరికను పిల్లలు అనుకుంటూ వుంటారు. కాని నిన్ను చూసి, నా అభిప్రాయం మార్చుకోవాలి' అందిహాలెండు.

'అమెరికా' పేరు వినేటప్పటికి పిల్లలందరూ హాలెండుచుట్టూ మూగి, 'దయచేసి, అమెరికానుగూర్చి మాకన్నిసంగతులూ చెప్పండి' అంటూ ఆతృతతో అడిగారు. దృష్టి ఆ కుర్రవానిమీదేపెట్టి. ఆమె అమెరికా లోని ఆకాశసౌధాలనుగూర్చి చెప్పింది.

'ఆ విషయం మా పాఠాలలో చదువుకున్నాం - మాకు అదికాదు కావలసింది. అక్కడి పిల్లలు మా లాగే, పాఠశాలలకు పోతారా ? వాళ్ళు కూడా వేసంగి మకాములు వేస్తారా ? మార్గదర్శులున్నారా, అమెరికాలో ?' అంటూ ప్రశ్నలవర్షం కురిసింది.

'ఆవిషయాలు తెలుసుకోవాలంటే మా విద్యాలయానికి రావాలి. అందులో చాలమంది అమెరికను బాలబాలికలున్నారు. మీ ప్రశ్నలన్నిటికీ వారు సమాధానం చెబుతారు. చిరునామా చెబుతాను, వ్రాసుకోండి. మీరింత మంది వుండి, మీస్నేహితుణ్ణి పొగపీల్చనిస్తున్నారేమి ? మీతీరికసమయా లెట్లా గడుపుతారు ? ఈయింటికి 'యెర్రగది' లేదా ?'

అందులో ఒక పిల్లవాడు చెప్పాడు. 'యూరాపెద్దపిల్లవాడు. వాడి తల్లి చిన్నతనంలో చనిపోయింది. తండ్రి చెప్పినమాట వినడు. మా యింట్లో 'యెర్రగది' స్థాపించవలసిందని యెన్నిమార్లు కోరినా, యింత వరకూ గృహసంఘంవారు పెడచెవిని పెట్టారు.'

'మీకు నేను సహాయం చేస్తాను. గృహ సంఘసభ్యు లెక్కడ వున్నారో యూరా నాకు చూపిస్తాడు. ఈలోపున, యెర్రగదిలో మీరేం చేస్తారో, నాకు చెప్పండి' అంది, హాలెండు.

'చదరంగం.'

'కుట్టు సమాజం.'

'నాటక సమాజం.'

'ఆటల సంఘం.'

తడువుకోకుండా సమాధానాలిచ్చిన విధానం చూస్తే. వారికేం చెయ్యాలో తెలుసునన్న విషయాన్ని వెల్లడిస్తుంది.

'నాకు వేరేపనివుంది. రేపుదయాన్ని గృహసంఘం వద్దకు నేను, యూరా వెళ్ళి మాట్లాడుతాము. అంగీకరిస్తావా, యూరా ?' అని కామ్రేడ్ హాలెండు అడిగింది.

'ఓ ; నాకు వప్పుదలే !' అన్నాడు, యూరా.

'మా విద్యాలయం చిరునామా యిదుగో. మీలో యెవ్వరైనా, పాఠాల అనంతరం, అచ్చటకు రావచ్చును, 'శెలవు' అని చెప్పి మేము క్రిందికి దిగాము.

'శెలవు, అండి !' అంటూ అందరూ వీడ్కోలిచ్చారు.

మరుసటిదినం ఉదయాన్ని, నేను, యూరా కలిసి, మా గృహ సంఘ సభ్యులను కలుసుకున్నాము. అంతపెద్ద గృహానికి, అందులోనూ కొత్త భవనానికి, పిల్లల ఆటలమందిరం లేకపోవడానికి నా ఆశ్చర్యాన్ని వెల్లడించాను.

'ఎర్రగదేనా ? మే దినోత్సవంనాడు తెరుస్తామండీ.'

'ఎర్రగది కొరకు మీరు రెండు నెలలు ఆగనవసరంలేదు ఇక్కడ పిల్లలు దురలవాట్లలోపడి, చెడిపోతున్నారు. వెంటనే రేపే మీరు ఆటల మందిరం తెరవాలి. ఈ వారంలో ప్రతి సాయంకాలం నేనువచ్చి యూరా తోనూ స్నేహితులతోనూ కలిసి, యెర్రగదిని సర్దుతాము. ఈలోగా, యెర్రగదిని నడిపేందుకు తగినవారిని మీరు చూసుకోవచ్చును.

'ఇంత అకస్మాత్తుగా పనులు చేయడం, లాభకష్టం. బల్లలు వగైరా సిద్ధంగాలేవు. గది అంతా బాగుచేయాలి....'

'చేయదలచుకుంటే, ప్రతిపని సాధ్యమే. 1917 లో విప్లవం చేయవలసి వచ్చినప్పుడు, ప్రజలీవిధంగా మాట్లాడలేదు. ఇంతకంటె, ఘన కార్యాలే, తక్కువకాలంలో చేయబడ్డాయి. నాచేతికి కొంతడబ్బు యివ్వండి, మీకు కావలసిన సామాను తెప్పిస్తాను.' అని హాలెండు అంది.

ఆమె పట్టుదల నెగ్గింది. ఎర్రగదిని చూపారు. మరీ పెద్దదీకాదు, చిన్నదీకాదు. ప్రారంభంలో సరిపెట్టుకోవచ్చును పై అంతస్తు యెక్కు తోండగా యూరా సిగరెట్టు వెలిగించాడు, కాని, హాలెండు చూడనట్లు నటించి,

"యూరా, నీవుపోయి, యిద్దరు కుర్రవాళ్ళని తీసుకురా. నా గదిలో కూర్చుని, మనం కొనవలసిన ఆట సామాన్ల జాబితా తయారుచేసి, మధ్యాహ్నం బజారుకువెడదాం. మనం ఒక సమావేశం పిలిచి, సంఘాన్ని కూడా యెన్నుకోవాలి.' అని హాలెండు ఆమె గదికివెళ్ళింది.

ఒక బాలకుణ్ణి, ఒక బాలికను యూరా వెంట తీసుకొని హాలెండు గదికి వస్తోన్నప్పుడు, నేను కూడా వచ్చాను. మేమందరమూ కూర్చొని ఒక జాబితా తయారుచేశాము. పన్నెండు కుర్చీలు, ఒక పొడుగుపాటి మేజాబల్ల, తెరలు, ఆరు చదరంగపు బల్లలు బిళ్ళలపెట్టెలు, ఒక చిన్న బిలియర్డ్సుబల్ల, కారమ్సుబల్లలు ముందు వెంటనే కొనేందుకు, వాలీబాలు ఆటకు బంతి, నెట్టుకొనేందుకు డబ్బు యీయవలసిందని భవన సంఘ

యాజమాన్యాన్ని కోరాలని, నిశ్చయించుకున్నాము. వాలీబాలు ఆట అనే శబ్దం వినగానే యూరాకు అమిత ఉత్సాహం కలిగింది.

కుట్లు మిషన్లు పెట్టాలని పిల్ల సలహా యిచ్చింది. 'గోడ వార్తా పత్రిక నడపాలి లీనా మార్కులకు సంపాదకులుగావుంటే చాలా బాగుంటుంది. బొమ్మలు బాగావేస్తారు. లీనా బాగా ఘాటుగాకూడా వ్రాస్తుంది. మా తండ్రి ఒక చదరంగం పోటీ పెట్టి బహుమతులు యిస్తానని చెప్పారు.' అంటూ యూరాతో వచ్చిన కుర్రవాడు ఉత్సాహంగా చెప్పాడు.

ఈ విధంగా ఆ ఆవరణలోని పిల్లలందరూ తమ యెర్రగది ఆటలను పాటలను అభివృద్ధిపరచే కార్యంలో నిమగ్నులయ్యారు. యూరా చాలా శ్రద్ధతో పనిచేస్తో, పలుకుబడి సంపాదించాడు. మూడు నెలల అనంతరం ఆతనికి తరగతిలో మార్కులు అధికంగా వచ్చినట్లు అభివృద్ధి నివేదిక చూపించాడు.

చూడండి, యెంత అభివృద్ధికరమైన మార్పు కలిగిందో! పిల్లలకు ఒక చిన్న గదిని ప్రత్యేకించేసరికి, సిగరెట్లు తాగడం తగ్గింది, అల్లరి చిల్లరిగా తిరగడం కట్టుబడింది, వీధులమీద గుంపులుగూడి తగవులాడటం మాయమైంది. ఆ యెర్రగది విరామ సమయాల్లో, పిల్లలతో కిటకిటలాడుతో వుంటుంది. తల్లి దండ్రులు తీరిక సమయాలలో పిల్లల కన్ని విధాలా తోడ్పడుతూ వుంటారు. పిల్లలేవేసిన చిత్రాలు గోడలమీద వ్రేలాడుతున్నాయి. ఆ గృహసంఘం కూడా శ్రద్ధ తీసుకొని, నెల నెలకూ ఖర్చులకు కొంత విరాళం యిస్తున్నారు.

కొలది కాలంలోనే ప్రతి వీధిలోను, పిల్లల కొరకు యెర్రగది అను ఆటల మందిరం యేర్పాటు చేయవలయుననే చట్టం చేయబడింది.

ప్రతి పోలీసు స్టేషనులో ఒక పిల్లలగది వుంటుంది. తప్పిపోయిన పిల్లలను, శాసనధిక్కారం చేసిన పిల్లలను అందులో వుంచి మనస్తత్వ శాస్త్రం సంపూర్ణంగా అభ్యసించిన ఒక పోలీసు వారిని మంచిమార్గంలోకి తీసుకొని వచ్చేందుకు ప్రయత్నిస్తారు.

వేసగి, శీతాకాలపు సెలవులలో, విద్యార్థులు, ఉపాధ్యాయులు యీ పిల్లలగదులకువెళ్ళి, వారికి సంస్కరణ విద్యావిధానం బోధించడం సామాజిక ధర్మంగా భావిస్తారు. పై తరగతి విద్యార్థులు జట్లుగా యేర్పడి, వంతులవారీగా వారికి బోధిస్తారు.

శీతాకాలపు శెలవులలో ఒక పోలీసు స్టేషనులో మా విద్యాలయం తరపున మేము రెండురోజులు పనిజేయవలసి వచ్చింది. ఆపని నేనేచేస్తా నని చెప్పి అక్కడకు వెళ్ళాను. ఆ రోజు అనుభవం అసామాన్యము, అమూల్యము. పిల్లల సంస్కరణకు బాధ్యత వహించిన యువకుడు, చేయవలసిన పనికి తగినవాడు, స్నేహపూరితమైన దృఢస్వరంతో పిల్లలతో మాట్లాడుతాడు. ఆయనకు బాలబాలికలతో మెలగవలసిన విధానం తెలుసును. కావలసిన సంగతిసందర్భాలను, పిల్లలను కోపపకుండా, గదమాయించకుండా వారినుండే తెలుకోగలిగిన సమర్థుడు.

ఆ స్టేషనుకు తీసికొనిరాబడే పిల్లలతో మాట్లాడి, వారు చదివిన పాఠశాల, తలిదండ్రులు, వారు చేసిన తప్పిదమునకు దారితీసిన సందర్భములనుగూర్చిన వివరములను నేను తెలుసుకోవాలి.

ఆ గదిలో ఒక మేజాబల్ల, అనేక కుర్చీలు వున్నాయి. తలిదండ్రులరాకకొరకు వేచియుండే పిల్లల వినోదార్థం వేరే బల్లలు, ఆటబల్లలు పిల్లల నాకర్షించే అనేక గ్రంథాలబీరువా అమర్చబడి వున్నాయి.

మా గదిలోకి తీసుకొని రాబడిన మొదటి నేరస్తుడు పదేండ్ల కుర్రవాడు. ఒక లారీ వెనుకభాగాన్ని పట్టుకొని యీ కుర్రవాడు మరొక చిన్నబిడ్డతో కలిసి వ్రేలాడు తోంటే, ఆ గృహరక్షకుడుచూచి, యీ బాలకుని స్టేషనుకు తీసికొనివచ్చాడు. ఆ కుర్రవాడు వెక్కివెక్కి యేడుస్తున్నాడు.

'ఇట్లారా, అబ్బాయి!' అని పోలీసు ఉద్యోగి స్నేహస్వరంతో పిలిచాడు. ఆ కుర్రవాడు దగ్గరకువచ్చి ఒక కుర్చీలో కూర్చుని యేడ్పు సాగించాడు. 'చూడు, అబ్బాయి, నిన్ను కొట్టేందుకు తీసుకురాలేదు. ఆ విధంగా వ్రేలాడి నువ్వు, ఆపిల్లవాడు కిందబడితే, తలలు పగులుతాయి. ఎంతతెలివి తక్కువపనో, ఆలోచించు. అది చాలా అపాయకరం. బడికి పోవడంలేదా? ఈ సెలవుల్లో మీ బడిలో యెన్నో ఆటలు, నాటకాలు జరుగుతో వుంటాయే! చాలాసరదాగా వుంటుంది. ఎందుకు వెళ్ళడం లేదు, నువ్వు? మీ బడిసంఖ్య యెంత?'

ఆయన నెమ్మదిగా మాట్లాడాడు. ఆ పిల్లవాడు కూడా యేడుపు మాని, తన చిరునామా యిచ్చాడు. అతని తల్లి కొరకు కబురువెళ్ళింది. తల్లివచ్చే లోపుగా ఆటబల్లవద్దకు వెళ్ళి ఆ కుర్రవాడు ఆటలాడుతున్నాడు.

ఇరువది నిముసాల్లో ఆతని తల్లి ఆదుర్దాగా వచ్చింది. కుఱ్ఱవాడు సంతోషంతో ఆడుతోండటంచూచి, స్తిమిత పడింది. ఆ ఉద్యోగి ఆమె తన బిడ్డవిషయంలో చాలాఆశ్రద్ధ వహించినందుకు మందలించి, పాఠశాలకు పంపుతే, అచ్చటఉన్న సమాజాల్లో జేరి, అభివృద్ధికి వస్తాడుకనుక వెంటనే పాఠశాలకు పంపమని సలహాయిచ్చాడు.

తల్లి, పిల్లవాడు వెళ్ళిన తర్వాత, పాఠశాలకు ఫోనుచేసి, 'సెలవు యిచ్చేముందే, పిల్లలందరూ సెలవుల్లోవచ్చి ఆటలమందిరం కాలం సరదాగా వెళ్ళబుచ్చవలసిందని మీ పిల్లలలో యెందుకు మీరు ప్రచారం చేయలేదు? మీ పిల్లవాడొకడు వీధుల్లో గంతులువేస్తో, లారీని పట్టుకొని ప్రేళ్లాడి ప్రాణం పోగొట్టుకునేందుకు తయారయ్యాడు. మీ విద్యాలయాలను సెలవు దినాల్లో ఆటల మందిరాలక్రింద యిట్టివి జరుగకుండానే కదా, మార్చింది?' అంటూ ఆ ఉద్యోగి వారిని మందలించాడు.

మరలకొద్ది నిముసాల్లో టెలిఫోను గంట మ్రోగింది. ఒక పెద్ద కొట్టుకాపలాదారు ఒక అమ్మాయిని జేబుక త్తిరిస్తోంటే పట్టుకున్నాడు. ఏమి చేయమంటారు?' అని టెలిఫోనులో ప్రశ్న. 'తక్షణం యిక్కడకు పంపవలసింద'ని ఆజ్ఞ. ఆ కాపలాదారు, అమ్మాయిని వెంటబెట్టుకొని వచ్చాడు. ఆమెకు పన్నెండేండ్లవయస్సువుంటుంది. విర్రీకురాలు. అలక్ష్యస్వభావం కలది. నేరాన్ని అంగీకరించకుండా, తృణీకరించసాగింది. ఆమె తలిదండ్రులకొరకు కబురు పెట్టిన తర్వాత ఆమె యేవిధంగా జేబునుండి డబ్బు సంచిని తీసిందో వర్ణిస్తున్నాడు. ఆమె అకస్మాత్తుగా చెప్పడం మొదలు పెట్టింది. ఆమెదొంగకాదని తన పొరుగుననున్నపిల్ల ప్రతిరోజూ దొంగతనాలు చేస్తుందనీ, చెప్పి, ఆమెను పూర్తిగా వర్ణించింది.

'ఆ అమ్మాయినిగూర్చి అంత యెక్కువగా, నీకెట్లు తెలుసును?' అని పోలీసు ఉద్యోగి ప్రశ్నించాడు.

'నన్నుకూడా, అప్పుడప్పుడు తీసికొని వెళ్ళేది' అని నసుగుతూ ఆమె సమాధాన మిచ్చింది.

ఈ సమయానికి, ఆమె తలిదండ్రులు వచ్చారు. వారిని కూర్చుండబెట్టి యీ సంగతి అంతా వారికి చెప్పాడు. ఆమె తండ్రి కోపంతో బల్లగుద్దుతో యీ విధంగా అన్నాడు. 'అమ్మాయి చాలాచెడ్డది. గట్టిగా తన్ని చెవ్వులు మెయ్యాలి. నా చిన్నతనంలో మా తల్లి దండ్రులు మమ్మల్ని కొట్టినట్లుగానే, అమ్మాయిని మేము దండించివుంటే, ఈబుద్ధులు

అబ్బకపోవును. పిల్లలను కొట్టకూడదనేచట్టం వుందని ఆమెకు తెలుసును కనుక, హద్దుమీరిపోయింది. భయమా, భక్తా. ముప్పదియేండ్లనుంచీ పనిచేస్తున్నాను. న్యాయస్థుడనని పేరు తెచ్చుకున్నాను. ఒక్కసారికూడా పోలీసు స్టేషను గడప తొక్కలేదు. నేటికి, దీనిమూలంగా అప్రదిష్ట వచ్చింది.'

'దొంగతనం చెయ్యడం యెల్లా ప్రారంభించిందో, మీకేమైనా తెలుసునా? ఎవ్వరో పొరుగింటిపిల్ల వుందని చెబుతుంది, ఆమె ఎవ్వరో మీరు యెరుగుదురా?' అని ఉద్యోగి ప్రశ్నించాడు.

'ఔను, ఆ అమ్మాయి బహుచెడ్డది. ఆ అమ్మాయితో సహవాసం చెయ్యవద్దని మా మర్యాసాతో అనేకసార్లు చెప్పాను. కాని నామాట వినదు. ఆ అమ్మాయి బడికి వెళ్ళటంమాని, దీన్నికూడా మాన్పిస్తో వుంటుంది. మా అమ్మాయికి బడిలో మార్కులుకూడా తక్కువ వస్తున్నాయి. ఇంకొకయేడు యీ తరగతే చదవాలేమోనని, నా భయం. ఈ అమ్మాయిని యెల్లా భయపెట్టాలో, యేం చెయ్యాలో తెలియకుండావుంది' అంటూ తండ్రి చెప్పాడు.

'మర్యాసా రోజూ బడికివెళ్ళేట్లా ప్రయత్నించాలి. ప్రతిరోజూ యింటికి యిచ్చినపని చేసి, పాఠాలు వల్లించేదీ, లేనిదీ తల్లి చూడాలి. తల్లితోటో, తండ్రితోనోగాని బయటికి పోనివ్వకూడదు. ఇక ముందెప్పుడూ దొంగతనం చెయ్యనని మర్యాసా నాకు వాగ్దానం చెయ్యాలి. నేను కూడా ఆమెపై ఒక కన్ను వుంచుతాను. ఒక నెలరోజుల్లో నన్ను కలుసుకుని ఆమె ప్రవర్తనలో మార్పువచ్చిన సంగతి ఋజువుచెయ్యాలి. ఆమె బడికి టెలిఫోనుచేశి, సరిగా వస్తోన్నదీ లేనిదీ, పాఠాలు వప్పగిస్తోన్నదీ, లేనిదీ, నేను కనుక్కుంటూ వుంటాను. ఏమంటావ్, మర్యాసా'

'నే నేమీ దొంగతనం చెయ్యలేదండీ!' అని మరొక పర్యాయం మర్యాసా అంది.

'ఐతే, బడికి మానకుండా వెడతావా? లేకపోతే మా కార్మిక సమాజానికి వెడతావా?'

'అక్కరలేదండీ, బడికే వెడతాను' అని ఆమె సమాధానం.

వారు వెళ్ళినతర్వాత, ఆ ఉద్యోగి నావైపుతిరిగి యిల్లా అన్నాడు.

'ఆ పాఠశాల చాలా చెడ్డదై వుండాలి. మాస్కోలో ఇంకా ఈ రకమైనబడులు కొద్దిగా మిగలకపోలేదు. మంచి శిక్షణపొందిన ఉపాధ్యాయుల

కొరత మాకింకా తీరలేదు. త్వరలోనే యీ లోటుకూడా తీరుతుంది. మర్యూసా తరగతి సహోదారుకు ఆమె విషయంలో యెక్కువశ్రద్ధ వహించవలసిందని ఫోనులో చెప్పాలి. ఆ పాఠశాలను రేపు చూడాలి. ఇక, ఆ తలిదండ్రుల విషయం-ఒక పెద్ద సమస్య. వారివికూడా విజ్ఞాన వంతులనుగా చెయ్యాలి. ఈ తండ్రి న్యాయస్థుడులాగే, కనుపడుతున్నాడు. కాని బిడ్డను యేవిధంగా, సరిదిద్దుకోవాలో తెలియదు. సరే. మర్యూసా మంచి మార్గంలో పడుతుందని, నా విశ్వాసం. ఆమె బడిలోని కొందరు పెద్దపిల్లలతో చెప్పి, మంచిమార్గంలో పెట్టవచ్చును.' ఇవ్వన్నీ తాత్కాలికపు కేసులు త్వరలోనే సరిదిద్దవచ్చును. మన పంచవర్షప్రణాళికలో వేసిన ప్రకారంగా, క్రెచీలు, తోటబడులు, పాఠశాలలు, గ్రంధాలయాలు, ఆట స్థలాలు, అన్నీ లభిస్తే, యీ సమస్యలన్నీ పరిష్కార మైపోతాయి. ఇంకా కొద్ది సంవత్సరాలాగి చూడండి. యుద్ధమే రాకుండావుంటే. గొప్ప ఆదర్శవాదులు కన్న కలలన్నీ యదార్ధాలు చేస్తాం. మా సోవియట్ మాతృభూమిని, బాల బాలికలకు స్వర్గప్రాయం చేస్తాం.'

'మీవద్దకు పెద్దకేసులు రావా? వచ్చినప్పుడు యేమి చేస్తారు?' అని నేనడిగాను.

'గొప్ప దొంగలు, చెప్పుకోదగిన నేరస్తుల కేసులు ఎన్నడోగాని రావు. బాల బాలికలు పరిస్థితులవలన తప్పుడు మార్గాలలోపడి, దొంగతనం చేస్తారు. దేశీయ వ్యావహారిక ప్రజా ప్రతినిధివర్గంచే నడుపబడే సంస్కరణ సమాజములకు అట్టివారిని పంపుతాము. వారచ్చట సమాజానికి ఉపకరించే సరియైన, బాధ్యతకల సోవియట్ పౌరులుగా సంస్కరింపబడతారు. ఆ విధమైన కేసులు చాలా అరుదు అవుతున్నాయి. ప్రజల జీవితపరిస్థితుల్లో బ్రహ్మాండమైన మార్పులు వచ్చాయి. జీవిత ప్రమాణం పెరిగింది. నిరుద్యోగం లేనప్పుడు, దొంగ తనానికి ప్రోత్సాహమే వుండదు. మాకు సర్వసామాన్యమైన నేరాలు యిప్పుడు మీరు చూచినవే. డబ్బులివ్వకుండా, ట్రాముల్లో తిరగడం, డ్యూటీమీదవున్న పోలీసులను తిరస్కరించడం; యిట్టి నేరాలన్నిటినీ బడులలో విధులనుగూర్చి పిల్లల మనస్సులకు నాటునట్లు బోధించడంద్వారా అంతకంతకు తగ్గించగలుగు తున్నాము.'

తొమ్మిది గంటలకు గదిమూసి, యిండ్లకు వెళ్ళాము. ఆ ఉద్యోగస్తుడు యీ సంగతిని బహు సులభంగా వివరించి చెప్పాడు. సోవియెట్ దేశంతో నేరస్తు లయ్యేందుకు అవసరమైన పరిస్థితులు లేకుండా చేయ

బడ్డాయి. నేరస్తులవడం దుస్సాధ్యంగా కూడా పరిణమించాయి. ప్రతి పౌరుడూ, ఆమెగాని, అతడుగాని కోరినవిధంగా జీవితాన్ని సుఖవంతంగా గడుపుకునే సదవకాశం లభించింది. ఇంకా లోటుపాట్లు ఉన్నప్పటికీ, సర్వులకు సమాన అవకాశములు లభించే పునాదులమీద బ్రహ్మాండమైన సమాజం నిర్మింపబడుతోంది. అట్టి పునాదులమీద సర్వోత్కృష్టమైన జీవిత లక్ష్యాలను సాధించవచ్చును.

## పాతపండితుల సమాచారం

సోవియట్ సమ్మేళనంలో నిరుద్యోగంలేదు. శక్తిసామర్థ్యములు కల కార్మికులు అవసరం సోవియట్ దేశంలో అపరిమితంగావుంది. బాల బాలికలు వృత్తి నేర్చుకోవడంలో కొంచెం తికమకలు పడతారు. అనేక వేల వృత్తులు వారి ముందు వుంటాయి. ఎన్నిక విషయం బహుకష్ట సాధ్యమైన పనే!

సోవియట్ సమాజంతో, విద్యాలయాలకు సన్నిహిత సంబంధం వుంటుందికాబట్టి, దినదినమూ జరిగే శాస్త్ర పరిశోధనలు, నూతనంగా కనుగొనబడే విషయములను గూర్చిన సమాచారములు విద్యార్థులకు వెంటనే తెలుస్తాయి. ఇందువలన విద్యార్థులకు పదునేను, పదునారుసంవత్సరముల వయస్సు వచ్చుసరికి వారివారి అభిరుచులు, ఆసక్తులు, శక్తి సామర్థ్యముల ననుసరించి యేవృత్తి యేవిషయంలో పై తరగతులలో కృషిచేయవలయునో, నిర్ణయించుకోగలుగు తారు. కళాప్రియులు, కళల కొరకేర్పరుపబడిన సమాజములకు, విద్యాలయములకు, ఇంజనీర్లు కాగోరు వారు వారివారి సమాజములకు, కళాశాలలకు, వెడుతూ తమజ్ఞానాన్ని అభివృద్ధిపరుచుకుంటూ వుంటారు.

ఏది అభ్యసించవలెనో నిర్ణయించుకోలేని వారికి యావత్తు సహాయం చేయబడుతుంది. పదవ తరగతి పిల్లలకొరకు గొప్పశాస్త్ర వేత్తలు, కళాశాలాధ్యాపకులు, నటకులు మున్నగు వారిచే ఉపన్యాసములు యేర్పాటుచేయబడతాయి. వైద్యులు, ఇంజనీర్లు, అధ్యాపకులు, వాస్తు శాస్త్రనిపుణులు తమతమ వృత్తి జీవితాలలోని వెలుగునీడలు, కష్టసుఖములు, మధుర అనుభవాలను కండ్లకు కట్టినట్లుగా వర్ణిస్తారు. వీటివలన సోవియట్ విద్యార్థులు అందుబాటులోనున్న అనంతసావకాశములలోనుండి తమ అభిరుచిననుసరించి వృత్తిని యెన్నుకుంటారు.

విమానములను నడుపుట, బాగుచేయుటయందు విద్యార్థులకు యీ మధ్య అపరిమితమైన ఆసక్తి కలిగింది. విశాల సోవియట్ దేశంలో మూలమూలప్రాంతాల భూగర్భములలోనున్న నిగూఢ అమూల్య ఖనిజ సంపదలను వెలుగులోకి తీసికొనివచ్చి, దేశసంపద నభివృద్ధి చేయు సావకాశమిచ్చే భూగర్భ తత్వశాస్త్రము విద్యార్థుల అభిమానమును చూరగొన్నది. నూతన బాటలను నిర్మాణం చేయవలయుననే కుతూహలం అనేకులను రోడ్డు ఇంజనీరింగు చదువులకు ఆకర్షించింది. నేటివరకూ నివాసయోగ్యముగా లేని పట్టణాలస్థానే, సర్వసౌఖ్యములకు ఆకరమైన ఆకర్షణీయము, ఆరోగ్యవంతమూ అయిన పట్టణాలను కట్టవలయుననే ప్రబలవాంఛ అనేకులను భవన నిర్మాణ శాస్త్రాభ్యాసకులనుగా చేసింది. అడవి ప్రాంతాలలో కొత్తరైల్వే లైనులు, పారిశ్రామిక పట్టణాలు, వంతెనలు. కొత్తగా వివిధ ఇంజనీరింగు శాఖలనభ్యసించివచ్చిన వారిచే నిర్మింప బడుతున్నాయి.

కొలది సంవత్సరముల క్రితంవరకూ, వైద్య, అధ్యాపక కళాశాలలు విద్యార్థులను తగినంతగా ఆకర్షించలేదు. కాని, ఆ వృత్తులలో తరిఫీదు పొందినవారికి కలుగచేయబడిన అనేక సౌకర్యములు, హెచ్చువేతనములు, సంఘములో వారికి ప్రత్యేకముగా చూపబడే గౌరవం, నేడు ఆకొరతను తీర్చాయి. కొద్దిసంవత్సరాలలో నిపుణులుకాని కార్మికులు సోవియట్ దేశంలో కనపడరేమోనని, తోస్తోంది. కాని సోవియట్ నాయకులు యీ గడ్డు సమస్యను, సరళంగా పరిష్కరించ జాలకపోరు. యంత్రాలు. మానవునిబానిసలనీ,మానవుని దుర్భరశ్రమకు లోనుగాకుండా, సాధ్యమైనంత వరకు ఉపయోగిస్తాయనే పరమసత్యాన్ని విరివిరిగా ప్రచారం సల్పుతూ వుంటారు.

కొలది సంవత్సరాలలో పదిసంవత్సరాల చదువు నిర్బంధం చేయబడుతుంది. ఇంతవరకు బాలబాలికలకు ఎనిమిదినుండి పదునైదు సంవత్సరాలవరకూ ఏడుసంవత్సరముల నిర్బంధ విద్యావిధానం అమలులో వుంది. ఏడవతరగతి పూర్తి చేసిన తర్వాత విద్యార్థి ప్రత్యేకవిషయిక విద్యగరుపబడే విద్యాలయాలలో ఎనిమిది, తొమ్మిది, పది తరగతులను చదువుకొనవచ్చును. లేదా, ఏదైనా వృత్తిశిక్షణాలయంలోజేరి, పూర్తిచేసిన పిమ్మట సంపాదనకు ప్రారంభించవచ్చును. వృత్తిశిక్షణాలయంలో చదివే రోజులలో నెలసరి స్టయిఫెండు లిస్తారు.

ఏడవతరగతి పూర్తియగుటతోనే, పనిలో ప్రవేశించదలచిన బాల బాలికలకు పనిచేసుకునే స్వాతంత్ర్యంవుంది. కాని వారిని పనిలోనికి తీసికొనే యంత్రాగారములుగాని, కళామందిరములుగాని, వారికొక సంవత్సరకాలం శిక్షణయిస్తారు. ఆంగ్లము, ఫిన్నిషుభాషలు వచ్చిన మావిద్యార్థిని మాస్కోలోని ఒక పెద్దషాపులో వస్తువులమ్మేందుకు వెళ్ళింది. ఆషాపుకు విదేశస్థులు అధికంగా వెడుతూంటారు కనుక, ఆమె పరభాషాజ్ఞానం వారికి అమూల్యంగాతోచింది.

సాయంకాలపు బడులలోనికి శ్రద్ధవుండి నేర్చుకొనగోరువారు, సంవత్సరంలో యేసమయంలోనైనా చేరవచ్చును. తమ వృత్తులను మార్చుకొనదలచినవారు, వృత్తిలో ఉన్నతవిద్య, నైపుణ్యం అభ్యసింప దలచినవారుకూడా యీ తరగతులకు హాజరయి పట్టములను, యోగ్యతా పత్రములను పొందవచ్చును. అసాధారణ ప్రజ్ఞను చూపినకార్మికులను, నెలసరిజీత మిస్తూనే, కళాశాలలకు పంపుతారు.

పదవతరగతి పరీక్షలో ప్రధాన విషయాలలో 'ఉత్తమం' మార్కులు, ఆటలు, సంగీతము, చిత్రలేఖనం మున్నగు విషయాలలో 'మంచి' మార్కులువస్తే, ప్రవేశపరీక్షకు హాజరవకుండానే, విద్యార్థులు విశ్వవిద్యాలయాల్లో జేరవచ్చును. తక్కువ మార్కులు వచ్చిన విద్యార్థులు ప్రవేశపరీక్షకు, హాజరయి నిర్ణీత ప్రమాణపు మార్కులను తెచ్చుకున్నచో, విశ్వవిద్యాలయాలలో స్థానంలభిస్తుంది. విశ్వవిద్యాలయ విద్యార్థులకు ఉచిత వేతనాలు (స్టయిఫెండు) యిస్తారు. పై పట్టణాల నుండి వచ్చువారికి వసతిగృహాలలోకూడ స్థానమిస్తారు.

మా విద్యార్థులలో అధికభాగం పదవతరగతివరకూ చదివేందుకు వెళ్ళారు. కొద్దిమంది సాంకేతిక శిక్షణాలయాలకూ, మరికొద్దిమంది ఏడవ తరగతి పూర్తిచేసినతరువాత పనులకూవెళ్ళారు. కాని అందరూ సాయంకాలపు తరగతులలో ఉన్నత విద్యాభ్యాసం చేస్తూనే వున్నారు.

సోవియట్ విద్యార్థులు వారికి ఆసక్తివున్న శాస్త్రములను, కళలను అభ్యసించేందుకు పూనుకుంటారు కనుక, యెక్కువశ్రద్ధతో కృషిచేసి, మంచి జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని పొందగలుగుతారు. వృత్తి, ఉన్నతవిద్యా శాఖలను యెన్నుకొనడంలో పొరపాటు చేసినట్లు తెలుసుకున్న విద్యార్థి వెంటనే మార్చుకొని, అభిరుచి, అభినివేశం వున్న విద్యనే అభ్యసించ వచ్చును. సోవియట్ సమ్మేళనంలో విద్యార్థులకు కలుగజేయబడిన

యీ అమూల్యావకాశమూ, నిరుద్యోగ భారంతో క్రుంగనక్కరలేదనే ధీమా, భావి జీవిత భద్రతల వలననే, సోవియట్ బాలబాలికల ముఖములు సంతోషంతో, సంతృప్తితో, నిర్విచారంగా కలకలలాడుతోవుంటాయి. ఉత్సాహం శ్రద్ధాభక్తులు కలిగించే పనులనే వారు చేస్తారు. సోవియట్ పౌరులకు కలుగజేయబడిన సౌకర్యాలను అనుభవిస్తున్నారు. సామాజికు లందరి ఉన్నతికి పాటుపడే సమాజాన్ని నిర్మిస్తున్నారు.

## కార్మిక సంఘం

సుమారు ఒక సంవత్సరం విద్యాలయంలో పనిచేసిన తర్వాత నన్ను విద్యాలయ కార్మిక సంఘంలోనికి యెన్నుకున్నారు. వెనుక చెప్పి నట్టుగానే, అందులోని సభ్యులందరినీ కార్మికసంఘం మాతృదేవతవలె సాకుతో, ప్రాపకం కల్పిస్తుంది. సంఘాధ్యక్షుడు సభ్యు లందరియెడల స్వయంగా శ్రద్ధతీసుకొని, ప్రతివారి శ్రేయస్సుకు, క్షేమానికి తోడ్పడుతూ ఉంటాడు.

సమిష్టి 'ఉత్పత్తి' సరిగా జరుగునట్లు చూచుట నా పని. కార్మిక సంఘ సభ్యులు ఉచితరీతిని తమ సాంఘిక విధులను నిర్వర్తించునట్లు ప్రోత్సహించాలి. కార్మికులు చేసికొనిన సోషలిస్టు నిర్ణయాలను, ప్రతిజ్ఞ లను విజయవంతంగా నెరవేర్చుటకు సహాయపడాలి. నెలకొక పర్యాయం సంఘ సమావేశంలోను, అప్పుడప్పుడు జరిగే సాధారణ సభ్య సమావేశా ల్లోనూ, నేను చేసినపని వివేదికను సమర్పించాలి. కొన్ని ప్రతిజ్ఞలను నెరవేర్చుట చాల కష్టసాధ్యమైనపని. నమూనాకు ఒక ప్రతిజ్ఞను ఉదహ రిస్తాను.

'ఈ క్రింద నుదహరించిన అంశములను యీ టరమ్‌లోగా పూర్తి చేస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

1. తక్కువ మార్కులు రాకుండా చేసుకుంటాను.

2. ప్రతిపాఠం క్షుణ్ణంగా చదువుతాను.

3. వెనుకబడిన విద్యార్థి, విద్యార్థినులకు వెన్వెంటనే తోడ్పడుతూ ఉంటాను.

4. ఆదర్శప్రాయమైన నోటు పుస్తకాలను తయారుచేస్తాను.

సంతకం...........'

ఇట్టి ప్రతిజ్ఞల విషయంలో సరియైన కృషి జరుగుతోన్నదీ, లేనిదీ, చూచేందుకు, నోటు పుస్తకాలు, విద్యార్థుల గుణముల పుస్తకాలు, ఉపాధ్యాయుల వారబోధనాంశ పుస్తకములను పరీక్షించాలి. సోషలిస్టు నిర్ణయాలు, ప్రతిజ్ఞలు అత్యమితముగా ఉన్నందున అవ్వి సక్రమంగా కొనసాగునట్లు తోడ్పడుట కొక ఉచితవిధానాన్ని అమలుజరుప నారంభించాను. ఉపాధ్యాయుల గదిలో ఒక 'పట్టిక' ను వ్రేలాడ గట్టాను. ఆ పట్టికపై బోధకులే వారమున కొక పర్యాయం వారెంత అభివృద్ధిని చూపినదీ చూపవలయును. ఈ పట్టికల మూలమున సమిష్టిలోని ప్రతి ఒక్క బోధకుడూ యేస్థాన మాక్రమించేదీ స్పష్టంగా తెలుస్తుంది. పట్టికలో క్రింది స్థానంలో యెవ్వరూ వుండకోరరు కనుక అందరూ ఎక్కువ కృషిచేసి పైస్థానంలో ఉండేందుకు ఉత్సుకులు ఔతారు.

విద్యాలయ నిర్వహణ, ప్రతి ఉపాధ్యాయుని కార్యాచరణ విధానాలనుగూర్చి సమగ్రంగా తెలుసుకోగలిగిన యీ రికమైన సాంఘికసేవా విధానమందు నాకు అపరిమితమైనశ్రద్ధకలిగింది. తరగతిగదుల పరిశుభ్రత సుద్దముక్కల సక్రమ సరఫరా, సిరాబుడ్లనిండా సిరా, నల్లబల్ల శుభ్రత, గంటలు కొట్టుట మున్నగు పనులు సకాలంలో సక్రమంగా చేయబడుతోన్నదీ, లేనిదీకూడా నేను అజమాయిషీ చేయవలసియున్నది. నాపని నన్ను వంటశాలలోనికికూడా కొనిపోయేది. పాఠములు చెప్పని ఉపాధ్యాయులుకూడా, మాసిక సమావేశాలలో అత్యంత శ్రద్ధ తీసుకొనేవారు.

కార్యనిర్వాహకసంఘంలోనికి నేను యెన్నుకొనబడిన కొద్ది మాసములతర్వాత అధ్యక్షురాలు విద్యాలయం వదలి వెళ్ళిపోయినందున, నన్ను ఆ స్థానంలోనికి తీసుకున్నారు. 'మాతృదేవత'వలె నేను వ్యవహరించటం ఇకమీదట నావంతు. ఈ స్థానమునకు నే నసర్హురాలనని ముందు నేను సంకోచించాను. కాని, క్రొత్త అనుభవం సంపాదించాలనే ఉత్సాహంతో ఈ భారాన్ని శిరసావహించాను వెడలిపోయేముందు మాఅధ్యక్షురాలు నన్ను జిల్లా కార్మికసంఘాధ్యక్షునివద్దకు కొనిపోయి పరిచయం చేసింది. ఆయన నాకన్నివిధాలా తోడ్పడతాననే వాగ్దానం చేశాడు. జిల్లా కార్మికసంఘ కార్యాలయం మా విద్యాలయానికి సమీపంలోనే ఉన్నందున, నాకు యెక్కువధైర్యం కలిగింది. నగర కేంద్రసామీప్యంలో ఉన్న రాష్ట్ర కార్మికసంఘ కార్యాలయానికికూడా మా పాత అధ్యక్షురాలు నన్ను కొనిపోయి అత్యంత స్నేహపాత్రురాలైన ఒకామెతో పరిచయం కల్పించింది.

ఆమెతో నాకు అచిరకాలంలోనే గాఢమైన మైత్రి కలిగింది. తాను విరక్షరాస్యురాలైన ఒక కుగ్రామవాసిననీ, సోవియట్ల ప్రభుత్వం వచ్చిన తర్వాత విద్యాసముపార్జన చేసి, ఉపాధ్యాయుల కార్మికసంఘంలో ప్రముఖస్థాన మాక్రమించుకోగల్గానని ఆమె స్వీయచరిత్రను కొంతకాలం పోయిన తర్వాత చెప్పింది.

సోవియట్ సమ్మేళనంలో వృత్తులమీద ఆధారపడి కార్మిసంఘాలు నిర్మింపబడతాయి. ప్రతిసంస్థకు ఒక ప్రాంతీయ సంఘముంటుంది. ఆసంస్థనుండి జీతములు పుచ్చుకునే ప్రతి కార్మికుడూ ఆప్రాంతీయ సంఘంలో సభ్యుడే. మా విద్యాలయంలో పనిచేసే, ఉపాధ్యాయులు, ఊడ్చేవారూ, గుమాస్తాలూ, గంటలు మ్రోగించేవారూ చేసే పని వివక్షత లేకుండా యావన్మందీ ప్రాథమిక, ఉన్నత పాఠశాలా కార్మికసంఘంలో సభ్యులే; ప్రాంతీయసంఘంలో అందరికీ ఓట్లు ఉన్నాయి. అందరూ ఎన్నికలలో స్థానాలకు పోటీచేయవచ్చును.

మా విద్యాలయం చాలా చిన్నది కనుక మా కార్యనిర్వాహక సంఘంలో అధ్యక్షుడు, సంస్కృతి సభ్యుడు, కార్యదర్శులు మాత్రమే ఉన్నారు. కార్యదర్శి సమిష్టియొక్క ఉత్పత్తిని తనిఖీచేయాలి. సంఘంయొక్క అనుమతిపైన, వీరిలో యెవ్వరైనా తమవిధులను నెరవేర్చుటకు ఇతర సభ్యులకెవ్వరికైన అధికారమీయవచ్చును. నేను అధ్యక్షురాలినిగా ఉన్నకాలంలో ఒక రష్యను ఉపాధ్యాయిని, సంస్కృతి సభ్యురాలుగాను, ఒక పరిశుభ్రకురాలు కార్యదర్శినిగాను ఉండేవారు.

సంస్కృతి సభ్యురాలి కార్యరంగము బహు విశాలమైనది. చదువు కావలెనువారికి సౌకర్యములను కల్గించుట ఆమె చేయవలసిన పనులలో ప్రధానమైనది. మాకు అనేకతరగతులుండేవి. ఇంగ్లీషు అమెరికను ఉపాధ్యాయినులు రష్యనుభాష, రష్యను ఉపాధ్యాయినులు ఇంగ్లీషు, కొలదిగా చదువుకొన్న సమిష్టిసభ్యులు రష్యను, గణితశాస్త్రములను, మరికొందరు ప్రాథమిక చికిత్సను, ఇంకా కొందరు జిల్లా ఆటలసంఘంలోను అభ్యసించేవారు. వినోద ఉల్లాసాలను కల్పించుటకు సౌకర్యాలను ఏర్పరుచుట రెండవవిధి. రష్యాప్రజలందరివలెనే, మా సభ్యులుకూడా నాట్యకళయందు అసమానమైన అభిరుచి చూపుతారు. మాస్కో నాటకశాలలకు టిక్కెట్లు దొరుకుటచాలాకష్టం. అందువలన మాసంస్కృతి సభ్యురాలు మాకొరకు టిక్కెట్లను సంపాదించాలి. జిల్లా కార్మికసంఘంవారి అనుమతిపైన

ఆమె ఒక ప్రత్యేక నాటకశాలకు టిక్కెట్లను అమ్మేపనిలో జేయటవలన, మాకు కావలసిన టిక్కెట్లు చాలభాగం లభ్యమయ్యేవి. సినీమాలకు, రంగ స్థలములకు, మ్యూజియములకు ఆమె మమ్ముల నందరినీ తోడ్కొని పోయి రోమ్యోజూలియెట్, సంపెంగతోట, ఇన్స్పెక్టర్ జనరల్ మున్నగు అమూల్య నాటకప్రదర్శనములను చూచే మహద్భాగ్యం కలుగజేసింది.

సంస్కృతి సభ్యురాలు చేయవలసిన మరొక ముఖ్యకార్యం, ప్రతి వారిని పత్రికలు చదువునట్లు ప్రోత్సహించుట. జాతీయ అంతర్జాతీయ పరి స్థితులను తెలుసుకొనునట్లు చేయుట. వివిధ సారస్వతాంగములపైన వ్రాయబడిన ఉద్గ్రంథములను చదువరులకు విద్యాలయ గ్రంథాలయములో గాని, సార్వజనీన గ్రంథాలయములలోగాని లభ్యమగునట్లు చేయుట. సారస్వతం, టిక్కెట్ల విషయంలో ఆమెకు యిద్దరు సహాయకారిణుల తోడ్పాటుకలదు. సంవత్సరాంతమున జరుగు వార్షిక సమావేశంలో ఆమె చేసిన సేవ అపారంగా ప్రశంసించబడింది. ఆమెను 'ఉదార్నిక్' (గొప్ప సేవకురాలు)గా గౌరవించి, ఆమె అమలుజరిపిన పద్ధతులను ఆదర్శ ప్రాయంగా స్వీకరించారు.

నెలకు రెండు పర్యాయములు కార్మికసంఘ సమావేశములు జరుగు తాయి. మా సమావేశములకు హాజరవగోరువారికందరికి మేము స్వాగత మిచ్చేవారము. మా సంభాషణలలో పాల్గొని మాకు ఆదర్శప్రాయములైన సూచనలిచ్చేందుకు సావకాశం కల్పించుటేకాక, కృతజ్ఞతతో స్వీకరించే వారము. విద్యాలయంయొక్క ఆదాయవ్యయములు, సాంస్కృతిక కార్య ములు విధులను నిర్వర్తించుటలో వెనుకబడినవారు, శెలవు దినముల కార్యక్రమం మొదలైనవి చర్చనీయాంశములు.

సంఘసేవ చేయగోరువారికి వారి అభిరుచి శక్తిసామర్థ్యములకు అనుగుణ్యమైన పనిని యెన్నుకొనుటయందు కార్మికసంఘం తోడ్పడు తుంది. సంఘసేవ అనేకరకాలు — గోడవార్తాపత్రికా ప్రచురణము, సంపాదకవర్గంలో సభ్యులుగా నుండుట, నెలసరి చందాలను వసూలు చేయుట, వార్తాపత్రికలను జాగ్రత్తచేయుట, ఉపాధ్యాయినులలో ఆంగ్లము రానివారికి ఆంగ్లము, రష్యనుభాష రానివారికి రష్యనుభాషగాని మరేభాష గాని వచ్చినవారు నేర్పుట మున్నగు పనులు అపారంగా వుంటాయి. మా ఉపాధ్యాయినులలో ఒకరు చిన్నపిల్లల గ్రంథాలయంలో పుస్తకము

లకు వరుస చీట్లు అంటించుట. పుస్తకములకు కొత్త అట్టలు వేయుట మొదలైన అనేకపనులలో గ్రంథాలయాధికారికి తోడ్పడుతూ వుండేవారు.

నేను అధ్యక్షురాలిగా వున్న సంవత్సరకాలంలో కార్మికసంఘ సభ్యులకు అనేకవిధములుగా సహాయంచేశాను. ఒక సేవకురాలి శిశువును శిశు సంరక్షణాలయంలో జేర్చుట, శెలవుదినములను విశ్రాంతిగృహములలో గడుపుటకు ఉపాధ్యాయినులకు అనుజ్ఞాపత్రములను తెచ్చుట, ఒకసోదరికి ఒక గదిని కుదుర్చుట (మాస్కోలో గది దొరుకుట మహాకష్టసాధ్యం) మాతో పనిచేసే తోడిసేవకుల కష్టసుఖములను ఓర్పుతో విని సహాయ పడుచుండుట మున్నగు పనులను చేసెడిదానను.

మే, నవంబరు శెలవులలో కార్మిక సంఘం విందులు చేసేవారు. మహిళా దినోత్సవమైన మార్చి 8 తేదీనాడు ప్రత్యేక విందు జరుగుతుంది. సంవత్సరాది మొదలైన ఉత్సవ సమయాల్లో యితర విద్యాసంస్థలతో కలిసి, విందులు చేచేవారం. ప్రాముఖ్యమైన దూర ప్రదేశాలకు పోయే వారము.

ప్రాంతీయ విద్యాలయ సంఘముల అధ్యక్షులు పాల్గొనే జిల్లాసంఘ సమావేశాలలో చాలా ముఖ్యమైన విషయాలపై చర్చలు జరుపుతారు. వారి వారి అనుభవాలను పోల్చి చూచుకొని, అభివృద్ధి సూచనలను చేస్తారు.

జిల్లా సంఘాధ్యక్షునితో సకాలంలో సమావేశములు ప్రారంభింప బడకపోవడాన్ని గూర్చి తరుచుగా నేరారోపణ చేసెడిదానను. ప్రతి సమావేశము నిర్ణీత సమయమునకు గంట, గంటన్నర ఆలస్యముగా జరిగేది. నే నెప్పుడూ సకాలంలోవచ్చి, ముఖ్యంగా ఉపాధ్యాయులు యీ విధంగా జాగు చేయరాదని పదే పదే చెప్పేదానను. పాఠశాలలకు గాని, తరగతులకు గాని యెన్నడూ ఆలస్యముగాపోరు కాన అవసరమని తోచినచోట వారు సకాలమునకు హాజరవగలరు. నాకొచ్చిన కొలది రష్యను భాషతో యీ విషయం చెప్పిన సమావేశానంతరం జరిగిన సభలలో పది పదిహేను నిమిషములకంటె ఆలస్యం జరిగేదికాదు. ఒక సమావేశానికి తప్పనిసరి పని యుండుటవలన, నేను ఐదు నిముషములు ఆలస్యంగా వెడితే, అన్ని మూలలనుండి సహృదయ పూర్వకమైన విమర్శనా బాణములు నాపైకి గుప్పింపబడ్డాయి.

ఉపాధ్యాయ కార్మికసంఘం వివిధ విద్యాసంస్థలలోని ఉపాధ్యాయులను ఒకచోటికి సమీకరించేది. ఏదో ఒకజిల్లా విద్యాలయంలో మూడు మాసముల కొకపర్యాయం జిల్లాలోని సాధారణసభ్యుల సమావేశం జరిగేది. జిల్లాలోని మంచి ఉపాధ్యాయుల కందరకు గొప్పవిందు యేర్పాటు చేస్తారు. ఈ విందులు రష్యను సాంప్రదాయానుసారం జరుపబడతాయి. టీ బల్లచుట్టూ అందరూ కూర్చుంటారు. అందులో కొందరు గాని అందరూ గాని రసవత్తరమైన జానపద గీతాన్ని పాడుతారు. ఒకరు గేయాన్ని ఆలాపన పూర్వకంగా గొంతెత్తి పాడుతోంటే మిగతావారు పల్లవిని అందుకుంటారు. నూతన రాజకీయ గీతాలు, ప్రేమ గేయాలు రాగయుక్తంగా పాడుతారు. అప్పటి కప్పుడు కవన మల్లుతారు. విందు ముగిసిన వెంటనే వాయిద్యములు మొదలు పెడతారు. ఒక్క నిముషములో హాలంతా నృత్యంచేసే జంటలతో ఆనంద ధామంగా మారిపోతుంది.

వేసంగిలో, ఒక నౌకను కుదుర్చుకొని, అందరం మాస్కోనదిలో వినోదయాత్ర సాగించేవాళ్ళం. నదివొడ్డున మకాంచేసి, గంటల తరబడి నదిలో స్నానంచేసి, కొంతసేపు విశ్రమించి, జూన్‌నెల రాత్రులలో తిరిగి యింటికి చేరుకునేవాళ్ళం. మాస్కోకు దగ్గరగావున్న అడవులలోనికి రైలుమీద విహారమునకుపోయి, నదిమీద రామణీయక ప్రదేశములకు పోయి ఆటలు ఆడి, పాటలు పాడి, అత్యంత సంతోష ప్రదంగా శెలవు దినములను ఆట విడుపు దినములను గడిపేవారము.

అప్పుడపుడు ఉద్యోగస్థులకును, కార్మిక సంఘ సభ్యులకును మధ్య కలిగే తగాదాలను కార్మికసంఘం తీర్చవలసి వచ్చేది. మా విద్యాలయంలో అసంతృప్తికరమైన పనికిగాను ఒకటి రెండు పర్యాయాలు ఒక ఉపాధ్యాయుడు ప్రిన్సిపాలుచే వ్రాతమూలకంగా హెచ్చరింప బడ్డాడు. ఆ ఉపాధ్యాయుడు తన కన్యాయం జరిగిందని యెంచి, కార్మికసంఘం యెదుట విచారణకు తెచ్చాడు. ఆ ఉపాధ్యాయ, ప్రిన్సిపాలుల వాదాలను విని. వారి యెదుటనే చర్చించి కార్మిక సంఘం తమ నిర్ణయాన్ని ఒక తీర్మాన రూపంలో పెట్టాలి. ఆనిర్ణయంతో ప్రిన్సిపాలు ఏకీభవించనిచో, జిల్లా విద్యాలయ సంఘానికి అంత్య నిర్ణయానికి పంపబడుతుంది.

ప్రాంతీయ, జిల్లాసంఘ వార్షిక సమావేశాలలో నూతన అధ్యక్షుని యెన్నికల అనంతరం, పాత అధ్యక్షుడు తన అధ్యక్ష పదవీకాలంలో

జరిగిన పనినిగూర్చి సమగ్రమైన సమీక్షచేస్తాడు. ఆ నివేదికను సభ్యులు పూర్తిగా చర్చించి లోపాలను సవరించు కునేందుకు నిర్మాణాత్మకమైన సూచన లిస్తారు. నేను రెండవ సంవత్సరం అధ్యక్షపదవికి పోటీ చేసేందుకు వీలు లేనందున నన్ను సూపర్ వైజరుగా నియమించారు.

కార్మికులయొక్క, అధికారులయొక్క స్థితిగతులను అభివృద్ధిచేసి, వారిద్దరమధ్య సహకారం పెంపొందజేయడమే ప్రధానాశయంగాగల సోవియట్ కార్మిక సంఘాలలో నాకుగల అనుభవం నా నూతన పదవిలో నాకపరిమితంగా తోడ్పడింది.

## ఉపాధ్యాయుని శెలవుదినము

ప్రతి సోవియట్ ఉపాధ్యాయునకు వేసంగిలో జీతంపైన రెండు మాసముల సెలవులుంటాయి. ఆ శెలవులను లాభకరంగా ఉపయోగించుకునేందుకు కార్మికసంఘం ఉపాధ్యాయులకు సర్వవిధముల తోడ్పడుతుంది. ఇంటివద్ద గడిపివేసిన శెలవుదినాన్ని సోవియట్ కార్మికుడు వాస్తవమైన శెలవుక్రింద పరిగణింపడు. విశ్రాంతి గృహాలకో, దూరస్థ రామణీయక ప్రదేశాలకో, సముద్ర ప్రాంతాలకో, చారిత్రక స్థలాలకో వెడుతూంటారు.

1935 వేసంగిలో నేను మరొక ఉపాధ్యాయిని కలిసి శెలవు దినములు గడుప నిశ్చయించుకున్నాము. సాధ్యమైనంతవరకు సోవియట్ రష్యాను చూడవలయునని మా కోరిక. కాకసను పర్వతాల సౌందర్య గాథలు మమ్ముల నాకర్షించాయి.

ముందు మా కార్మికసంఘ అధ్యక్షురాలితో మా విషయమై సంప్రదించగా, శ్రామిక ప్రయాణ సంఘంలోని స్పెషలిస్టువద్దకు ఆమె మా యిద్దరిని పంపింది.

శ్రామిక ప్రయాణసంఘ కార్యాలయం నిండా వివిధప్రాంతములకు ఉన్న ప్రయాణ సౌకర్యములను గూర్చిన అచ్చుకాగితములు అంటించి వున్నాయి. అర్ధ చంద్రాకారంగావున్న మేజాబల్లముందు కూర్చుని కొందరు వివిధ ప్రాంతములనుగూర్చిన అంశములనుగూర్చి పుస్తకములలో వ్రాసుకుంటున్నారు. ఒక చివర సలహాదారు కొందరు యువకులతో సంభాషిస్తున్నాడు. కామానదిమీద స్టీమరులో ప్రయాణంసాగిస్తే బాగుంటుందా, కాకసస్‌లోని శ్వానీషియకా పర్వతములకు కాలినడకను వెళ్లుట

ఆనందప్రదంగా వుంటుందా అనే విషయాన్నిగూర్చి వారు సంప్ర దిస్తున్నారు.

ఆ విద్యార్థియువకుల సంభాషణానంతరం అదే మా ప్రథమ శెలవు యాత్ర కాన సాధ్యమైనంత హెచ్చుదేశాన్ని చూడవలయుననే మా సంకల్పమును సలహాదారుతో చెప్పాము.

ఒక సోవియట్ దేశపటమును మా ముందుపరచి "వోల్గా నది మీద నౌకాయానం చాలా అద్భుతంగా వుంటుంది. గోర్కీనుంచి స్టాలిన్ గ్రాడ్‌వరకు నౌకమీద, అచ్చటనుండి సోచీవరకు రైలుమీద ప్రయాణం చేసి, అక్కడవున్న మా వసతిగృహంలో మకాం చేయవచ్చును. ఆ ప్రాంతం ఆనందదాయకంగావుంటే 10 రోజులు వుండేందుకు అనుజ్ఞా పత్రం తీసుకొనవచ్చును. లేదా డినీపరు నదిమీద క్రిమియావరకూ వెళ్ళ వచ్చును, ఆ ప్రాంతంకూడా సౌందర్యవంతంగా వుంటుంది" అని సలహా యిచ్చాడు.

వోల్గా ప్రయాణం స్థిరపరచాం. ఆ క్షణాన్నే రెండు టిక్కెట్లు, సోచీలో ఉండేందుకు పదిరోజుల అనుజ్ఞా పత్రములను కొనివేశాం, దక్షిణ రష్యాయాత్రమాట తలుచుకుంటే అత్యంత ఉత్సాహ ఉల్లాసాలతో మా ఒడలు జలదరిస్తోంది. అదీకాక, మా భాషరాని ప్రాంతాల్లో పెద్ద ప్రయాణంసాగించే సాహసకృత్యం చేయడానికి అదే మాకు ప్రథమ పర్యాయం.

జూన్‌మాసపు ప్రథమదివసాల్లో ఒక అపరాహ్ణ సమయాన మాస్కో నుండి ధూమశకటంమీద గోర్కీకి బయల్దేరాం. మరుసటి ఉదయానికి గోర్కీ జేరుకున్నాం. వోల్గామీద నౌకలు ఆ సాయంకాలంగాని ప్రయాణం సాగించవుగాన మా సామాన్లను నౌకవద్దపెట్టి పట్టణం చూచేందుకు బయల్దేరాం.

వంకరలు తిరిగి యెత్తుప్రదేశాన్ని చీల్చి గట్లను ఒరుసుకొని ఓల్గా నది ప్రవహిస్తోన్నది. గట్టుమీద గోర్కీ పట్టణంలో కొంతభాగంవుంది. ఈ భాగంలో పాత, కొత్త కట్టడాలున్నాయి. ఈ ప్రాంతం విప్లవాత్పూర్వ విప్లవానంతర రష్యను పరిస్థితులయొక్క చిత్రపటంవలె వున్నది. ప్రయా ణీకుల ఫలహార శాలకువెళ్ళి మేనేజరును కొద్దికాలంలో గోర్కీ పట్టణాన్ని చూచేవిధానం చెప్పవలసిందని కోరాము. ఆయన మాకు త్రాగేందుకు ఖనిజపు జలాన్ని యిచ్చి పట్టణంలో కొన్ని ప్రదేశాలను చూపించుటకు

స్వంత కారులోనే మమ్ములను కొనిపోయారు. ఆ పట్టణంలోని సుందర ప్రదేశాలను చూపారు. అత్యంత సుందరమైన గోర్కీ చలనచిత్ర భవనము యింకను అనేక ప్రకృతి రామణీయక దృశ్యములనుచూచి, వోల్గా నది గట్టుమీద విసురుగా కారును నడుపుతూ ఓకా, ఓల్గానదుల సంగమ స్థలాన్ని దాటి, ఆరుగంటలకు పడవలరేవు జేరుకున్నాము.

మా ప్రయాణం పొడుగునా, హోటలు యజమాని చూపిన ఆదరాభిమానాలనే మాకు రష్యనులు చూపారు.

నౌకా పరిభాగంమీద ఒక గది మాకు యిచ్చారు. ఆ గది చిన్నదైనా మిగుల సౌకర్యంగావుంది. మా గది కిటికీగుండా ఆకసాన్ని కొంతవరకూ కప్పిన యెత్తైన నది కుడిగట్టు, చదునుగావుండి, తరు లతాదులచే ఆవరింపబడిన యెదరుగట్టు కాన్పిస్తున్నాయి. అంత విశాలమైన నదిమీద అంతకు పూర్వం నేను ప్రయాణం చేసియుండలేదు. నది జన్మస్థలంనుండి 3,000 కిలో మీటర్ల దూరంలోనే యింత విశాలంగావుంటే యింకా దిగువలో యెంత వెడల్పుగా వుంటుందోనని వెరగందసాగేను.

మా నౌక గోర్కీనివదలి వొయ్యారంగా వూగుతో నీటిని చీలుస్తూ రంయ్యమని ముందుకు సాగింది. అస్తభానుడు స్వర్ణ కిరణజాలంతో బంగారు మలామా తూచేస్తోన్న సమయంలో మా తోటి ప్రయాణీకులతో సల్లాపాలారంభించాం. బాకూ మున్నగు పట్టణాలలో గాన కచ్చేరీలు చేసేందుకు వెడుతోన్న నలుగురు గాయకులతో మాకు పరిచయమైంది. మేం కలిసివున్న అయిదురోజులలోను వారితో రష్యను సంగీతాన్నిగూర్చి, గాన కళనుగూర్చి సంభాషణలు జరిగాయి. వారు వెళ్లేముందు, లెనిన్‌గ్రాడులో తమ గాన కచ్చేరీలకు రావలసిందని ఆహ్వానించారు.

మా నౌకలో మాతోబాటు బొమ్మలఆట ముఠావారు ప్రయాణం చేస్తోన్నారు. ప్రయాణీకులయెదుట ఒక ఆట ఆడారు. పిల్లల విశ్రాంతి గృహాలలోనూ, ఆరోగ్య రక్షణ స్థానాలలోనూ ఆటలు ఆడేందుకు వారు ఒక దక్షిణాది పట్టణానికి వెడుతున్నారు. మా ప్రయాణం ఇంకా యితరుల సహవాసంలో ఖులాసాగా సాగింది. జూకా, క్యూబిషేవ్, స్టాలిన్‌గ్రాడుల వద్ద పట్టణాలను చూచేందుకు కొద్ది గంటల కాలం మా నౌకను ఆపేవారు.

చిన్న మకాములవద్ద, పండ్లను కొనుక్కునేందుకు, పెద్ద పట్టణాలలో బజార్లను, కట్టడాలను చూచేందుకు వెళ్ళేవారము. ప్రతిచోట

వీధులు, కొట్లు ప్రజలయొక్క పరిశుభ్రత, స్త్రీ పురుషుల రంగు రంగుల నూతన వస్త్రాలు మా దృష్టిని ఆకర్షించేవి.

పల్లెటి గ్రామ మకాములవద్ద, పట్టణాలకువెళ్ళి గ్రామఫోను, ఫిడేలు, సైకిలు మున్నగు వస్తువులను కొనుక్కొని వచ్చిన రైతులు దిగేవారు. కొందరు రైతులు పట్టణాలకు వెళ్ళేవారు.

" ఈ రైతులందరూ మంచి బట్టలు వేసుకోలే దెందుచేత, అని మీరు ఆశ్చర్యపడుతున్నారు కదూ ? ఔను, నిజమే. ఇంకా మా పల్లెటూళ్ళలో అన్ని సామాన్లు సమృద్ధిగా దొరకడంలేదు. అందుచేత మా గ్రామస్థులు కావలసిన వస్తువులకోసం పట్టణాలకు వెళ్ళాలి. మా సమిష్టి వ్యవసాయదార్లుకూడా సిల్కు బట్టలు కట్టుకునే రోజులు చూస్తారు। ఇంక కొద్ది రోజుల్లోనే పట్టణాలకీ, పల్లెలకీ మధ్యనుండే విభేదం సమసిపోతుంది. వ్యవసాయం కూడా మంచి పద్ధతులమీద జరుగుతోంది. ప్రతి సమిష్టి వ్యవసాయకుడూ త్వరలోనే సంపదలతో తులతూగుతాడు ! " అని ఒకరు మాతో అన్నారు.

గోర్కీని వదలిన ఆరవరోజు ఉదయానికి స్టాలిన్‌గ్రాడు నగరం వచ్చింది. మా ప్రయాణంలో మొదటి గమ్యస్థానం స్టాలిన్‌గ్రాడు. ఓల్గానది మీద 2,000 కిలో మీటర్ల దూరం గత ఐదురోజులలోను ప్రయాణం చేశాం. మాతోటి ఆప్రయాణీకులవద్ద సెలవు పుచ్చుకొని, ఓడదిగి, స్టేషనుకువెళ్ళి మా సామాన్లుపెట్టి ట్రాక్టర్ల యంత్రాలయానికి ఒక ట్రాముకారుమీద వెళ్ళాము.

ట్రాక్టరు యంత్రాగారంచుట్టూ వరుసలు తీర్చికట్టిన అనేక అందమైన వీధులు ఉన్నాయి. గృహాలు చిన్నవైనా, పరిశుభ్రంగా, శోభాయమానంగా వున్నాయి. స్టాలిన్‌గ్రాడు చాలా అందమైన పట్టణం. భోజనం చేసి, అంత త్వరలోనే ఆ పట్టణాన్ని వదలిపెట్టి వెళ్ళేందుకు విచారిస్తోనే పదకొండు గంటలన్నర రైలుమీద సోచీకి వెళ్ళాం.

మా పెట్టెలో చాలమంది యెర్ర సైనికులు, ఒక రైతు ముసలమ్మ యెదతెరిపి లేకుండా సిగరెట్లు కాల్చే ఇరువది యెనిమిదేండ్ల వయస్సుగల మరొక పడుచు వున్నారు. క్రమంగా మే మందరమూ సంభాషణ ప్రారంభించాము. యథాప్రకారంగానే, ఇంగ్లండును గూర్చి అందరూ నన్ను ప్రశ్నించారు. ఆ ముసలమ్మ మా సంభాషణను చాల శ్రద్ధగా అలకిస్తో అకస్మాత్తుగా అందుకుంది.

"ఐతే, మీదేశంలో యింకా విప్లవం జరుగలేదు కదూ? చూడండి విప్లవం మాకెంత మేలు చేసిందో? నేను ఒక సమిష్టివ్యవసాయ క్షేత్రంలో పని చేస్తున్నాను నా పెద్దకొడుకు మరనాగలి నడుపుతున్నాడు. నా కూతురు పశువుల మందలను మేపేవారికి నాయకురాలు. నా రెండవకొడుకు మాస్కోలో వ్యవసాయ కళాశాలలో చదువుతున్నాడు. మా క్షేత్రమే ఆతణ్ణి పంపి చదివిస్తోంది. నా మనవళ్ళు మనమరాళ్ళు అందరూ చదువు కుంటున్నారు. నాకు అక్షరంముక్క రాదు. అయినా, యింత ముసలి తనంలో నాకు చదువేమి వస్తుంది. అప్పటికీ, చాలా ప్రయత్నించాను. జ్ఞాపకశక్తి బొత్తిగాలేదు. ఈ విషయం మాత్రం నిర్ధారణగా చెప్ప గలను. మా దేశంమీద యెవ్వరైనా దండెత్తుతే" పిడికిలి బిగించి పైకి యెత్తి "వారికి యెల్లా బుద్ధిచెప్పాలో మాదేశస్థులందరికీ బాగాతెలుసును" అని సగర్వంగా ఆమె చెప్పింది.

"బలే! బలే! తల్లీ! మాబాగా చెప్పావమ్మా!" అన్నారు యెర్ర సైనికులు.

యువతి మరొక సిగరెట్టు ముట్టించి క్షమార్పణ పూర్వకంగా ప్రారంభించింది. "సిగరెట్టు తాగకుండా ఉండలేనండీ! నాకు పదమూడేళ్ళ వయస్సులో అలవాటైంది. నేటివరకూ వదుల్చుకో లేకుండా ఉన్నాను. ఆ రోజుల్లో నేనొక దేశద్రిమ్మర్ని. ఇల్లు, వాకిలి లేవు. నా, అనేవారు లేరు. సత్రం భోజనం, మఠం నిద్రలాగు వుండేది నాపని. కొంతమంది చిన్నపిల్లలం ముఠాగా కలిసి, రైల్వే స్టేషన్లలో జేబులు, మూటలు కొట్టే పేవాళ్ళం. ఒక రోజున పోలీసులు పట్టుకుని సంస్కరణ విద్యాలయంలోకి పంపారు. ఆ నాటినుండీ నా జీవితంలో బ్రహ్మాండమైన పరివర్తనం వచ్చింది. ఇప్పుడు నేనొక కళాశాలలో సామాజిక శాస్త్రోపాధ్యాయినిగా పని చేస్తున్నాను. కమ్యూనిస్టు పార్టీలో సభ్యురాల్ని. నేను పల్లెలకువెళ్ళి మా పార్టీ చరిత్ర సోవియట్ సంయుక్త సమ్మేళనం మా పార్టీ నాయకత్వంలో యెంత ఆశ్చర్యకరమైన అభివృద్ధి పొందిందో గ్రామస్థులకు చెబుతోవుంటాను. ఓల్గా నదిఒడ్డున ఆరోగ్యాశ్రమంలో ఒక నెల గడిపి, యిప్పుడే మళ్ళీ నాపనికి వెడుతున్నాను."

ఆ స్త్రీ లిద్దరూ వారి వారి స్టేషన్లవద్దదిగి వెళ్ళిపోతుంటే. వారిని వదలడం కష్టమనిపించింది. ఆ యిద్దరి జీవితాల్లోనూ యెంత వ్యత్యాస ముంది? విప్లవం వారి జీవితాల్లో యెంత గొప్పమార్పు తీసుకొని

వచ్చింది? వీరిద్దరికంటె అద్భుతమైన విప్లవ ఫలితాలనేమి యెత్తి చూపించాలి?

మాతోటి ప్రయాణీకులైన ఎర్రసైనికులు నల్లసముద్రం ఒడ్డున వున్న విశ్రాంతి గృహాలు, ఆరోగ్యాశ్రమాలకు వెడుతున్నారు. వారందరికీ రైళ్ళల్లో ఉచితంగా ప్రయాణం చేసేందుకు సౌకర్యాలు కలిగించబడ్డాయి. ప్రయాణపు దినాలుకాక నెల రోజులు శెలవులు. ప్రతి సైనికుడు తన యౌవనం అనుభవాలు, సోవియట్ ప్రభుత్వం తమ జీవితంలో తీసికొని వచ్చిన మార్పులను గూర్చి అనేక విషయాలను చెప్పారు.

విప్లవాత్పూర్వం, వారిలో యిద్దరకు గ్రామాలలో విరసరాస్య జీవితాలను గడుపుతో ప్రయోజన శూన్యమైన వ్యవసాయం చేసేవారు. మూడవవాడు పాకీవాని కొడుకు. రెండుపూట్లా తిండివుండక నికృష్టజీవితం గడిపేవాడు. కాని, యిప్పుడో! యెర్రసైన్యంలో వుంటోనే, యిచ్చ వచ్చిన వృత్తి విద్య చదువుకుంటున్నారు.

అత్యంత ఆహ్లాదకరమైన వారి సహవాసంలో మా ప్రయాణం చాలా సుఖప్రదంగా గడిచింది. మరుసటిదినం ఆయన రైల్లో విదేశస్థులెవ్వరో ఉన్నారని విన్న రైల్వేగార్డు మమ్మల్నిచూచి, మాట్లాడి వెడదామని వచ్చాడు. 'ఉడ్రావిక్' అనే పుస్తకాన్ని సగర్వంగా ఆయన మాకు చూపించాడు. సకాలంలో, ప్రయాణీకులకు అమిత సౌఖ్యప్రదంగా ఆయన రైలును నడుపుతున్నాడని అందులో వ్రాశారు. పిల్లల తల్లులకు ప్రత్యేకించబడిన రైలుపెట్టెను మాకు చూపించాడు. ఆపెట్టెలో ఆకర్షణీయమైన ఆటవస్తువులు వున్నాయి. కిటికీలు రంగుల గుడ్డలతో కప్పబడి వున్నాయి. ఆపెట్టె శిశుపోషణాలయంవలె వున్నది. గార్డు పడుకొనే పెట్టెకూడా చూచాము.

మైలు తరువాత మైలు రంయ్ మంటూ మా వెనుకకు పరుగెడుతోంచే. ఆస్టెప్పీ దేశానికి అంతం లేదేమో ననిపించింది. కంటి కగుపడే ప్రాంతంలో బూడిదవర్ణపు భూమి మిట్టపల్లములు లేకుండా, చదునుగా పాగిపోతోంది. అచ్చటచ్చట ఒక కుగ్రామం, చిన్న పశువుల మందలు, ఒంటెల దండులు, మాత్రమే కన్పిస్తోవచ్చాయి. తరుగని ఆదృశ్యం చూచిన తర్వాత సోవియెట్ సంయుక్త సమ్మేళనం యొక్క వైశాల్యం ఊహకుతట్టింది.

రెండవరోజు సాయంకాలానికి ప్రకృతి మారజొచ్చింది. చెట్లు, చేమలు కన్పిస్తున్నాయి. విసుగెత్తించే బూడిదవర్ణపు సమతల ప్రదేశం వెనుకకు నెట్టివేయబడింది. మరుసటి ఉదయం మేము నిద్రనుండిలేచి, చూసేసరికి తరు లతాదులతో కప్పబడిన పర్వతాలను చీల్చుకొని మా రైలు ముందుకు పరుగెడుతోంది. సన్నటి లోయను దాటేసరికి నల్లసముద్రం కోలాహలంగా మమ్మల్ని ఆహ్వానించింది. ఏ యితర సముద్రంకన్నా నల్లగామాలేదు. మధ్యధరాసముద్రంవలె నీలంగావున్న ఆ సముద్రదృశ్యం అత్యంత ఆహ్లాద జనకంగావుంది.

సముద్రం వొడ్డున ప్రయాణంసాగించి అపరాహ్ణ సమయానికి సోవియట్ కార్మికుల ఆటస్థలమైన సోచీపట్టణం జేరాము. మా ప్రయాణపు పత్రాలను ఉద్యోగులకుచూపి, సామానులను మకాంలో పెట్టించాము. ఆగుడారంలో రెండుమంచములపై పరిశుభ్రములైన మెత్తటి పరుపులున్నాయి.

మా సామాన్లను సర్దుకొని, స్నానంచేసి, భోజనశాలకు వెళ్ళాం. మా భోజనశాల యెత్తైన కొండమీద వుంది. భోజనం చేస్తో, క్రింద నున్న వినీల సంద్రాన్ని ఒడ్డున ఉన్న సుందరమైన సోచీపట్టణాన్నిచూచి ఆనందించాము.

భోజనానంతరం సముద్రానికివెళ్ళాము. సోచీనగరాన్ని సోవియట్ రివీరా అని పిలుస్తారు. ఫలపుష్ప లతాదులతో శోభిల్లుతో, హాయిగొల్పే వాతావరణస్థితిని కల్గిఉండే ఆ నగరం ఫ్రెంచి దక్షిణతీరాన్ని జ్ఞప్తికి తెస్తుంది. మొత్తంమీద ఆ నగరంలోఉన్న భవనాలు మధ్యధరాసముద్ర తీరపట్టణాల యిండ్లకంటె అనేకరెట్లు బాగున్నవి. ఇచ్చట యితరదేశాల నగరాలలో బీదల, భాగ్యవంతుల భవనాలకుండే విపరీతభేదం కాన్పించదు. నల్లసముద్రతీరం పొడుగునా విశాలమైన ఆవరణలలో ఆరోగ్యాశ్రమాలున్నాయి. పెద్దపెద్ద భోజన, ఫలహారశాలలు విశ్రాంతి గృహాలు మధ్య మధ్య పుష్పవాటికలతో కన్నులపండువుచేస్తోంది. ఈ ప్రకృతిసంపదంతా కార్మికులదే! సోవియట్ దేశంలో నివసించి పనిచేసే ఏ కార్మికుడైనాసరే, ఈసుందరప్రాంతాల్లో శెలవుదినాలను గడుపవచ్చును. సోవియట్ప్రభుత్వం కార్మిక సంఘాలు కొత్త కొత్త ఆరోగ్య, విశ్రాంతి స్థానాలను నిర్మించేందుకు యేటా కోట్లకొలది రూపాయలను వెచ్చిస్తున్నారు. నల్లసముద్రం కోస్తా పొడుగునా అత్యంత సౌందర్యవంతమైన ఇట్టి నగరాలెన్నో క్రొత్తగా కట్టబడ్డాయి.

సోచీనగరంలో అత్యంత సౌఖ్యంగా కాలంగడిపాము. ఉదయాన్నే ఫలహారం చేసినతర్వాత పళ్ళబజారులో కొన్ని పళ్లు కొనుక్కొని, సముద్రపు వొడ్డుకు వెళ్లేవాళ్ళం. అచట ప్రొద్దుయెక్కి యెండ దుర్భర మయ్యేవరకూ స్నానం చేసేవాళ్ళం. అటుతర్వాత కొండ చరియమీద మార్గం పొడుగునా యెడాపెడా పెరుగుతోన్న చెట్లనీడను, మెల్లిగా నడుస్తో మా మకాముకుజేరి, ఒకటి రెండు గంటలు విశ్రాంతి తీసుకున్న తర్వాత మధ్యాహ్న భోజనం చేసేవాళ్ళం. ఆహ్లాదకరమైన అనేక ఆట పాటలతో కాలం గడిపేందుకు సావకాశాలు అపరిమితంగావున్నా, సముద్రపు టొడ్డున యెక్కువకాలం వెళ్ళబుచ్చేవాళ్ళం.

సాయంకాలం నృత్యంచేస్తో, పాడుతునేవాళ్ళం. పార్కుకువెళ్ళి రేడియో వినేవాళ్ళం.

ఒక రోజున జార్జియానుంచి ఒక యెర్రసైనిక పటాలం వచ్చి మా మకాంవద్దనే బసచేశారు. ఆ సాయంకాలం యెంతో కులాసాగా గడిచింది. ప్రాంతీయ నృత్యగీతాలతో అందరమూ వళ్ళు మరచిపోయాం.

సోచీలో మే మున్న కాలంలో అనేక వినోదయాత్రలకు వెళ్ళాం. నల్లసముద్ర తీరాన్నిఉన్న మరొక సుందర పట్టణమైన గాగ్రికి దారి పొడుగునావున్న సుందరదృశ్యాలను చూస్తోవెళ్ళి వెన్నెట్లో తిరిగి సోచీ వచ్చాము. బడలిక చెందినా, యెంతో ఆనందం పొందాము, మరొక రోజున అరణ్యంతో కప్పబడిన పర్వతంయెక్కి వందలాది సంవత్సరముల వయస్సున్న యెర్ర కర్ర చెట్లను చూశాం.

ఆ శెలవు దినాల్లో యెంతోమందితో మాకు పరిచయం ఏర్పడింది. మా విశ్రాంతి గ్రహం ప్రక్కనే యిరవై దినాల శెలవులను గడిపేందుకు వచ్చిన యెనమండుగురు కార్మికయువతు లున్నారు. లెనిన్‌గ్రాడ్‌నుండి వచ్చిన ఒక ఉపాధ్యాయునితో మా అనుభవాలనుగూర్చి మాట్లాడుకునే వాళ్ళం. మాస్కోలో ఒక గొప్ప బట్టలదుకాణంలో పనిచేస్తోన్న యిద్దరు వయసుగత్తెలు రోజుకు అనేక పర్యాయాలు దుస్తులను మారుస్తో, మాతో ముచ్చటగా మాట్లాడుతో ఉండేవారు. మరొక సౌందర్యవతి ఒకరోజున సముద్రతీరాన్ని కూర్చున్నప్పుడు పదిసంవత్సరాల వయస్సునుండే బట్టల మిల్లులో పనిచేసేదనీ, విప్లవకాలంలోకూడా మోటపని చేసేదనిచెప్పింది.

"ఇప్పుడు నాస్థితిచూడు. కార్మికుల విద్యాలయంలో చదువనూ, వ్రాయనూ నేర్చుకున్నాను. మాబట్టల మిల్లు తరపున పెద్ద యెత్తున బేర

సారాలుసాగిస్తున్నాను. నాతల్లితోనూ, పిల్లలతోనూ మాయింట్లో సుఖంగా కాలం గడుపుతున్నాము. నాకు ముప్పది యేళ్లు వచ్చేసరికి, ఆరుగురు పిల్లలను కన్నాను. మా దుర్భర జీవిత పరిస్థితుల మూలాన్ని నలుగురు పిల్లలు చనిపోయారు. ఆ రోజుల్లో చంటిపిల్లల తల్లులకు పోషణలేక, పిల్లలు యెలుకల్లాగు మాడి చనిపోయేవారు. ఆ రోజులు వెళ్ళిపోయాయి. యెందుకు అనవసరంగా తలుచుకోవడం" అని చెప్పి తన స్వస్థలమైన ఇవానోవో వచ్చి యెప్పుడైనాసరే, కొంతకాలం తనతో వుండవలసిందని ఆహ్వానించింది.

మా తోటకో కొద్దిగా దూరంగావున్న మకాంలో కొందరు యింజ సీరింగు కళాశాలా విద్యార్థులు చాలా కులాసాగా కాలక్షేపం చేసేవారు. దృఢకాయులైన ఆ యువకులు గంటల తరబడి యీదుతోనూ, పర్వత సానువులమీద మైళ్ళకొద్దీ నడుస్తోనూ నృత్య గీతాదులతోనూ కాలం గడిపారు.

ఆరోగ్య, విశ్రాంతి గృహాలవద్ద, చాకళ్ళు, మంగళ్ళు, జోళ్ళు తుడి చేవారు, ఊడ్చేవారు, అన్ని రకాలైన పనులు చేసేవారు ఉన్నారు. కావ లసిన కార్యం కొద్దికాలంలో జరిగిపోయేది. వైద్యులు నిత్యము అత్యంత శ్రద్ధతో యాత్రికులకు వైద్య సౌకర్యం కలిగించేవారు.

సెలవు దినాల్లో కాలం గడిపేందుకు వచ్చినవారు ఆరోగ్యకరమైన భోజనంచేసి, ఉల్లాసంగా కాలంగడిపి, సంపూర్ణంగా విశ్రాంతి తీసుకొని మరల తమ తమ పట్టణాలకు తమ దైనందిన కార్యక్రమాన్ని కొనసాగిం చేందుకు ఉత్సాహంతో వెడతారు.

మా సెలవుల అనంతరం మాస్కోకు తిరిగివెళ్ళాం. నా మొదటి యాత్రకు రష్యనుల సౌహార్ద్రిమునూ యెప్పటికీ మరవలేను. కార్మిక, కర్షక రాజ్యమైన ఒక్క రష్యాతప్ప కార్మికులకు విశ్రాంతి కలిగించేందుకు మరేయితరప్రభుత్వం అపరిమితంగా ధనాన్ని వెచ్చించదని, నేను రూఢిగా చెప్పగలను.

అభివృద్ధి కరమైన అనేకమార్పులు అనుక్షణమూ వస్తోంచే సోవి యెట్ సంయుక్త సమ్మేళనంలో ప్రస్తుతం అమలులోవున్న విద్యావిధా నపు వివరాలను వివరించడం కష్టతరమైన కార్యం. ఈపుస్తకం అచ్చులో వుండగానే అనేక మార్పులు జరుగవచ్చును. పాఠ్యగ్రంథములు, బోధనా

క్రమాలనుగూర్చి కొన్ని అంశాలను చదువరికి దిగువ అధ్యాయాలలో విశదపరచ బడుతాయి.

ఒకే ఒక విధమైన సోవియెట్ ఉన్నత పాఠశాల ఉన్నది. పది సంవత్సరాల కాలపరిమితిగల పాఠశాల విద్యావిధానం సంపూర్ణమైనది. ఏడు సంవత్సరాల అసంపూర్ణ విద్యకూడా వుంది. ఈ బాల బాలికలకు కలిపిచెప్పే సహవిద్యావిధానమే అమలులో వుంది.

సోవియెట్ బాల బాలికలు ఎనిమిదవయేట పాఠశాలలకు వెడతారు. కాని యీ లోపుగానే చదువనూ లెక్కపెట్టనూ తెలుసుకొని వుండాలి. తోట బడులలోగాని, ( కిండర్ గార్డను ) పాఠశాలలలోగాని నడుపబడే ప్రాధమిక తరగతిలో పిల్లలు యీ విషయాలను నేర్చుకొనవచ్చును. లేక పోతే ఇండ్లవద్దనేతెలుసుకోవచ్చును. రష్యను ఫోనిటిక్ భాష కనుక. పెద్దల సహాయం యెక్కువగా అవుసరంలేకుండానే పిల్లలకు అక్షరాలు వచ్చిన వెంటనే స్వయంగా చక్కగా చదువగలుగుతారు.

పిల్లలకు ఎనిమిదినుండి పదిహేనవ యేడువరకూ చదువు నిర్బంధంచేయబడింది. ఈ ఏడుసంవత్సరాల పరిమితిలోను ఏడు తరగతులను దాటాలి. ఏడుతరగతులలోను నెగ్గి, సర్టిఫికెట్టు పొందుతేనేగాని, దరఖాస్తుదార్లకు ఉద్యోగములు దొరకడం కాలక్రమేణా కష్టతరంగా పరిణమిస్తోంది. ఇకమీదట ఒకటి రెండు సంవత్సరాలలో విద్యాలయ భవనాలు బోధకులు తగినంతగా లభ్యమైన తర్వాత పద్దెనిమిది సంవత్సరముల వరకు నిర్బంధ విద్యావిధానం అమలు జరుపబడుతుంది. ప్రస్తుతంకూడా. పది తరగతులు చదువదలచుకొన్న విద్యార్థులు పది సంవత్సరాలు చదివేందుకు యెక్కువ అవకాశములు కలుగజేయ బడుతున్నాయి.

ఒక్కొక్క దానిలో వేయిమంది విద్యార్థులకు స్థానాలుండే అయిదువందల విద్యాలయాలు గత కొద్ది సంవత్సరాల్లోనూ ఒక్క మాస్కోలోనే స్థాపింపబడ్డాయి. ప్రతి విషయానికి సంబంధించిన యావత్తు అవశ్యక పరికరాలూ ఈ విద్యాలయాలలో సేకరింపబడ్డాయి. ప్రతి విద్యాలయానికి చేర్చి సినీమా, మాజిక్ లాంతరు. మున్నగు పరికరాలు సమకూర్చబడ్డాయి. ప్రతి జిల్లాలోను, జిల్లా విద్యాలయ సంస్థవారు ప్రతి విషయమునకు సంబంధించిన బోధనీయాంశములతో కూడిన చలన చిత్రములను తీస్తారు. చరిత్ర, భూగోళం, శాస్త్రవాచకముల పాఠములను బోధించేటప్పుడు ఉపాధ్యాయులు ఆ చిత్రములను తెప్పించి, విద్యార్థులకు చూపు

తారు. ప్రపంచంలో వివిధ భాగాలనుండి వచ్చే విద్యావేత్తలు, యితరదేశ పాఠశాల లన్నిటికంటె సోవియెట్ విద్యాలయాలు సర్వపరికర సమన్వితా లని పొగడక తప్పదు.

ప్రతి పాఠశాలలోను గ్రంధాలయాలు, సాంకేతిక విద్యావిషయక పత్రికలు ఉంటాయి. విద్యాలయ గ్రంధాలయోద్యోగి, బాల బాలికలకు పత్రిక, గ్రంధ పఠనమునం దాసక్తి, అభిరుచి కలిగించవలసిన బాధ్యత వహిస్తాడు.

ప్రతి సోవియెట్ విద్యాసంస్థకు అనుబంధించివుండే 'జంతు భాగం' ఒక ముఖ్యమైన ప్రధాన ప్రత్యేకత జీవశాస్త్ర బోధనకు ఉపక రించే జంతువులు, పక్షులు, మొక్కలు యీ భాగాలలో ఉంటాయి. విద్యా ర్థులు జాగ్రత్తగా పుట్టుక, పోషణ, పెరుగుదల మున్నగు అనేక విష యాలను పరిశీలించి, పరిశీలన పుస్తకాలలో వ్రాస్తారు. ఆ యా విషయా లపై వ్రాయబడిన పాఠ్యగ్రంధాలలోని విషయాలను ఆచరణలో సరిపోల్చు కొని అనుభవంలో అకళింపుకు తెచ్చుకుంటారు.

క్రింది తరగతులలో ఒక్కొక్క భాగమునకు నలభై యిద్దరు, ఎనిమిది, తొమ్మిది, పది తరగతులలో ఒక్కొక భాగమునకు ముప్పది మందీ బాలురు వుంటారు. పాఠశాల భవనాలు చాలినన్ని లేవిచోట్ల తరగ తులలో నలభై ఆర్గురుమంది విద్యార్థులు కూడా వుంటారు. అదనంగా చేర్చుకోబడిన విద్యార్థుల నిమిత్తమై అదనంగా ఉపాధ్యాయులకు జీతం ముడుతుంది. పాఠశాలా భవనాలు చాలినన్ని నిర్మించబడినప్పుడు, తరగ తులలోని విద్యార్థుల సంఖ్యకూడా తగ్గించబడుతుంది.

మొదటి నాల్గు తరగతులలోను ఒకే ఉపాధ్యాయుడు అన్ని విష యాలను చెప్పాలి. నెలకు వంద బోధనా గంటలపనికి జీతం ఉపాధ్యా యుల కీయబడుతుంది. పై తరగతులలో నెలకు డెబ్బది అయిదు బోధనా గంటల పనిమీద ప్రత్యేక విషయాలను చెప్పే పనిమీద ఉపాధ్యాయులకు జీతమిస్తారు. లెక్కలు, భాషలు చెప్పే ఉపాధ్యాయులు అదనంగా విద్యా ర్థుల పనిని సరిదిద్దవలసి వుంటుందిగాన వారికి నెలకు నలభై రూబుల్సు జీతం అధికంగా ముడుతుంది. బాల బాలికల విషయమై ప్రత్యేక శ్రద్ధ తీసుకొన వలసిన తరగతి సలహాదార్లకు నెలకు అదనంగా ఏబదిరూబుల్సు యిస్తారు. నెలకు నిర్ణయింపబడిన పనిగంటల కాలాన్ని మించి పనిచేసే గంటలకు అదనపుజీతం యిస్తారు. కావ అధికంగా కృషిచేసి, తరగతు

లను తీసికొనేవారికి చాలా యెక్కువగా సంపాదించేందుకు సావకాశా లున్నాయి. జీతాలు రెట్టింపుకు పెంచబడిన 1936 వ సంవత్సరంనుండి ఉపాధ్యాయులు నాల్గు వందలనుండి వేయి రూబుల్సువరకూ సంపాదించ గలుగుతున్నారు.

చక్కటి సంస్కృతి, సర్వవిషయ పరిజ్ఞానం కలిగిన స్త్రీ పురుషులను తయారుచేయుటయే సోవియెట్ విద్యావిధానంయొక్క ధ్యేయం. యుగయుగాలనుండి మానవునకు వచ్చుచున్న కళాతృష్ణను పెంపొందించి, మహోన్నత గుణాలను కలిగించుచే సంస్కృతికి విశాలమైన నిర్వచనం. అతివేగంగా అభివృద్ధిచెందే సోవియట్ పరిశ్రమ, వ్యవసాయములతో పాటు ప్రత్యేక కృషిచేసి, సమర్థతను సంపాదించిన వారి ఆవశ్యకతకూడా హెచ్చింది. యంత్రములచే మానవునకు ఊడిగము చేయించుట యీ అభివృద్ధి లక్ష్యముకాన, మానవునకు అంతకంతకు హెచ్చుగా విశ్రాంతి విరామము లభించుచున్నది. అందువలన విద్యా విరామమునకు. పవి నైపుణ్యానికి కూడా ఉపయోగింపబడుతోంది.

సామాజికావుసరములను తీర్చేందుకు, గొప్ప ప్రావీణ్యతను సంపాదించేందుకు అవుసరమైనంత ప్రాథమిక జ్ఞానాన్ని సమకూర్చుటకు తీరిక సమయాలను సాంస్కృతికంగా గడిపేందుకు తగిన పాఠ్యప్రణాళిక విద్యాలయంలో అమలుపరచబడుతుంది. మార్క్సిస్టు సూత్రానుగుణ్యమైన శాస్త్రీయ పద్ధతులపై విషయాలన్నీ బోధింపబడతాయి.

ప్రాకృతిక దృశ్య ఘటనల నర్థంచేసుకునేందుకు శాస్త్రముల నన్నింటిని క్షుణ్ణంగా చదవాలి. ప్రపంచంలో నేడుజరిగే సంగతులను నేడు అమలులోవున్న సామాజిక కట్టుబాట్లు, నిర్మాణము మున్నగు విషయాలను అర్థం చేసుకునేందుకు చారిత్రకజ్ఞానం అత్యంతావసరం. భౌగోళిక పరిస్థితులు, శీతోష్ణములు మానవ సమూహములమీద చూపిన ప్రభావం. తెలుసుకునేందుకు భూగోళశాస్త్ర విజ్ఞానం అవసరం. జంతు, వృక్ష, శరీర, భూగర్భ పరిణామ శాస్త్రములను ప్రకృతిశాస్త్రములు, భూ జీవముల పరిణామాన్నిగూర్చి సరియైన విజ్ఞానాన్ని కలుగచేసి. స్త్రీ పురుష జాతులకు ఒకరియెడల మరొకరికి ఆరోగ్య కరమైన అభిప్రాయాలు కలిగిస్తాయి. పిల్లలు తమ మాతృభాషను బాగుగా అభ్యసించి, తమ భావాలను సరళమైన మాటల్లో వెల్లడించకలిగి వుండాలి. తా మెంత ఉత్కృష్టమైన భాషానిధులకు వారసులో గుర్తెరుగునట్లు స్వభాషాప్రీతిని

పుట్టించాలి. అంతర్జాతీయ భావం వారిలో అభివృద్ధి పొందేందుకు, పర భాషా పరిచయంకూడా కలిగించాలి. శరీర పాటవాన్నికల్గించే ఆటలు, వ్యాయామములను బాలబాలికలు అభ్యసించాలి. లలితకళలలో భక్తిశ్రద్ధలు కలిగించి, సోవియెట్ దేశంలో ప్రజాసామాన్యానికి అంతకంతకు అధికంగా లభిస్తోన్న విరామసమయాన్ని ఆనందమయంగాను, విజ్ఞాన ప్రదంగాను గడుపుకునే యేర్పాట్లు చేయాలి.

పది సంవత్సరాల పాఠశాలలలో యీ విషయాలన్నీ పాఠ్యప్రణాళి కలో జేర్చబడ్డాయి. ఈ విషయబోధనా పద్ధతులలో ప్రతిసంవత్సరము అవసరమని తోచిన మంచి మార్పులు చేయబడతాయి. ప్రతి విద్యాలయపు ప్రధానోపాధ్యాయుడు తదితర ఉపాధ్యాయులతో సంప్రదించి కాలపట్టికను నిర్ణయిస్తాడు. సాధారణపు తెలివితేటలు కలిగిన పిల్లలు అనుసరించ గలిగిన పాఠ్యప్రణాళికనే అనుసరిస్తారు కాన మరీ మందబుద్ధులుకాని, పాఠములకు వెనుకబడరు. సర్వసామాన్యంగా మంచిమార్కులే విద్యార్థులు తెచ్చుకోగల్గుతారు.

తరుచుగా మార్పుచెందే విషయాల పాఠ్యప్రణాళికలోని వివరాలు గూర్చి యిచ్చట హెచ్చుగా చెప్పడం సమంజసంకాదు. మాస్కోలో ఉపాధ్యాయురాలినిగా నేను పనిచేసిన, నాలుగు సంవత్సరాలకాలంలో అనేకమార్పులు జరిగాయి. ఒకప్పుడు చరిత్ర ఐదవతరగతికి ( వయస్సు 12, 13 సంవత్సరాలు ) మాత్రమే బోధించబడేది. కాని తరువాత 3 వ తరగతిలోకూడ ప్రవేశ పెట్టబడింది. అంతక్రితం ఐదవ తరగతికి చెప్ప బడే పదార్థ విజ్ఞానశాస్త్రం నేడు 6 వ తరగతి వద్దనుండి ప్రారంభించారు. ఒక ప్రత్యేక విషయంగా ఉండే సమాజశాస్త్రం, నేడు అసలే రద్దుచేయ బడింది. సోవియెట్ సంయుక్త సమ్మేళనంయొక్క రాజ్యాంగ చట్టం ఏడవ తరగతి పిల్లలకు బోధిస్తున్నారు.

సర్వవిషయక సమగ్ర పరిజ్ఞానం కలిగేందుకే యిట్టి మార్పులు చేయబడ్డాయి. ఉదాహరణకు చరిత్రను తీసుకుందాము. అంధ యుగపు మానవుడు, పురాణ మానవుని తెగలలోని జీవితం ప్రథమసామాజములు, ప్రాథమిక రష్యను రాజ్యములు మున్నగుదశలనుండి, రష్యను సామ్రాజ్య నిర్మాణం, నవంబరు విప్లవములవరకూ సంబంధించిన ప్రముఖ విషయాలను మూడు, నాలుగు తరగతుల విద్యార్థులకు పఠనీయాంశాలుగా వుంటాయి.

ప్రపంచచరిత్ర ఐదవ తరగతినుండి, పదవ తరగతి వరకూ బోధింపబడుతుంది. అస్సీరియా. బేబిలోను, ఇండియా, గ్రీసు, ఈజిప్టు, చైనా, రోమ్‌దేశాల ప్రాచీన నాగరికతలు శతాబ్దుల తరబడి, వివిధ దేశాలలో అభివృద్ధిపొందిన భూస్వామ్య విధానములు, ఆయా దేశాల ప్రస్తుత పరిస్థితులు సమగ్రంగా అభ్యసించిన బాలకులతో సంభాషించినప్పుడు, ప్రపంచ చరిత్ర కాంశాలపై వారికున్న సంపూర్ణము, సుస్పష్టమైన వారి భావాలు నన్నాశ్చర్య చకితురాలను చేసేవి. మా ఇగ్లండులో నేను నా విద్యార్థి జీవితంలో రాజులు, రాణులు, వారి పరిపాలనా కాలముల యుద్ధముల తేదీలు మున్నగు అనవసర ప్రయోజన రహిత విషయాలను చదివి అస్పష్టమైన భావాలతో గజిబిజి పడేదానను. ఈ విద్యావిధానాలలోని తారతమ్యం అనల్పం. అపారం. ప్రపంచ చరిత్ర చదివిన ప్రయోజనమే అర్ధమయ్యేదికాదు. ఒక్క చరిత్ర విషయంలోనే కాకుండా అన్ని విషయాలు అగమ్య గోచరాలే.

పట్టణ, పల్లెల పాఠశాలలో కొద్దిమార్పులు మినహాయిస్తే, అన్ని విద్యాలయాలలోను పాఠ్య ప్రణాళిక సమమే. ఏప్రిన్సిపాలూ వ్యక్తిగతంగా అందులో మార్పులు చేయకూడదు. ఒక్కొక్క వారంలో ఒక్కొక్క విషయానికి యెన్నిగంటలు బోధించాలో నిర్ణయింపబడి వుంటుంది. వాటి ననుసరించి ప్రతి విద్యాలయమూ వాటి కాలక్రమ పట్టికలను యేర్పరచుకుంటాయి.

పాఠ్య ప్రణాళికలో మార్పులు చేయగోరువారు, అందుకొరకు గాను కూడిన సమావేశాలలో అధిక సంఖ్యాకులచే తమ సూచనల నామోదింప చేయాలి.

నా అనుభవంలో అట్టిమార్పులు జరిగాయి.

సోవియెట్ సమ్మేళనంలో విద్యావిధానం యీ పద్ధతులపైననే అభివృద్ధి పొందింది. కేంద్రీకృతమై, సమైక్యవిధాన మగుటవలనే ఆవిద్యా విధానము నమలుజరిపే వారందరూ తమ విశేషానుభవాలచే పదునుపెట్టి ప్రకాశవంతం చేయగలుగు తున్నారు.

బాల బాలికలందరూ ఏడు, పదిసంవత్సరాల విద్యను తప్పదాట్లు లేకుండా చదువవలసిందే. అన్ని విషయాలనూ అందరూ అభ్యసించవలసిందే. విద్యార్థుల యెన్నికకేదీ వదలబడదు. నిర్ణీత పఠనీయాంశాలను ప్రతి విద్యార్థి చదవాలి. లేత వయస్కులైన బాల బాలికలు తాము చదవ

వలసిన విషయాలపై నిర్ణయించతగిన మానసిక పక్వస్థితిలో నుందరవి సోవియెట్ విద్యావేత్తలు నిశ్చయించి, శాస్త్రీయ పద్ధతి ననుసరించి ఆయా తరగతుల పాఠ్యక్రమాలను నిర్ణయిస్తారు. విద్యార్థులకు ఆయా విషయాల పై శ్రద్ధాభక్తులు కలిగించవలసినవిధి ఉపాధ్యాయులది.

దీక్ష, ధైర్యం, వినయం, ఔదార్యం మున్నగు అమూల్య గుణాలతోకూడిన శీలవంతులుగా విద్యార్థులను తయారు చేయడమే విద్య యొక్క పరమాశయంగా సోవియట్ విద్యావేత్తలు యెంచుతారు. ఈ శిక్షణలో సోవియెట్ పితృదేశభక్తి ప్రధానస్థాన మలంకరిస్తుంది.

విద్యార్థులను సచ్ఛీలురుగాచేసే 'శిక్షణా' విధానం ప్రతి విద్యాలయం తయారుచేసి అమలు పరుస్తుంది. మామూలు పాఠములద్వారా, ఉపన్యాసములు, నాటకములు, తదితర ప్రదర్శనములద్వారా యీ గుణములయందు విద్యార్థుల మనస్సులను లగ్నంచేసే మార్గాలను, ఉపాధ్యాయులకు బోధిస్తారు. పాఠశాలలలో బోధించే అంశాలకూ, వాస్తవిక జగత్తులో దైనందినమూ యెదుర్కోవలసిన సమస్యలకూ పొత్తుకుదిర్చి, సరియైనదృష్టి నలవడజేయ గలగడమే సోవియట్ విద్యావిధానం సాధించిన బ్రహ్మాండ విజయం.

విద్యాలయ జీవితంలో అతి ప్రముఖస్థానం మార్గదర్శక సంస్థ అలంకరించి, విద్యా ప్రమాణాన్ని హెచ్చించి, విద్యార్థుల ఆత్మ శిక్షణకు ఉపయోగకారిగా వుంటుంది. ఈ సంస్థ సభ్యత్వం ఐచ్ఛికమే అయినా, విద్యార్థు లందరూ అమూల్యంగాను, గౌరవప్రదంగాను యెంచుతారు. మంచి విద్యార్థులనే జేర్చుకుంటారుగాన, విద్యార్థులందరూ మంచినడవడిక కలిగి వుండేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తారు. మార్గదర్శక నాయకులు విద్యార్థులతో సన్నిహిత సంబంధం యేర్పరచుకొని, వారి తీరుబాటు సమయాలను సక్రమ పథాలలో వడిపేందుకు విశేషంగా కృషిచేస్తారు.

## నోటి ప్రశ్నలు

1. (అ) గోధుమ లక్షణాలేమిటి? ఈపైరు పెంచబడే ప్రాంతాలు ఉపయోగాలు, చరిత్రయేమి?

రైపైరు ఉత్పత్తి, సాగుబడి ప్రాంతాలు, ఉపయోగాలు ఏవి? ఓట్లు, బార్లీ పైరు లెచ్చట పెంచబడతాయి? ఉపయోగాలేమి?

(ఆ) వృక్షశాస్త్ర విజ్ఞానాభి వృద్ధికి, లిన్నేయస్, డార్విన్, మిచూరిన్‌లు చేసిన సహాయమేమి ? ఎచ్చట, ఎప్పుడు వారు జీవించారు ?

( 6 తరగతి, వృక్షశాస్త్రం 1937 వేసవి పరీక్షలు)

2. (అ) లెవన్‌హాక్ ఎవరు ? ఆయన కనిపెట్టిన విషయాలేమి ? ఆయన ప్రాముఖ్యత ఏమిటి ?

(ఆ) సుద్ద సున్నముల ఉత్పత్తి స్థానము లేవి ?

( 6 వ తరగతి 1937 వేసవి పరీక్షలు )

3. (అ) వానపాముయొక్క జీర్ణ, రక్త, మల విసర్జన, ప్రత్యుత్పాదక అంగనిర్మాణము, పనిచేయు విధానములను తెల్పుడు ?

(ఆ) రబ్బరు ఉపయోగాలేమి ? ఏవిధంగా లభిస్తుంది ?

( 6 వ తరగతి 1937 వేసవి పరీక్షలు )

4. యూరప్‌ఖండ ఉపరిభాగం—నైసర్గిక స్వరూపం—యూరప్ నైసర్గిక స్థితిపై మంచు ప్రళయయుగపు ప్రభావం. అగ్నిపర్వత, భూకంప ప్రాంతాలు. ( 6 వ తరగతి భూగోళం )

5. ఇంగ్లండు—స్థలనిర్దేశం—ఇంగ్లండుప్రాముఖ్యతపై దాని ప్రభావం. రాజకీయ నైసర్గిక విభాగములు. ( మైదాన, మెట్ట, పల్లపుప్రాంతాలు) శీతోష్ణ పరిస్థితులు. ఖనిజసంపద. వ్యవసాయం. వివిధపరిశ్రమలు. పారిశ్రామిక కేంద్రములు. ఇంగ్లండు అభివృద్ధికి జలమార్గముల తోడ్పాటు. ప్రభుత్వ విధానం. వలసరాజ్యాలపై ఆధారపడుట ( ఉదాహరణ ) లండను నుండి సిడ్నీవరకు వున్న బ్రిటిషుసామ్రాజ్య భాగములు.

( 6 వ తరగతి భూగోళశాస్త్రం )

6. చైనా రాజకీయ స్వరూపం. మంగోలియా, మంచూరియా, టిబెట్టు, సింకియాంగు, ప్రాంతాల నైసర్గిక లక్షణములు. జపానుకు మంచూరియా అవశ్యకత. సోవియెట్ చైనా ప్రాంతం.

( 6 వ తరగతి భూగోళశాస్త్ర )

7. (అ) గుఱ్ఱంయొక్క వంశవృక్షం.

(ఆ) పాలిచ్చు పెంచుజంతువుల ఆర్థిక ప్రాముఖ్యత. మందల పెంపకం, వ్యాపారపు వేటలు, అడవి మృగముల పెంపకం.

( 7 వ తరగతి జంతుశాస్త్రం )

8. (అ) చార్లెస్‌డార్విన్ సిద్ధాంతాలు. కార్మికుల చేతిలో పరిణామ సిద్ధాంతం.
(ఆ) వంశ క్రమానుగతంగావచ్చే లక్షణాలేమి ?
(ఇ) క్రూరమృగాలు ; అడవి మొక్కల అస్థిరత. ఉదాహరణలు.
( 7 వ తరగతి జంతుశాస్త్రం )

9. (అ) చేపలజాతి వృద్ధి. గ్రుడ్లు పెట్టుట. చేపల పెంపకము.
(ఆ) విలువైన చేపలు. వాటి నివాసస్థానములు. కాడ్, షార్కు, సాల్మన్, స్టర్జియన్, హెర్రింగు జాతిచేపలు.
(ఇ) చేపల పెంపక విధానం.
( 7 వ తరగతి జంతుశాస్త్రం )

10. పురుగుల అంగనిర్మాణం. జీర్ణకోశం. రక్తనాళములు, శ్వాసకోశం. జ్ఞానేంద్రియములు. జననేంద్రియములు. కండరములు.
(అ) పిల్లలను కనుట, వంశవృద్ధి. సంపూర్ణ, అసంపూర్ణ పరివర్తనము. సంతాన రక్షణ.
( 7 వ తరగతి జంతుశాస్త్రం )

11. (అ) పరిణామవాద పంచసూత్రాలు. " పరిసరముల కనుగుణంగా జీవులు సరిపుచ్చుకుంటవి " అనువాదమునకు ఉదాహరణలు.
(ఆ) సమావృత జీవావయవముల మధ్య, ఒకే తరగతికి చెందిన రూపముల మధ్య జరుగు ఉనికికొరకు సంఘర్షణ.
(ఇ) సోవియెట్ సమ్మేళనంలోని ' ప్రాకృతిక ఎన్నిక ' సోవియెట్‌లో వృక్షముల జంతువుల పెంపకము. అంట్లుకట్టు విధానం.
( 7 వ తరగతి జంతుశాస్త్రం )

12. నార్మను దండయాత్రకు పూర్వం ఇంగ్లండులోని రాజకీయ, ఆర్థిక పరిస్థితులు. విలియమ్, హేస్టింగ్సు యుద్ధం. విలియమ్ పరిపాలనా కాలంలోని సంస్కరణలు—రాజ్యాధికార కేంద్రీకరణం, చర్చి సంస్కరణలు, డూమ్స్‌డే పుస్తకం. కళలు, శాస్త్రములు శిల్పముల స్థితి. పట్టణ వర్తకముల పెరుగుదల.
( 7 వ తరగతి చరిత్ర )

13. (అ) 1381 రైతుల తిరుగుబాటు. కారణములు, నాయకులు, తిరుగుబాటు క్రమాభివృద్ధి, రైతుకోర్కెలు, తిరుగుబాటు ప్రాంతములు.

లండనుపై దాడి. రెండవ రిచర్డు ధరించిన పాత్ర. తిరుగుబాటు ఫలితాలు.

(ఆ) పదిహేను, పదహారు శతాబ్దాలలో కనుగొన బడిన నూతన విషయాలు-వాటి ఫలితాలు.

( 7 వ తరగతి చరిత్ర )

14. (అ) హంసా సమాజం, సమాజాభివృద్ధి కారణములు. ప్రసిద్ధిచెందిన సమాజనాయకులు. ప్రధాన నగరాలు. సమాజసూత్రాలు. యుద్ధాలు, జర్మనీకి దాని ప్రాముఖ్యత. సమాజ వినాశన హేతువులు.

( 7 వ తరగతి చరిత్ర )

15. (అ) పునరుద్ధరణ మానవవాదము అంటే యేమిటి? యీ ఉద్యమం యెచ్చట, యెప్పుడు, యెందుకు బయల్దేరింది? ఆ ఉద్యమనాయకు లెవరు? చర్చి. పునరుద్ధరణోద్యమాల సంబంధములేమి? మానవ వాదంవలన జీవితాలలోను, భావాలలోను కలిగిన మార్పులేమి?

(ఆ) మెడిసీ పాత్రయేమిటి? ఎప్పుడు, ఎచ్చట వారు పాలించిరి?

( 7 వ తరగతి చరిత్ర )

16. (అ) అమెరికాలో స్పానిష్. పోర్చుగీస్ దండయాత్రలు పెరూను ఎవరు కనుగొన్నారు? మెక్సికోలో కార్టెజ్ ఇండియనులను చూచిన విధం, నీగ్రో బానిసత్వం. అమెరికా కనుగొనబడుటవలన యూరప్‌లో కలిగినమార్పులు. వ్యాపార వాణిజ్యాలపై ప్రభావము. స్పెయిన్ పతనమునకు, వినాశనమునకు హేతువులు, విచారణ.

(ఆ) థామస్ మంజీర్ యెవరు?

( 7 వ తరగతి చరిత్ర )

17. స్టూ ఆర్టు ప్రభువులకాలంలో ఇంగ్లండు పరిస్థితులు. ప్రధమ జేమ్సు, ప్రధమ చార్లెస్లు. స్టూవార్టుల అధికారాభివృద్ధి. శాసనసభలేకుండా నిరంకుశ ప్రభుత్వం. దీర్ఘకాల పార్లమెంటు. వివిధ రాజకీయ పక్షాలు. అంతర్యుద్ధ ప్రారంభం. క్రామ్‌వెల్ సైన్యము. ప్రజాస్వామిక ప్రభుత్వస్థాపన. రాజు పలాయనం. వివిధ పార్లమెంటరీ పార్టీల వైరములు. రాజు శిరచ్ఛేదం.

( 7 వ తరగతి చరిత్ర )

18. (అ) సోవియట్ రష్యాదేశంయొక్క భూసారం. పంటలు, టండ్రా (శీతల) అడవి ప్రాంతాలు. భూసారముల రకములు, పైరులు, వృక్షముల రకములు. శీతోష్ణస్థితి, పైరుల పరస్పర సంబంధం.

(ఆ) స్టెప్పీ మైదానభూములు, మెట్టప్రాంతాలు, యెడారి ప్రాంతాలలో నివసించెడి జంతువులు, వాటి ఆర్థిక విలువ.

(ఇ) సోవియట్ రష్యా ఖనిజసంపద. ఇతరదేశాల ఖనిజ సంపద లతో పోలిక. నైసర్గపరిస్థితికి, ఖనిజసంపదకు సంబంధం, ఖనిజ సంపద వినిమయము. క్రొత్తగా కనుగొనబడిన గనులు.

( 7 వ తరగతి భూగోళశాస్త్ర పాఠ్యప్రణాళికలో భాగములు )

(ఈ) యూరపియన్ రష్యాయొక్క ఉత్తరప్రాంతం. సరిహద్దులు రాజకీయ విభాగములు, నదులు, పర్వతాలు, పైరులు, భూ సారం, శీతోష్ణ పరిస్థితులు, ఖనిజసంపత్తి, ఆర్థికపరిస్థితి, ప్రధాన నగరాలు, ప్రజలుభాష.

19. (అ) ప్రాచీన ఈజిప్టు, మీన్సు పాలనక్రింద ఈజిప్టు యేకీకరణ. పారయోలు, రాజులు, మతాధికారులు, రైతుల జీవిత పరిస్థితులు. పిరమిడ్సు నిర్మాణము, హైక్సాసుదేశ బహిష్కృతి, ఈజిప్టు అభి వృద్ధి. ఈజిప్షియన్‌మతం. అమ్మాన్ దేవాలయం. నాలుగవ అమినోఫిస్ మత సంస్కరణలు. ఈజిప్టుపై అస్సీరియా, పర్షి యాల విజయయాత్రలు గ్రీకుల నాగరికతనాటి ఈజిప్టు. విజేత అలెగ్జాండర్ పరిపాలనక్రింద ఈజిప్టు.

(ఆ) పాలెస్టయిన్ యెల్లలు. అరేబియాలోని ఇస్రేలైట్లు. మోసెస్ కథ. ఇస్రేలైట్ల పశ్చిమదేశ సంచారం. కాననైట్లు, ఫిలిస్టైయిన్లతో పోరాటములు. జోర్డాన్ నదీ పరిసర ప్రాంతాలపై దిగ్విజయం. సాల్‌ప్రభువు.డేవిడ్ ప్రభువు. ఇస్రేలైట్ తెగల యేకీకరణ. ఇస్రేలైట్ల అధికారప్రాబల్యం. జూడియా రాజ్యస్థాపన. సాలమన్ ప్రభువు. జెరూసలెమ్‌పట్టణం.

(ఇ) చైనా చారిత్రక విజ్ఞానాధారములు. ప్రథమంలో చైనానాగ రికతఉద్భవిల్లిన ప్రాంతం. హోయాంగ్‌హో, యాంగ్‌ట్సెకియాంగ్ నదీతీరస్థ ప్రజల జీవిత పరిస్థితులు. షాంగ్ రాజవంశం చక్రవర్తి. సామంత ప్రభువులు. విలుకాండ్రు. చైనా మతకల్లోలపుకాలం.

సింగుచౌ, వ్యతిరేక పోరాటాలు. హంగ్ రాజవంశంయొక్క వర్గలక్ష ణాలు హంగుచక్రవర్తుల సంస్కరణలు. రహస్యసంఘాల విప్లవ కార్యకలాపాలు.మంగోలుల చైనా దండయాత్ర. కన్ఫ్యూషియస్-ఆయనబోధనలు.

(ఈ) గ్రీస్. ప్రాచీనగ్రీకు నాగరికత. సంస్కృతి, శిల్పకళ, చిత్రలేఖ నముల అభివృద్ధి. యుద్ధవీరులు, వారి పరికరములు. ఒలింపిక్ ఆటలు. డెల్ఫిక్ ఆటలు.

(ఉ) స్పార్టా. ఎల్లలు రాజకీయ నిర్మాణము. నిరర్గస్కత. సాముదా యిక భూస్వామ్యము. సాముదాయిక భోజనం. స్పార్టను విద్యా లయాలు, సైన్యం రైతుల హోలట్ల తిరుగుబాటు. ఫిలిప్పినోషి యన్ సంఘం.

(ఊ) గ్రీకునాగరికత. రంగస్థలం. బానిసత్వంపై నిర్మింపబడిన నాగ రికత. శెలవులు. డయోనిసస్ విందు. విషాదాంత, సుఖాంత నాటకములు. నటకుడు అరిస్టోఫెనీస్.

[ 5 వ తరగతి చరిత్ర పాఠ్యప్రణాళికలోని భాగములు ]

4 వ తరగతి కొన్ని నోటిప్రశ్నలు

## భూగోళ శాస్త్రం

1. పటములో సమానాంతరరేఖలను, భూమధ్యరేఖను చూపుము. ఈ క్రింది పట్టణముల గుండా పోవు అక్షాంశ రేఖలనుచూపుము. మాస్కో, లెనిన్‌గ్రాడ్, వ్లాడివాస్టక్, బాకూ, ఆర్కేంజిల్.
2. సోవియట్‌రష్యా పటములో రష్యాదేశపు భూ సరిహద్దులను చూపుము.
3. సోవియట్ సమ్మేళనంలోని టండ్రాప్రాంతమును చూపుము. టండ్రా ప్రాంతపు శీతోష్ణస్థితి, పెరిగే వృక్ష, జంతుజాలమును వర్ణించుము. ప్రజలజీవన పద్ధతులను తెలుపుము.
4. ఎడారి, స్టెప్పీమైదాన ప్రాంతములను పటములో చూపుము. ఈ ప్రాంతములలోని పెద్దసరస్సులు, సముద్రములను తెలుపుము. ఈ ప్రాంతాలలో వర్షపాతం తక్కువగానుండుటకు కారణములెవ్వి ? ఈ ప్రాంతాలలోనీరుతెచ్చుటకు సోవియట్ ప్రభుత్వం యేమి యేర్పాట్లు చేసినది ?

5. సోవియట్ దేశపు దక్షిణ ప్రాంతంలోని పెద్ద చేపల వేటకేంద్ర నుము పేర్కొనుము. మాస్కోనుండి అచ్చటకు ప్రయాణ మార్గమేది ?

6. ప్రపంచ పటంలో అయిదు ప్రధాన పెట్టుబడిదారీ దేశములను చూపుము. అన్నిటికన్న శక్తివంత మైనదేది ? యెందువలన ?

7. గ్రేటు బ్రిటన్ యొక్క ప్రధాన వలసదేశాలు, అధీనరాజ్యాలను పేర్కొనుము. గ్రేట్ బ్రిటన్ శీతోష్ణస్థితి, పరిశ్రమలనుగూర్చి చెప్పుము.

8. ఇటలీ ఎచ్చటనున్నది ? ఇటలీకి చెందిన వలసదేశాలను పటములో చూపుము. స్పెయిన్‌లోనున్న ఫాసిస్టులకు, ఇటలీయేల సహాయం చేయుచున్నది.

## ప్రకృతిశాస్త్రం

1. (అ) మాంసాహారులైన మూడు పక్షులయొక్క, పురుగులనుతినే రెండు పక్షులయొక్క, తృణధాన్యపు గింజలను తినే రెండుపక్షుల యొక్క అంగనిర్మాణ లక్షణములను చెప్పుము.
   (ఆ) కుక్కకు పెద్దదవడలును. మానవునకు ముఖమునుయెందుకు ఉన్నాయి. మూడు హేతువులను తెల్పుము.

2. (అ) కోళ్ళ పుట్టుదల, మానవుని కుపకరించేరీతి, గుడ్లనుపొదిగే విధానం వివరించుము.
   (ఆ) పాత, కొత్తయెముకల భేదము లేవి ?

3. (అ) వెన్నెముక నిర్మాణమెట్లున్నది ?
   (ఆ) సముద్రపు తాబేళ్ళ లక్షణములేవి ?

4. (అ) ప్రధానజీర్ణ రసములేవి ? జీర్ణకోశమును వర్ణించుము.
   (ఆ) చేతి యెముకలను, పాదములయెముకలను పోల్చుము.

5. (అ) పంచేంద్రియములేవి ? వాటిని వర్ణింపుము.
   (ఆ) పొగ త్రాగుట పిల్లలకేల అపాయకరము ?

6. (అ) మన కెన్నివిధమైన పండ్లు కలవు ? శిశువులలోను, మనుజులలోను అవి యెట్లు మారును ? వాటియందెట్టి శ్రద్ధతీసికొన వలయును?
   (ఆ) పారిశ్రామికధూళి యనగానేమి ? అది యెందువలన అపాయ కరము ?

## పాఠ్యగ్రంథములలోని భాగములు

ప్రకృతిశాస్త్రమునుండి ఉదహరించిన భాగములు.

వేసవి గడచింది. ధాన్యము కంకులలోని గింజలు గట్టిపడి పండిన వెంటనే కోసి, కుప్పలునూర్చి, పంటకళ్ళములనుండి ధాన్యమును సేకరించారు. ఇంచుమించుగా అన్నిమొక్కలు, పైరులు, చెట్లు, పొదలు, ఓషధులుపూచి, కాసి, పండిన తరువాత విత్తులనుత్పత్తి చేశాయి. ఈ విత్తనములనుండి నూత్న సంవత్సరంలో క్రొత్తఅంకురములు బయల్దేరుతాయి. పండ్లలో విత్తనములుంటవి.

చెమ్మనేల, సరిపడు ఉష్ణత ఉన్నప్పుడే విత్తనములు మొలకెత్తుతాయి.

ఆరముగ్గినపండ్లు చెట్లనుండి యేవిధంగా నేలమీదపడి పోతాయో మనకందరకూ తెలుసును. ఆ పండ్లు చెమ్మనేలమీదపడినప్పుడు కుళ్ళి వాటిలోని బీజములు సూర్యోష్ణతవలన మొలుస్తాయి.

కొన్నిచెట్లపండ్లు పండిన తరువాత గట్టిపడతాయి. ఎండిపోతాయి. చిక్కుడు గింజలు, బటాణీలు మొదలైనవి ఈ రకములో చేరుతాయి. ఎండినపండ్లనుండి గింజలు క్రిందరాలుతాయి.

బీజములద్వారా మొక్కలు భూమిమీద వ్యాప్తిచెందుచున్నవి. ఉదాహరణకు పైన్ బర్చీ వృక్షములు అడవుల్లో మాస్కో పరిసరాల్లోనూ, పశ్చిమ యూరప్‌లోనూ, సైబేరియాలోను విస్తరించి వున్నాయి. తల్లి వృక్షం క్రిందనే బీజములు యెల్లప్పుడూ పడుతోంచే మొక్కలు దూర ప్రాంతాల్లో విస్తరించ జాలవు. ఒక మొక్కమీద మరొకటి వత్తుగా మొలిచి నశించి పోతాయి. దూరస్థ దేశాలలోకూడా మొక్కలు వ్యాపించే పద్ధతుల నేకములున్నవని తెలిసికొని యున్నాము.



# కొత్త పైరు మొక్కలు

లోగడ సాగుచేయబడే పైరులేకాక, కొత్తగా అనేక పైరులను మనము సాగుచేయుచున్నాము.

## సోయాబీన్

కొద్ది సంవత్సరములకు పూర్వం మనలో చాల తక్కువమంది మాత్రమే సోయాబీన్సునుగూర్చి వినియున్నారు. కాని చైనా, జపాను దేశాల్లో వేలకొలది సంవత్సరాలనుండి ఈ పైరు సాగుచేయబడుచున్నది. సోయాబీన్ సామాన్య చిక్కుళ్ళ కుటుంబమునకు చెందినది. సోయాబీన్ తెల్లటి పూవులను పూసి, విత్తనపుగింజలను కాయును. ఈ గింజలలో మంచి పుష్టికరమైన ఆహార పదార్థమున్నది. కాబట్టి ఈ మొక్కలను విరివిగా మనము సాగుచేయుచున్నాము.

సోయాగింజలనుండి మనం ఆహారంలో ఉపయోగించే 'సోయా పాల'ను తీస్తున్నారు. ఈ పాలనుండి జున్ను, వెన్న మొదలగు అనేక ఆహారపదార్థములను తయారుచేయుచున్నాము. సోయాగింజలను మరలలో పిండిక్రింద విసరించి, ఆ పిండితో అనేక తినుబండారములనుచేసి, తినుచున్నాము. అందువలననే సోయాబీనును 'శాకాహార మాంసము' అని పిలుచుచున్నారు.

సోయాబీన్ విలువయైన పైరు. అందువలననే మనదేశ దక్షిణ ప్రాంతంలోని యూక్రెయిన్, కాకసస్, క్రిమియాలలో సోయాబీన్ ప్రథమ పంచవర్ష ప్రణాళిక అనతరం 25 లక్షల యకరములలో సాగవుతోంది.

## రబ్బరు మొక్కలు

ఉష్ణమండలంలో పెరుగు మొక్కలనుండి తీసిన చిక్కటి, తెల్లని జిగురు పాలనుండి రబ్బరు లభిస్తుంది. ఆ మొక్కలలో కత్తులతో చేసిన గాట్లనుండి పాలు బయటికి కారును. సోవియట్ సంయుక్త సమ్మేళనంలో ఉష్ణమండల ప్రాంతాలు లేనందువలన రబ్బరుమొక్కలు పెరుగవు.

మనరబ్బరు పరిశ్రమకు కావలసిన రబ్బరు నంతటినీ ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకోవాలి. దిగుమతుల ఖరీదును మనం బంగారంతో చెల్లించాలి. సోవియట్ దేశంలోనే రబ్బరు మొక్కలను పెంచవలసిన

అగత్యం చాలావుంది. తిత్తులకు, గొట్టాలకు, రబ్బరు గుడ్డలకు, టైర్లు, ట్యూబుల పరిశ్రమకు రబ్బరు చాల హెచ్చుగా కావలసివుంది. యుద్ధంలో విషవాయు వ్యతిరేక ముఖ కవచాలకుకూడ రబ్బరు కావాలి.

మన శాస్త్రవేత్తలు మన విశాల సోవియట్ దేశంలో రబ్బరు మొక్కలు పెరిగే ప్రాంతాలను పరిశోధించి స్టెప్పిలలోను, కజక్‌స్థాన్ పర్వత పాద ప్రాంతాలలోనూ రబ్బరు పాలనిచ్చే 'ఖొండ్రిల్లా,టౌసాగిస్' అను రెండు మొక్కలను కనుగొన్నారు. ఈ మొక్కలను పెంచి, అప్పుడేమనం రబ్బరు సరకులను పెంచ నారంభించాము. ఈ మొక్కలు బాగుగా పెరిగే ప్రాంతంలో నాటి విస్తారంగా పెంచుతున్నాము.

మామూలు సారాయినుండి రబ్బరును తయారుచేసే ఒక నూతన విధానాన్నికూడా యీ లోగా మన శాస్త్రజ్ఞులు నూతన పరిశోధవలుచేసి కనిపెట్టారు. సోవియట్ శాస్త్రజ్ఞులు చేసిన మహాత్కార్యాలలో ఇది ఒకటి. అప్పుడే కృత్రిమ రబ్బరును తయారుచేసే యంత్రాలయాలను కట్టారు. మన సోవియట్ రబ్బరునే మనం వాడుకుంటున్నాం.



# మిచురిన్ మహత్తర పరిశోధనలు

ఏకదీక్షతో, శాస్త్రీయపద్ధతులపై పనిచేస్తే ప్రకృతి నే విధంగా జయించవచ్చునో జగత్ప్రసిద్ధి బడసిన మిచురిన్ 'అంట్లు కట్టుట' 'తోటలను పెంచుట'లలో తీసికొనివచ్చిన నూతన విధానముల వలన విశద మవుతుంది.

ఇవాన్ వ్లాడి మరోవిచ్ మిచురిన్ జీవితమునంతా కాయ, ఫలవృక్ష జాతులను అభివృద్ధి చేయడంకొరకు వినియోగించాడు. దక్షిణ ప్రాంతా లలో నైసర్గిక పరిస్థితులనుబట్టి పుట్టి, పెరిగే మొక్కలను మంచుతో కప్ప బడివుండే ఉత్తరశీతల ప్రాంతాల్లో పెంచేందుకు అపరిమిత కృషిచేశాడు.

అక్టోబరు సోషలిస్టు విప్లవంవరకూ మిచురిన్ యితరుల తోడ్పాటు లభించనందువలన ఒక్కడే తన పరిశోధనలను కొనసాగించవలసి వచ్చింది. కోస్లోవ్ పట్టణ పరిసరాల్లో ఆయనకు ఒక చిన్న తోటవుంది. ఆయన భాగ్యవంతుడు కాదు. అయినప్పటికీ దీక్షతో అనేక పరిశోధనలు చేసి, వందరకముల కొత్త మొక్కల జాతులను సృష్టించాడు.

మిచురిన్ తోటలో అనేక జాతుల ద్రాక్షతీగలు కాసి, ఫలిస్తాయి. కాకసస్, క్రిమియా, మధ్య ఆసియా ప్రాంతాలలోనే ద్రాక్షపండ్లు పండుతా యని మనకు తెలుసును. కోస్లోవ్‌లో ద్రాక్ష తీగలను పెంచి పండించుటకు అమెరికన్, దూరప్రాచ్య ప్రాంతాల ద్రాక్షలను కలిపి అంట్లుకట్టి, ఒక క్రొత్తజాతిని సృష్టించాడు. తన తోటలో క్రిమియన్‌జాతి ఆపిలుపండ్లను పండించుటకు దక్షిణదేశపు 'కాండిల్లి' సైబీరియన్ 'కితైకా' జాతులను కలిపి అంటుకట్టి 'కాండిల్లి-కితైకా' ద్రాక్షజాతిని తయారు చేశాడు. ఈ జాతి ద్రాక్షలో 'కాండిల్లి' కుండేరుచి, వాసన, రసం వుంటుంది; 'కితైకా' కుండే శీతలాన్ని ప్రతిఘటించే గుణములు కలిగివుంటాయి.

మిచురిన్ తోటలో తీగెలు, ఫలవృక్షములు, అంట్లు మొదట పెంచ బడతాయి. అటుపిమ్మట యితర తోటల్లోకి, సోవియట్ దేశంలోని వివిధ ప్రాంతాలకూ వ్యాపిస్తాయి.

ఒక సరికొత్త చెర్రీజాతిని మిచురిన్ సృష్టించాడు. ఆఫలం చాల మధురంగాను, సువాసనగాను వుంటుంది. ఆ చెర్రీకి 'అక్టివిద్యా' అని

పేరు పెట్టారు. పశ్చిమ ఆసియా అడవుల్లో యీ జాతి చెర్రీలకు కొన్ని అడవిజాతి దూరపుచుట్టాలున్నాయి.

'చెర్రీ, పక్షి చెర్రీ' లను అంట్లుకట్టి ఒక సంకరజాతి చెర్రీని తయారు చేశాడు. ఆచెట్టునిండా దట్టంగా యెర్రటి చెర్రీపండ్లుకాసి, నేత్ర పర్వం చేస్తాయి. పక్షి చెర్రీలకువలె హెచ్చుగా పండ్లూ, తోట చెర్రీవలె మంచి రుచికలవిగానూ వుంటాయి.

ఆయన తోటలో ఆయన సృష్టించిన అనేక మాత్న జాతులను గూర్చి చెప్పేందుకు మనకిచ్చట స్థలం చాలదు.

మిచురిన్ మహాశయుడు సాధించిన మహత్తర కార్యాలను సోవియట్ ప్రభుత్వం గుర్తించి భూషిస్తోంది. ఆయన తోట నేడొక ప్రధాన పరిశోధనా వాటికక్రింద చేయబడింది. అందులో, ఆయన ప్రారంభించిన పని బహుముఖాలుగా వృద్ధి చేయబడింది. ఆయనకు వలయు సర్వసదుపాయాలు చేయబడ్డాయి. ఆయనకు సహాయకులు నేడెందరో కలరు.

సోవియట్ దేశంలో అత్యున్నత గౌరవ ప్రదమైన 'ఎర్రజెండా' హోదా ఆయనకిచ్చి మిచురిన్‌ను సోవియట్‌దేశం గౌరవించింది. ఆయన జన్మ స్థలానికి ఆయనపేరే పెట్టారు. సోవియట్ సమ్మేళనంలో కోస్లోవ్ అనే పట్టణం యికమీద కనిపించదు; మిచురిన్స్క అనే నగరమే నేటి నుండి మనకు కనిపిస్తుంది.

## చేపల వేటరేవులు, చేపల పెంపకం

చేపలు యెక్కడ దొరుకుతే అక్కడే పడతారుగాని, చాలా హెచ్చు చేపలు దొరికే సముద్ర, నదీప్రాంతాలైన వేట రేవులకు పారిశ్రామిక ప్రాముఖ్యతకలదు. ఈ స్థలాలనుండి పట్టుకున్న చేపలను వివిధ ప్రాంతాలకు యెగుమతి చేస్తారు. ఆ చేపల నెండబెట్టి, ఉప్పులో ఊరబెట్టి, గాలి తగులని డబ్బాలలోపెట్టి, చాలకాలం భోజనయోగ్యంగా నుండునట్లు చేస్తారు.

మన దేశంలో దిగువవోల్గా ప్రాంతంలో ఒక చేపల వేట రేవును నిర్మించుటతో ప్రారంభమైన మన చేపలవేట త్వరలో అన్నినదులకూ వ్యాపించింది. సంవత్సరంలో ఒక కాలంలో సముద్రమునుండి చేపలు నదులలో లోతయిన ప్రాంతాలకువచ్చి గ్రుడ్లను పెడతాయనే విషయం మన చేపల వేటకాండ్రు చాల కాలం క్రితమే కనిపెట్టారు. వీటిని వలస

పోవు చేపలని పిలుస్తారు. ఈ వలస పోయే చేపలలో కాస్పియన్ రోచ్, అస్ట్రఖాన్ హెర్రింగు, వివిధజాతుల స్టర్జియన్, సాల్మన్, కుక్క-సాల్మన్ చేపలుంటాయి.

వసంతకాలంలో యీ చేపలన్నీ నదీ ముఖద్వారాలలోని అగాధ ప్రాంతాలకు వలసవెళ్ళి అచ్చట గ్రుడ్లను పెడతాయి. అప్పుడు వేటకాండ్రు పన్నిన వలలలో అసంఖ్యాకంగా పడతాయి.

చేపలవేటలో సోవియట్ దేశావిదే ప్రపంచములో అగ్రస్థానం. అయినప్పటికీ, మన ప్రలల పోషణకే యీ చేపలు సరిపోవు. అందువలన సోవియట్ ప్రభుత్వం యింకా హెచ్చుచేపలను పట్టుకునేందుకు ప్రయత్నిస్తోంది. సముద్రపు చేపలవేట స్థానముల నభివృద్ధి పరుచుట జోరుగా సాగుతోంది. విప్లవాత్పూర్వం సముద్రంలో చేపలను చిన్నతెరచాప పడవలలో జాలర్లు వేటాడేవారు. ప్రస్తుతం ట్రాలరునౌకలలో, చాల పెద్దవైన ట్రాల్ వలలతో వేటసాగిస్తున్నారు. ఆధునిక ట్రాలర్ నౌకలు. తేలి తిరిగే యంత్రాగారాలని చెప్పవచ్చును. చేపలనుకోసేందుకు, చేపలలో భుజించుటకు పనికిరాని వృధాభాగములను నిలవచేసి గ్లూ, జిలటీన్ పరిశ్రమలలో ఉపయోగించేందుకు, చేపనూనెలను తీసి. సీసాలలో భద్రపరిచేందుకు ఉపకరించే యంత్ర సామగ్రులుంటాయి.

## చేపల పోషణ

మన జలాశయాలలో చాలాపరిమాణముగల చేపలను ప్రతిసంవత్సరం పడుతున్నారు. అందువలన చేపలు క్షయమైపోకుండా, పట్టుకోగా మిగిలిన చేపలజాతి పెరిగి పెద్దదయ్యే యేర్పాట్లు చేయుట అత్యవసరం. అందుకొరకు చేపలజాతులు నశించి పోకుండా సోవియట్ ప్రభుత్వం కొన్ని చట్టాలను చేసింది.

చేపలునశించకుండా చూడటమేకాక, అవి అనేక రెట్లు పెరిగేటట్లు ఏర్పాట్లుచేశారు. మిక్కిలి విలువైన చేపల గ్రుడ్లు పిల్లలై పెరిగేందుకు వలయు సౌకర్యాలు కొన్ని ప్రాంతాలలో చేయబడ్డాయి.

ఆడ చేపలనుపట్టి. తువ్వాలుతో తుడిచి, గ్రుడ్లపొరను జాగ్రత్తగా ఒక పింగాణీ పళ్ళెములో పడునట్లు చేయుదురు. మగ చేపనుతీసి, దాని రజోకణములను (మిల్టు) కూడ పైవిధంగానే తీస్తారు. అటుతర్వాత ఆ గుడ్లపొరను రజోకణములను ఒక పక్షియీకతోగాని వ్రేలితోగాని కలియు

నట్లు చేయుదురు. ఈ విధంగా తెల్లపాలవంటి మగచేపల రజస్సును, ఆడ చేపలగ్రుడ్లను సంపూర్ణముగా కలిసి, పక్వస్థితి చెందుతాయి.

సంయోగము చెందిన గ్రుడ్లపొరను జాగ్రత్తగా తుడుస్తారు. అటుపైని చేపగ్రుడ్లను పొదిగే ఒక ప్రత్యేక ఉపకరణంలో వాటిని పెడ తారు. అప్పుడు ఆ గ్రుడ్లు పొదగబడి చేప పిల్లలు తయారౌతాయి. ఈ విధానం వలన నూటికి డెబ్బది చేపలు గ్రుడ్లనుండి పిల్లలౌతాయి. కాని ప్రకృతి సహజంగా పిల్లలయ్యే చేపల గ్రుడ్లలో, మగ చేపల రజోకణ ములు ప్రవాహంలో వాలుగాకొట్టుకొని పోవడంవలన సరిగా సంయోగం జరుగక పోవుటవలనను, జంతువులు తినివేయుట వలనను చాల గ్రుడ్లు పిల్లలవకుండానే నశించిపోతాయి.

## కోళ్ళు

కోళ్ళు: వాటి పుట్టుక:—ఉష్ణదేశములైన ఆగ్నేయ ఆశియా, ఇండియా, సిలోన్, సన్‌దే దీవులలో దట్టముగా పెరుగు పొదలక్రింద మన పెంపుడు కోళ్ళకు అతి దగ్గరచుట్టాలైన అడవిజాతి కోళ్లు నేటికీ కని పిస్తాయి. అడవిజాతి కోడిపుంజులు పల్లెలలో సామాన్యంగా మనంచూపే కోళ్ళవలెనే ముదురు రంగుల యీకలు కలిగి వుంటాయి. బంగారువర్ణపు మెడ, యెర్రటివీపు, నల్లటి రెక్కలు, లోహవర్ణపు కొడవలివలె వంగి వుండే తోక యీకలు నిగనిగలాడుతూ వుంటాయి. బాంటముజాతి అడవి కోళ్ళుకూడా "కొక్కొరోకో"యని కూస్తాయి కనుక పెంపుడుకోళ్ళు కూడా యీ జాతికి చెందినవే అయ్యుంటాయనేందుకు యిది బలవత్తరమైన నిద ర్శనం. కోళ్ళ నెందుచేత పెంచుతారు? ఏ అమూల్య లక్షణములనుచూచి మానవుడు అడవిజాతి కోళ్ళను పెంపుడు పక్షులుగా చేశాడు? వాటివలన యే ఉపయోగములను పొందుతాడు?

మొదటి ఉపయోగం:— కోళ్ళు మాంసము కలిగి బలిష్ఠంగా వుంటాయి. కోడిమాంసం రుచికరమైన భక్ష్యము. అందువలననే నల్ల గ్రౌజు మున్నగు అడవి కోళ్ళను వేటాడుతాము. వీటి మాంసం కొరకే కోళ్ళను పెంచుతాము. ఇంకా యెక్కువమాంసం కలిగిన పెద్దకోళ్ళజాతిని వృద్ధి పరిచేందుకు నిరంతరాయంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రెండవ ఉపయోగం:— అడవిజాతి కోళ్లు యెక్కువగా యెగుర జాలవు కాన భూమిమీదనే ఆహారమును యేరుకుని కడుపు నింపుకుం

టాయి. కోళ్ళను పెంచినందువలన దొడ్లను, గుడిసెలను వదలి కోళ్ళు యెగిరిపోవు.

మూడవ ఉపయోగం :—కోళ్ళు గ్రుడ్లనుపెట్టి పొదిగేజాతి అవడం ప్రధానమైన ఉపయోగం. గ్రుడ్డులోనుండి పైకివచ్చిన పిల్లలు వెంటనే తల్లిననుసరించి తిరిగి మేత తింటాయి. గూళ్ళలోవుండే పక్షుల పిల్లలకు యెగిరేశక్తి వచ్చువరకు తల్లి పక్షులే పోషించాలి. గూటి పక్షులు తక్కువ గ్రుడ్లను, చిన్న గ్రుడ్లను పెడతాయి. ఈగ్రుడ్లలో స్వయం పోషకశక్తి కల పిల్లలు బయల్వెడలుతాయి. కోడిగ్రుడ్లు బహు పుష్టికరమైన ఆహారం కనుక, పెద్దగ్రుడ్లను పెట్టే కోళ్ళను మనుష్యులు పెంచుతారు.

పెద్దగ్రుడ్లనే కాక, పొదిగేకోడి తన రెక్కలతో కప్పకలిగినన్ని హెచ్చుగ్రుడ్లను పెడుతుంది. ఈ సంతానానికి ఆహారంతెచ్చి తల్లిపోషించనవసరంలేదు. కోడిపిల్లలు పుట్టినప్పటినుంచి స్వతంత్రంగా బ్రతకడం వల్ల తల్లి పక్షులు తేలికగా, ఎక్కువ పిల్లలను పోషింపగల్గుతున్నాయి.

కోళ్ళ జీవితంతో మానవుడు జోక్యం కలిగించుకోకపోతే పెట్టిన గ్రుడ్లనన్నిటినీ తల్లికోళ్లు పొదుగుతూవుంటాయి. కాని మానవుడు గ్రుడ్లను ఆహారం కొరకు తీసుకొనడం వలన దానికి పొదిగే అవకాశంలేక తిరిగి గ్రుడ్లు పెడుతుంది. సం॥నకు నూరునుండి నూటయాభై వరకు గుడ్లు పెడుతుంది.

కోళ్ళ జాతులు :—కోళ్ళను పెంచటం మొదలిడిన తర్వాత ఈకలు, పరిమాణములలో తేడాగల అనేక జాతులను అభివృద్ధి పరిచారు. ఈజాతు లన్నిటిలోను పెద్దగ్రుడ్లనుహెచ్చుగ్రుడ్లనుపెట్టి,శీతోష్ణములకు తాళే బలిష్టమైన జాతులు పరమ ముఖ్యమైనవి. ప్లిమత్, లెగ్‌హారన్, రోడ్‌లు యీజాతులలో శ్రేష్ఠమైనవి. పెంపుడుజాతి కోళ్ళ స్థానే యీజాతి కోళ్ళను పెంచుటకు మనదేశంలో ప్రస్తుతం హెచ్చుకృషి చేస్తున్నాము.

## ఎముకల నిర్మాణం

ఎముకల స్వభావం వాని నిర్మాణము మీదనేకాక, అవి నిర్మింపబడిన పదార్థములపై కూడ ఆధారపడి వుంటుంది. ఎముకలను గురించి తెలిసికొనుటకు యీ దిగువ ప్రయోగములను చేయుదము.

1-వ ప్రయోగము : ఒక పెద్దచేప ప్రక్కయెముకను ఒక తీగ కొనకు కట్టి స్పిరిటు దీపంమీద కాల్చుము, ఆ యెముకకాలి నల్లగా బొగ్గు

అగును. ఆ బొగ్గుకూడ కాలితెల్లగానుండును. అనగా యెముక యందలి కాలెడి పదార్థమంతయు కాలిపోయి, కాలని ఖనిజ పదార్థము (బూడిద) లు మిగులుతాయి. కాలిన తర్వాత యెముక లక్షణములెట్లు మారినవో చూతము. మంటలోనుండి కాలి తెల్లగానైన యెముకను తీసి, చల్లార నీయుము. ఇప్పుడు నీవ్రేళ్ళతో ముట్టుకొనుము. ఆయెముక తేలికగాపగిలి పొడియై పోవును. కాల్చని యెముక గట్టిగాను, పెళుసుగాను వుండును.

2. ప్రయోగము : మరొక యెముకను (చేపయొక్క యెముకను) తీసికొని ఒకగాలిగొట్టమునందుంచి హైడ్రోక్లోరిక్కుద్రావకమునుపోయుము. ఎముకలోని ఖనిజ పదార్థము ద్రావకములో కరుగును. బొగ్గుపులుసు వాయువు బుడగలు పైకివచ్చును. ఆ యెముకను ద్రావకములో అవిధము గానే ఒకటిరెండు గంటలుగాని, మరుసటి పొతము వరకుగాని ఉంచి వేయుము.

ద్రావకములో చాలకాలము యెముకనుంచి తీసినపిదప నీళ్ళలో కడిగి తుడిచినతర్వాత, దాని లక్షణములను పరిశీలింపుము. ఎముక బహు మెత్తగాను. వంపులు తిరగగలదిగాను ఉంటుది. దానిని వంచి గుండ్రగా ముడికూడ వేయవచ్చును.

దీనినిబట్టి యెముకయొక్క గట్టి, పెళుసు తనములు దానిలోని ఖనిజ పదార్థముల వలనను, మృదుత్వము. వంకరతిరిగెడు స్వభావములు సజీవ రసాయనిక పదార్థముల వలనను కలిగిన లక్షణములని తెలిసికొన గలము.

## పరిశుభ్రమైన గాలి

ప్రాణాధారములైన పదార్థములలో గాలి ముఖ్యమైనది. మనల నావరించుకొని యున్న గాలి నుండి ప్రతిదినము 600 లీటర్ల ప్రాణ వాయువును పీల్చుకొని యించుమించుగా అంతే బొగ్గుపులుసు వాయువును వదలి వేయుచుందుము. అందువలన మన చుట్టూవున్న గాలి సంయో జనములో మార్పు కలుగుచుండును. ఈ మార్పును మనము గుర్తించ గలము. చాలమంది మనుష్యులు ఒక గదిలో చాలసేపు కూర్చున్నచో, ఆ గదిలోనికి ధారాళంగా గాలివచ్చి పోవుటకు మార్గములు లేనిచో గాలి వేడియెక్కి, మన తలలు దిమ్మెత్తి పనిచేయవు. గదినుండి బయటికి వచ్చినచో పరిశుభ్రమైన గాలి మన దేహమున కెంత ఆవశ్యకమోగుర్తిం

చగలము. అందువలన మనము నివసించి, పనిచేసే ఇండ్లలోనికి నిరంతరంగా పరిశుభ్రమైన గాలి, వెలురులు వచ్చునట్లు యేర్పాట్లుచేయుట చాలా అవసరం. మన ఇండ్లవద్దను, పాఠశాలలోను కిటికీలను తెరచియుంచుటే కాక, వీలున్నంతవరకు బహిరంగ ప్రదేశములో పరిశుభ్రమైన గాలిని పీల్చుచుండవలయును.

ధూళి దూసరితమైన గాలికూడ దేహమునకు మంచిదికాదు. మనం పీల్చిన దుమ్ము గాలిగుండా, దుమ్ము శ్వాసకోసంలో ప్రవేశించి ఊపిరి తిత్తులను పాడుచేయును. కొన్ని కర్మాగారములలో సిమెంటు, బొగ్గు, పొగాకు, లోహములు మొదలైన పలుచటి రేణువులు గాలిలోకలిసి పీల్చిన గాలిగుండా ఊపిరితిత్తులలో ప్రవేశించి వాటిని చెడగొట్టును. దుమ్ముతో మనంచేసే పోరాటంలో యంత్రాగారాలను పరిశుభ్రముగా బాగు చేయుట, ధూళిని పోగొట్టే విద్యుద్వీవనల నమర్చుట, యెక్కువ మార్గముల నేర్పరచుట మున్నగు అనేక సాధనములను యేర్పాటు చేయుచున్నాము.

ధూళిలో లక్షలాది సూక్ష్మజీవులుంటాయి. వీటిలో మనకు పరమ శత్రువైన క్షయ క్రిములుకూడ ఉండును. కాన మనము పీల్చేది వాయువుతో అవి లోన ప్రవేశించి భయంకరమయిన క్షయరోగము కల్గును. క్షయరోగమును నిర్మూలించాలంటే ముందు ధూళి లేవకుండా చేయాలి. క్షయ నివారణల సంస్థల నెన్నిటినో మన దేశంలో నెలకొల్పియున్నాము. విప్లవానికి పూర్వం కష్టజీవులకిట్టి సౌకర్యములుగాని సదుపాయములుగాని మనదేశంలో ఉండేవికావు. సోవియెట్ ప్రభుత్వంచేతనే అవియన్నీ నెలకొల్పబడ్డాయి.

మనం పీల్చేగాలి ముక్కు పుటాలద్వారాగాని, నోటిద్వారాగాని ఊపిరి తిత్తులలోనికి పోతుంది. ముక్కు రంధ్రాలలోనున్న వెంట్రుకల వలనను, శ్లేష్మమువలనను గాలిలోనున్న ధూళి, సూక్ష్మక్రిములు అడ్డుకొనబడి, అంటుకొనిపోతాయి గనుక గాలి చాలవరకు పరిశుభ్రం చేయబడుతుంది. ఇంతేకాక మనం పీల్చేగాలి చల్లగా నుండినయెడల వెచ్చబడి శ్వాసకోసం, ఊపిరితిత్తుల చల్లదనంవలన చెడిపోకుండ కాపాడ బడతాయి. ముక్కుతోనే గాలిని పీల్చుకునే అలవాటును చేసుకోవాలి. పరిశుభ్రమైన గాలికొరకు మనం చేయవలసిన పోరాటంలో పొగ త్రాగడాన్ని మాన్పించుట ప్రధానస్థానం ఆక్రమిస్తుంది. పొగ త్రాగడం విషం త్రాగడ

మన్నమాటే. చుట్టపొగలో నికోటిన్ అనే విషముంటుంది. నికోటిన్ దేహాన్ని క్రమంగా విషపూరితంచేసి, ధ్వంసంచేస్తుంది. బాల బాలికలకు, యువతీ యువకులకు చుట్టపొగ గొప్ప హానిని కలిగిస్తుంది. పొగ పీల్చేది. వారు వారు చెడటమేకాకుండా చుట్టూనున్న వాతావరణాన్నికూడ విష కలుషితం చేస్తారు.

పరిశుభ్రమైన గాలికొరకు పోరాటం గొప్ప జనసమ్మర్దముండే పారిశ్రామిక నగరములలో చాలా క్లిష్ట సమస్యయైంది. ఈ పట్టణములలోని గాలి ధూళి దూసరితమై, సూక్ష్మ క్రిమి పూరితమై, ధూమ కలుషితమై వుంటుంది. ఈ చెడుగుల నెదుర్కొనేందుకు, వీధులను ప్రతినిత్యమూ కడిగి బాగుజేయుచుండవలయును. చెత్త చెదారముల నెప్పటి కప్పుడు తీయించివేయవలయును. పుష్పవాటికలను, వృక్షములను హెచ్చుగా పెంచుచుండవలయును. పట్టపగలు సూర్యరశ్మిలో పచ్చటి ఆకులు గాలి లోని బొగ్గుపులుసు వాయువును పీల్చుకొని, ప్రాణవాయువును వదులు తాయి. ఈ విధంగా చెట్లు చేమలు మనుష్యులకు అమూల్యసేవ చేస్తు న్నాయి. అందువలన పుష్ప, ఫల, తరు, లతాదులను నాటి, నీరుపోసి పెంచడంలో విద్యార్థులత్యమితంగా శ్రద్ధవహించాలి. పరిశుభ్రమైనగాలి కొరకు పోరాటంసాగించడం ప్రజల ప్రధాన ధర్మం.

## జంతుశాస్త్రపాఠాలు మాస్కోలో 1933 లో ప్రకటితం

1. ఈక్రింది ప్రశ్నలకు జవాబులు చెప్పుట మూలకంగా జంతువు లలో అతిసూక్ష్మమైన వాటిని వర్ణించుము.
   - (అ) వాటిదేహంలో యెన్ని కణములున్నవి ?
   - (ఆ) కణములలోని ముఖ్యభాగములేవి ?
   - (ఇ) కేంద్రముల సంఖ్యయెంత ?
   - (ఈ) అవి ప్రాణవాయువును, ఆహారమును యెట్లు తీసు కుంటాయి ?
   - (ఉ) బొగ్గుపులుసు వాయువును, అనవసరపదార్థములనుయెట్లు విసర్జిస్తాయి ?
   - (ఊ) సంతానాభివృద్ధి నెట్లుచేస్తాయి ?
2. భూమిమీద ఉద్భవించిన ప్రథమ జీవకణాలేవి ?

3. కుళ్ళు గుంటలలోను, మురికి కాల్వల వద్దను దోమలెందుచేత నివసిస్తాయి ? మలేరియా అట్టి ప్రాంతాలలోనే యేల వ్యాపించును ?

4. అన్నిదోమల కాట్ల వలన అంటురోగములేల వ్యాపించవు ?

## పరాన్నభుక్కులైన పురుగులను నాశనంచేయుటయెట్లు ?

పరాన్నభుక్కులైన చీడపురుగు లత్యమితంగా కలవు. అవి మనుష్యులకు, జంతువులకు తీరని అపకారం చేస్తాయి. అందువలన మనం వాటిని నాశనం చెయ్యాలి. ఏదైనా ఉపద్రవం సంభవించిన తర్వాత యెదుర్కొనే కంటే సంభవించకుండా చేయడం మంచిది. ఆ పురుగులుపుట్టి పెరుగకుండ నిరోధించే ప్రయత్నములను చేయుటచాలమంచిది.

అట్టి నివారణ చర్యలలో పరిశుభ్రత పరమ ముఖ్యమైనది. భోజనముచేయుటకు ముందుచేతులను, పాదములను శుభ్రముగా కడుగుకొనవలెను. కూరలను కడుగకుండా తరిగి వండరాదు. ప్రవాహములేని, నిలచి కుళ్లుచుండెడి నీటిలో విషక్రిములుండునుగాన త్రాగరాదు. కటికిదుకాణాలలో మంచిదని ముద్రవేయని పందిమాంసమును తినరాదు. గోళ్ళవద్ద నులిపురుగు సంబంధమైన సూక్ష్మక్రిములుండునుగాన గోళ్ళను పంటితో కొరకరాదు. చీడ, గజ్జిసంబంధమైన వ్యాధులు వ్యాపించునుగాన వీధి కుక్కలనంటరాదు. మన పెంపుడు జంతువులకిట్టి వ్యాధులు కలుగకుండా చేయవలెనంటే మంచి శాలలు, నీటి తొట్లు ఉపయోగించి తరుచుగా వాటి దేహములను కడగాలి.

ప్రయోగాభ్యాసం :—నల్ల బొద్దింకను కోసి పరీక్షించుట.

(అ) నల్లబొద్దింకను నిలువుగా కోసినపుడు సన్నటి పొడుగాటి వీపుమీదవుండే రక్తనాళం కనిపిస్తుంది.

(ఆ) బొద్దింక లోపలి అవయవములలో స్ఫుటంగా కనపడే అవయవం నల్లని కందనకాయ. అచ్చటినుండి ఒక పొడుగాటి ప్రేగు బయల్దేరుతుంది. ఆ ప్రేగును స్పష్టంగా పరీక్షించుటకు దాని ప్రక్కలను జాగ్రత్తగా పట్టుకారుతో దూరముగా నుండునట్లు పట్టవలయును. పొత్తికడుపు, తెల్లటి చిన్నకాలేయము, పెద్దప్రేగులు కనపడతాయి. పెద్ద ప్రేగునుండి బయల్దేరిన ఒక జత పక్కప్రేగులుగూడ కనిపిస్తాయి. ఇవే మూత్ర, మల విసర్జన గొట్టములు.

(ఇ) ఈ అవయవముల మధ్య తెల్లటి కొవ్వువంటి పదార్థం ఉంటుంది. అది పురుగుయొక్క పోషక పదార్థముల నిల్వ. ఆకొవ్వు పదార్థం, లోపల అనేక మార్పులను పొందుతుంది.

(ఈ) పెద్దపేగును పైకితీసి, అందులోని కొవ్వును తీసివేసి పరిశుభ్రం చేయగా, రక్తనాళములు కనిపిస్తాయి. బొడ్డు రంధ్రముక్రింద ఒక తెల్లటి నరములముడి వుండును.

(ఉ) జననాంగములు ప్రక్కనుంటాయి. అవి తెల్లటి గొట్టముల కట్టవలెనుండి, మగజాతిలోకన్న ఆడజాతిలో హెచ్చుగా వుంటాయి.

(ఊ) శ్వాసనాళము బహు సూక్ష్మంగా నుండును కాన పరీక్షించుట కష్టం. అతి సన్నమైన గొట్టములు కోసివేయ బడతాయి. గొట్టముల వలె నుండు ప్రక్క శ్వాసనాళములు రెంటినీ పరీక్షించవచ్చును. బొడ్డు ముడి నుండి ప్రారంభించిన రక్తనాళములకు సమానాంతర రేఖలో రెండు శ్వాసగొట్టములు ఉంటాయి.

## ప్రకృతిలో సరిపుచ్చుకొను తత్వము

పురుగులు విభిన్నమై, లెక్కకు మీరియున్నవి. వాటి బాహ్యస్వరూపము, జీవితపద్ధతి, స్వభావములుకూడ విభిన్నముగా నుండును. వీట న్నిటిలోను ప్రస్ఫుటంగా కాన్పించే ముఖ్యలక్షణం వాటికిగల అత్యద్భుతమైన సరిపుచ్చుకునే శక్తి.

పరిసరములకు, అవసరములకు తగినట్లుండెడి జంతువుల అవయవ నిర్మాణము, వృత్తులను చూపి భగవంతుని అస్తిత్వమును నిరూపించేందుకు మతము చాలకాలమునుండి ప్రయత్నం చేస్తోంది. 'చూడండి, యెంత పరమాద్భుత విజ్ఞానంతో సృష్టికర్త సర్వజీవులను సృష్టించాడో! మానవాతీతమైన అసాధారణ ప్రజ్ఞావంతుడు కాకపోతే చీమలు, తేనెటీగల వంటి జీవులను సృష్టించి వాటి శరీరములోని అంగనిర్మాణమును, అవసరములను తీర్చుటకు తగినట్లుగా సృష్టి జరుగజాలదు. పుష్పంలోని మధువును గ్రోలేందుకు తొండమును పెట్టాడు. భూమిలో కన్నముచేసి నివసించే అడవియెలుక ముందు పాదములు పారలవలె వుంటాయి. మగ తేనెటీగల పాదములు పుష్పములనుండి తేనెను సంగ్రహించుట కుపయుక్తముగ నిర్మింపబడి యుండును. అఘటన ఘటనాసమర్థుడు మహాశిల్పి

యైన సర్వేశ్వరుడు తప్ప యింత విచిత్రమైన జంతుజాలాన్ని ఎవ్వరు సృష్టించ గలరు ?

కాని విజ్ఞానశాస్త్రం సృష్టికి యీశ్వరునికి యెట్టిసంబంధము లేదని, నిరూపించింది. యీ వస్తువులు జాగ్రత్తగా అమర్చబడనూలేదు, శ్రద్ధతో దూరదృష్టితో నిర్మించబడనూలేదు.

ఏది పరిసరాలకు సరిపుచ్చుకొనలేదో, అది నశిస్తుంది. అది ఒక ప్రకృతి నియమం. ఉనికికొరకు సంఘర్షణలో సరిపుచ్చుకొనగల తత్వంగల జీవులు మాత్రమే జీవిస్తాయి. అడవిపందిపై యీకలు మొదలుకొని శరీరంపైనుండే ప్రతి చిన్న అంశమూ యీ సంఘర్షణలో నెగ్గి నిలబడినదే. చెట్టు బెరడువంటి రంగురెక్కలుగల సీతాకోక చిలుక శత్రువుల దృష్టి నుండి తప్పించుకోగలదు.

చెట్టు బెరడుకంటె భిన్నమైన రంగుగల రెక్కలుంటె అది నశిస్తుంది. సీతాకోక చిలుకజాతికిచెందిన అనేక రకములలో అనుక్షణ పరివర్తనము వలన, చెట్టు బెరడు రంగునకు, సరితూగు వర్ణముగల రెక్కలను గలిగిన సీతాకోక చిలుకలు మాత్రమే బ్రతికి, వాటి సంతతికికూడా ఆ లక్షణములనే కలుగచేయును. ఈ లక్షణములు సంతతినుండి సంతతికి సంక్రమించును. అట్లు రంగును మార్చుకొని పరిస్థితులకు, అవసరములకు అనుగుణ్యముగా సరిపుచ్చుకొనలేని ఇతరరకములన్నీ నశించాయి. అయితే సీతాకోక చిలుక రెక్కలవర్ణము ఒక చెట్టుమీద వాలినప్పుడు మాత్రమే వాటిని రక్షించగలదు. ఆ రంగునకు భిన్నమైన మరొక రంగు చెట్టుమీద వ్రాలినపడు ఆ చిలుకలు దూరమునకు స్పష్టముగా కనబడిపోవును. దీనివలన సరిపుచ్చుకొను విధానము కొన్ని షరతులకులోబడి మాత్రమే ప్రయోజనకారిగా ఉండగలదని తెలియగలదు. ఈ పరిస్థితులు మారిన వెంటనే యీ ఆశ్చర్యకరమైన విధానము నిరుపయోగమైపోవును.

## పరిస్థితుల కనుగుణ్యంగా మార్పుచెందినవే నిలువ గల్గుతాయి

పరివర్తనశక్తి ఫలితంగా ఒకేజాతి జీవులలో యేరకం తదితర రకములకంటె యెక్కువ వీల్లు కలిగివుంటుందో, ఆ రకం జీవులకు రక్షణ, స్వజాత్యభివృద్ధి సౌకర్యములు, ఉనికికొరకు సంఘర్షణలో హెచ్చుగా సావకాశము లుంటాయి. పరివర్తనము ఏ రకం జీవులలోనైనా చెడ్డ పరిస్థితులకు దారితీస్తే ఆ రకంజీవి వినాశనమౌతుంది. ప్రయోజన కరమైన

మార్పులను పొందుతూ చెడుగును కలిగించే లక్షణములను నాశనం చెయ్యడాన్నే ప్రాకృతిక ఎన్నిక అని అంటారు. జంతు, వృక్షశాస్త్రము లలో తరుచుగా చెప్పబడెడి పరిసరముల కనుగుణ్యంగా సరిపుచ్చుకొనే తత్వం, పరివర్తనశక్తి, వంశ పారంపర్యత, ప్రాకృతిక ఎన్నిక అనే శాస్త్రీయ సిద్ధాంతములమీద ఆధారపడివుంది. శత్రువులనుండి కాపాడే జంతువుల అంగనిర్మాణము, రంగు, ఇతరుల ననుకరించగల సామర్థ్యము, కొన్ని పురుగుల శీతాకాలపు మగత, పోయిన అంగములను తిరిగి పొందగలుగుశక్తి, ఎక్కువగ్రుడ్లు నశించిపోయే పరిస్థితులున్న జాతులు, హెచ్చు గ్రుడ్లను పెట్టగలుగుట మున్నగువాటికికూడా పైనచెప్పిన ప్రాకృతిక విధానములే సమాధానమిస్తాయి.

జీవుల అంగ నిర్మాణముకూడా ప్రాకృతిక నియమముల ఫలితమే. సర్వేశ్వరుడైన సృష్టికర్తయొక్క పరమాద్భుతశక్తి, విజ్ఞానములగూర్చి కట్టుకధలల్లి పురాణకాలమునుండి ప్రచారముచేసి, మానవుని మనోవికాసమును నిరోధించిన మత బోధకులు భగవన్నిరూపణ కొరకు చెప్పెడి గొప్ప శక్తివంతమైన వాదనను, ప్రకృతిలోని పరిణామతత్వము, ప్రాకృతిక యెన్నికలను శాస్త్రీయ సత్యములు ఖండించివేసినవి. పరమేశ్వరుని అత్యద్భుత సృష్టి నైపుణ్యమును భావించి కొలిచే మతానుయాయుల, నిమూఢత్వమునకే శాస్త్రీయసిద్ధాంతములు గొడ్డలిపెట్టయి, అజ్ఞానాంధకారాన్ని పారద్రోలాయి. ప్రాకృతిక యెన్నిక సిద్ధాంతాన్ననుసరించి జంతు, వృక్షజాతులు ప్రకృతి పరిసరముల కనుగుణ్యంగా పరివర్తనము పొందుచు ఉనికికి అర్హులగుతూవస్తున్నాయి. జీవశాస్త్రవర్గీకరణంలోని ప్రాథమికజీవం యెందువలన స్థిరంకాక మార్పుచెందుతూ వుటుందో, యిప్పుడు మనం తెలుసుకోగలము. ప్రతివర్గమూ పరివర్తనశీలము గలది. అవసరమును బట్టి మారుతుంది. అట్టిమార్పుచెందిన వర్గములను కని, పెంచి, వృద్ధిచేస్తుంది. ప్రాకృతిక యెన్నిక, అనవసరమూ ప్రయోజనరహితమూ ఐనవాటిని జీవవర్గములలో నశింపజేసి ప్రయోజనకరమైన ఆంగిక, వర్ణ విశేషములనే వృద్ధి పొందనిచ్చి ఉనికికి అర్హులనుచేస్తుంది. అనేక విభిన్నవర్గములేవో సృష్టివైచిత్ర్యమువలన జన్మించి జీవిస్తున్నాయనిపూర్వం అభిప్రాయపడేవారు. కానినేడుకొత్త వర్గములు కేవలము హఠాత్తుగాసంభవించినవికావనీ, ప్రాకృతికయెన్నివలన కలుగుతూన్న నవ్యవర్గములనీ మనకు తేటతెల్లమౌతున్నది.

మనమిప్పుడు పరిణామ సిద్ధాంతముయెక్క ప్రాథమిక సూత్రముల నీక్రిందివిధముగా సూత్రీకరణముచేయగలము.

1. ప్రతిజీవరాశికి చెందినవర్గములన్నియు పరివర్తనశీలము కలవి కత్పలితముగ అవియన్నియు ఒక దానినుండి మరొకటి ఆకారము మున్నగువాటిలో విభిన్నమై, విలక్షణమైయుండును.
2. ప్రతిజీవి భౌతికశక్తులతో నిరంతరాయంగా ఉనికికొరకై పరిసర జీవులతోను, ప్రకృతితోను పోరాటము సాగించు చుండవలయును.
3. ఉనికికొరకై పోరాటఫలితముగా జీవార్హమైన వర్గముమాత్రమే బ్రతుకగలదు. ఈ విధంగా ప్రాకృతిక యెన్నిక అమలు జరుపబడుతుంది.
4. వంశ పారంపర్యంగా సంక్రమించిన ప్రయోజనకరమైన అవయవరూపమై ఖరులు సంతానమునకు వచ్చి ఉనికికొరకై పోరాటము సాగించుటకు తోడ్పడును.
5. ప్రాకృతిక యెన్నికవలన విలిచెడు వర్గములు నూతన వర్గములకు పునాదుల వంటివి.

## ఎన్నిక, దానిప్రాముఖ్యత

జంతుపోషణకు, జీవుల అభివృద్ధినితెలుపు ప్రాథమిక సిద్ధాంతముల విజ్ఞానం, వ్యవసాయ కృషికి అత్యంత అవుసరమై యున్నది. మంచి సాధు జంతువులను- ఉపయోగ కరమైన వృక్షములను అభివృద్ధి పరచుటకు ఒక శాస్త్రీయ పద్ధతి ఉన్నది. వంశపారంపర్యంగా మంచి లక్షణాలు కలిగిన ఒకేజాతి సాధుజంతువులను, ఆజాతిలోనే మంచిలక్షణాలు కలవాటితో కలపడంద్వారా ఇంకా మంచి రకం తయారవుతుంది. (పుష్టి గల ఆబోతును, బాగా పాలిచ్చే ఆవుతో కలిపితే పుష్టిగల, బాగా పాలిచ్చే సంతానం పుట్టే అవకాశం వున్నది.) ఇలాగే వృక్షజాతులనుకూడా అభివృద్ధి పర్చవచ్చు.

ప్రాకృతిక యెన్నిక, అభివృద్ధికి మూలమనే విషయం మనకిదివరకే తెలియును. నూతన జాతులను సృష్టించుటకు కలిసే జాతులనుండి అనువంశికముగా సంక్రమించే లక్షణములకు విభిన్నమైన మార్పులను తీసికొని రాజాలము. అందువలన, మున్ముందు యేవి అనువంశిక లక్షణములు, యేవి కావు అను విషయమును స్పష్టముగా తెలిసికొనవలయును. పూర్వ కాలములో జాతులలో, తిండి, శిక్షణల మూలకంగా జాతిలోకొన్ని

విభిన్న లక్షణములను తీసికొని వచ్చుటకు చేసిన ప్రయత్నములన్నీ. అను వంశికము కావుగాబట్టి- ప్రాకృతిక నియమమునననుసరించి యుండకపో బట్టి, నిలువలేక, సత్ఫలితముల నీయలేక పోయినవి. మానవకృషి లేకుండా సంభవించే కొన్ని లక్షణములు ఉపయుక్తమైన వైనా, కొన్ని సమయాల్లో స్థిరంగా నిలువవు.

పరిస్థితుల కనుగుణ్యంగా మార్పులు చెందుట అనువంశికత్వములను గూర్చిన సరియైన విజ్ఞానము లేనిచోట్ల, నూతన లక్షణములతో కొత్త జాతులను సృష్టించుటకు, వందలాది ప్రయత్నములను, చాలకాలమును కావలసి వచ్చును.ఆర్థికంగా ఉపయుక్తమైన కొన్ని అనువంశిక లక్షణములు ఒక సంతతిలో కానిపించక, వాటి తరువాత సంతతిలో సంక్రమించుట కూడా తటస్థించు చుండును. జంతువులను పెంచి వ్యాపారం చేసేవారు, జంతువుల ఆకారము మున్నగు లక్షణములలో మార్పులు తెచ్చుటకు తప్పుడు జాతులను కలిపియు, మొదటి సంతతిలో అట్టి లక్షణ ములు రాకుండుటచేతను, ఆ ప్రయత్నములనే మానివేశేవారు. ఎన్ని విఘాతములకును నిరాశచెందక, ప్రయత్నములను కొనసాగించినవారి అనుభవ, పరిశీలనల వల్లనే ప్రాకృతిక యెన్నిక అను ప్రకృతి సిద్ధాంత మును కనుగొన గలిగారు.

నిరంతరాయంగా చేసి పొందినఫలితములమీద నాధారంచేసి డార్విన్ మహాశయుడు పరిణామ సిద్ధాంతమును చేశారు. ఈ శతాబ్ది మొదటి భాగంలో మాత్రమే జీవుల పరివర్తన తత్వంమీద నాధారపడిన ప్రాకృతిక యెన్నిక, అనువంశిక శాస్త్రసిద్ధాంతములు, మానవ విజ్ఞానాభి వృద్ధికి చాల తోడ్పడినవి. ఉపయుక్తమైన లక్షణములను సంక్రమింపచేసి శ్రేష్టమైన జాతులను తయారుచేయుట విజ్ఞానం వ్యవసాయకృషిలో ఉన్నత స్థానం అలంకరిస్తుంది.

యెన్నిక సిద్ధాంత విజ్ఞానం వలన పొందగలిగే లాభములు అన్ని యితర దేశములకంటె సోవియట్ సంయుక్త దేశమునకు హెచ్చు. జంతు, పక్షి పెంపకము విస్తారముగా చేయునప్పుడు జంతువుల, పక్షుల అవసరం యెక్కువగా వుంటుంది. వీటిలో శ్రేష్ఠమైన జాతుల యెన్నిక, స్పర్ధమీద ఆధార పడకుండా వివిధ అనుభవాలను సరిపోల్చుకొని, ఉత్తమ పద్ధతుల ననుసరించుట వలన సుగమ మౌతుంది. లాభము సంపాదించ వలయు

వనే తృష్ణతో తమ విశిష్ట విజ్ఞానమును గోప్యంగా ఉంచే దేశాలలో అభి వృద్ధిపొంది, వ్యాపించుట కష్టం.

లెనిన్ మహాశయుడు నూతన జాతులను, అంట్లను అభివృద్ధి చేయుపనికి గొప్ప ప్రాముఖ్యత నిచ్చాడు. వర్షము లేమిచే 1921 వ సంవత్సరంలో సంభవించిన కరువు కాలంనుండీ ఆయన వర్షాభావమునకు తట్టుకొని పంటలుపండు సస్యజాతులను సృష్టించుపనికి అత్యమితంగా ప్రోత్సాహమిచ్చాడు. ఆరోజుల నుండే బహుకొద్ది యెన్నిక స్టేషనుల సంఖ్యను, పదిని పెంచారు. నేడు సోవియట్ రష్యాలో అట్టి స్టేషనులెన్నో గలవు. వాటిలో అతి ప్రాముఖ్యమైన శాస్త్రీయ, కృషి జరుపబడుచున్నది. మన సోవియట్ స్టేషన్లు నేటివరకు యెన్నిక విజ్ఞానంలో సాధించిన మహత్తర విజయాలేమి? పరిష్కరించిన సమస్యలేవి?

ప్రొద్దు తిరుగుడు పూల మొక్కలకు, ఓరొబాన్షి అను చీడపట్టి అనేక వందల యకరముల మేరలోనున్న యీ మొక్కలు చెడిపోయెడివి. అందువలన నూనె గింజలైన ప్రొద్దు తిరుగుడు గింజల పంటనష్టమయ్యేది. సారటోవ్ యెన్నిక స్టేషనులో చేసిన పరిశోధనల ఫలితంగా ఒక క్రొత్త రకమైన విత్తనము నేడు నాట బడుచున్నది. ఈ మొక్కలకు చీడపట్టదు. వెనుకటి మొక్కల కంటె యీ మొక్కలు నూటికి నలుబదిపాళ్ళు హెచ్చు గింజలను కాస్తాయి. వర్షములు హెచ్చులేని ప్రాంతాల్లో పెరిగి పండే సస్య జాతులు పెంచబడుతాయి. రై, గోధుమ మొక్కలను అంటుకట్టి ఒక నూతన జాతిని పెంచి, విరివిగా వ్యాపింప జేస్తున్నారు.

మంచు విరివిగాపడే శీతల ప్రాంతాలలో, పెరిగిపండే సస్యజాతిని కూడా అభివృద్ధి పరిచేందుకు అనేక ప్రయత్నాలుచేసి చివరకు గోధుమను-క్విచ్ అనే అడవిజాతి ధాన్యపు మొక్కను అంటుకట్టి, మంచును ప్రతిఘటించి, రెండేండ్లకు మించి ధాన్యమునుకాయు ధాన్యజాతిని సృష్టించారు.

నేటివరకూ సాగుకాని వర్షములు తక్కువగాపడు ప్రాంతాలలోను, మంచు దట్టముగా పడు శీతల ప్రాంతములలోను, ఈ నూత్న పరిశోధనల ఫలితంగా, సస్యములను పెంచగలుగు తున్నారు. సోవియట్ దేశంలో నూతనంగా పారిశ్రామిక ప్రాంతములైన ఖిబైన్సు, యూరల్, కుజ్నెట్సు, స్టాలిన్‌గ్రాడ్‌లకు యీ వ్యసాయక విస్తరణ బహు తోడ్పడుచున్నది.

క్రొత్త యెన్నిక విత్తనములు, సామాన్యజాతుల స్థానము నాక్రమిస్తున్నాయి. గోధుమ, రై, ప్రొద్దుతిరుగుడు మొదలైన జాతులను

పూర్తిగా మానివేసి కొలది సంవత్సరములలో నూతన జాతులను వేయుటకు యేర్పాట్లు జరిగాయి. సాధారణపు బంగాళాదుంపలజాతిని మానివేసి, ఇంకను పెద్ద దుంపలగు జాతిని పెంచుతున్నారు.

మిచురిన్ మహాశయుడు ఫలవృక్షజాతుల పెంపకములోచేసిన యెన్నిక కృషివలన అద్భుతమైన మార్పులు వచ్చాయి. ఆయన ఫల, పుష్ప, కూర, మొక్కలలో రెండువందల అభివృద్ధికరమైన నూతన జాతుల అంట్లను కట్టాడు. అయన మిచురిన్స్కు పట్టణంలో ప్రయోగ క్షేత్రమందు పెంచుచున్న ఆ జాతుల మొక్కలు రష్యాలోని వివిధ ప్రాంతములలోను పెంచబడుచున్నవి.

పెంపుడు జంతువుల పెంపకం విషయంలోకూడా అత్యమితమైన అభివృద్ధి యీ మధ్యకాలంలో జరిగింది. అధికంగా పాలు, ఊలు, మాంసం లభించే ఆవులు, గొర్రెలు, కోళ్ళు, మున్నగువాటిని విశేషంగా పెంచుతున్నారు. శ్రేష్ఠమైన ఆబోతు జాతులను గ్రామములలో పెంచుతున్నారు. మామూలు జాతులకన్న మూడునాల్గు రెట్లధికమైన బరువుగల మాంసపుష్టియైన పందులజాతి నేడు పెంచబడుచున్నది. విభిన్న శీతోష్ణ పరిస్థితులకు తాళుకొనగలిగిన జాతులే నేడు సోవియట్ రష్యాయందు పెంచబడుచున్నవి. మధ్యఆశియాలో చమరమృగమును, ఆబోతును, కలుపుట వలన కొన్ని సంతతుల తర్వాత మంచి దట్టమైన చర్మం శ్రేష్ఠమైన మాంసము, కల జాతు లుద్భవించాయి. ప్రజోజ యోగకరమైన యిట్టి కృషి అవిరళముగా కేంద్ర జంతు పోషణ సంస్థయందు జరుగుచున్నది.

ఈ విధముగా మానవుడు తన ఆర్థిక కృషియందు తన కుపయుక్తము, ప్రయోజనకరమూ ఐన అనేక జాతులను పెంచు చుండుటను చూచుచున్నాము.

## మానవ శరీర నిర్మాణమును గురించిన విజ్ఞానముయొక్క పుట్టుక

పూర్వకాలములో రోగముల నివారణకు మందులు యిచ్చుటకు బూటకపు వైద్యులు పూనుకునేవారు. మత బోధకులే ప్రప్రథమంలో మందుల నిచ్చేడివారు. దేశముకోని నలుమూలలనుండి మందులకొరకై రోగులు మత దేవళముల వద్దకు చేరేవారు. మతాచార్యులు ముడుపులు

మంత్రాలకు తోడుగా యితర సాధనాలనుకూడా ఉపయోగించ నారంభించారు. జంతుబలులు, ఉపవాసములు, పూజలు, జపములు చేయించు మతాచార్యులు కాలక్రమేణా లక్షలాది రోగపీడితులను చూచుచుండుట వలన, మానవదేహములను రోగ లక్షణములను పరిశీలించుట వలన కలిగిన అనుభవంతో వైద్యశాస్త్రమును అభివృద్ధి చేయజొచ్చిరి. నేటికి రెండువేల మూడువందల సంవత్సరములకు పూర్వం గ్రీసుదేశంలో హిప్పోక్రేటస్ అను నాయన వైద్యశాస్త్రము రచించెను. వైద్య కళతో బాటు నాటికి తెలిసినంతవరకు దేహనిర్మాణ శాస్త్ర విషయములనుకూడ ఆయన అందు వ్రాసెను. ఆయనకూడా ఏస్కులేపస్ అను ధన్వంతరిని పూజచేసి ఔషధసేవ చేయవలెనని వ్రాసెను.

వైద్యవృత్తి మతాచార్యుల బారినుండి బయటబడి, స్వాతంత్ర్యము పొందినకాలదీ, దేహనిర్మాణ శాస్త్రవిజ్ఞానముతోబాటు, మానవ సేంద్రియ ముల పనులను తెలుసు కొనవలసిన అవసరమును వైద్యులు గుర్తించిరి. ఉత్కృష్ట జంతువులకును, మానవులకును అంగనిర్మాణములో కల సారూప్యమును, పరిశీలించుట వలన ఆ జంతువులను ఛేదించి వాటి అంగ నిర్మాణమును, వాటి పనులను పరీక్షించ మొదలు పెట్టారు. హిప్పోక్రేటస్ అనంతరం ఐదువందల సంవత్సరాల తర్వాత గెలినస్ అనుఒక రోమన్ వైద్యుడు కోతులను ఛేదించి వేరువేరు యింద్రియముల పనులను, నిర్మాణమును పరిశీలించాడు.

అటుతర్వాత మధ్యయుగాల్లో దేహనిర్మాణ శాస్త్రంయొక్క అభివృద్ధి ఆగిపోయింది. మావవ జంతుజీవ స్వభావ నిర్మాణ కృత్యములను పరిశోధించుట చర్చిచే విషేధించబడింది. జంతువులను. మానవ శవములను ఛేదించి పరీక్షించువాడు మత విద్రోహి, నిలువునా దహించి వేయబడేవారు.

మధ్య యుగానంతరమే శరీర, నిర్మాణ శాస్త్రములు పునర్జీవనం పొందాయి. మానవ శరీర నిర్మాణ, కార్యములను తెలిసికొనవలసిన అవసరం చర్చి అధికార్ల చేత, మానవ శవ విచ్ఛేదమునకు అంగీకరింపజేశాయి.

16, 17 శతాబ్దాలలో మానవదేహ నిర్మాణ విజ్ఞానం అమితంగా కలిగింది. ఐనప్పటికి 19 వ శతాబ్దంలో రసాయనిక, పదార్థ విజ్ఞాన శాస్త్ర అభివృద్ధితోబాటు, శరీర శాస్త్రంలోకూడ విజ్ఞానం హెచ్చింది. ఇంద్రియ

ములలో కలుగుమార్పు క్రమమును రసాయనిక, పదార్థ విజ్ఞాన శాస్త్ర జ్ఞానం లేనిచో అర్థం చేసుకొనలేరు.

రసాయనిక, పదార్థ విజ్ఞానశాస్త్ర విజ్ఞానాభివృద్ధితోపాటు సజీవ, నిర్జీవ ప్రకృతుల మధ్య పెద్ద అడ్డుగోడ లేదని తెలుచున్నది. పదార్థశక్తి అవినాశకత్వ సిద్ధాంతము వంటి ప్రధాన ప్రకృతి సూత్రములు సజీవ నిర్జీవ పదార్థములకు సమంగానే వర్తిస్తాయని, నిరూపింప బడినది. ఇంద్రియము లలో జరుగు కార్యములను రసాయనిక పదార్థ వైజ్ఞానికశాస్త్ర దృష్ట్యా చూచినచో అనూహ్యమైన, అదృశ్య ప్రాణాధారశక్తి, ఇంద్రియ వ్యాపారములను నడుపుచున్నదనే భావన సమంజసమని స్పష్టపరుస్తోంది. ఐన ప్పటికీ బూర్జువా శరీరశాస్త్ర పరిశోధకులలో మత విశ్వాస జనకమైన భావ వాదనల ఎవరో పైనుంచి ఈవ్యవహారాన్నంతా నడుపుతున్నారనే దృష్టి ప్రబలి యున్నది.

జీవముయొక దృశ్యఘటనలకు ఆత్మగాని, ప్రాణాధారశక్తిగాని, కారణ భూతము కాదని నిరూపించే సంకల్పంతో చాలమంది శాస్త్రవేత్తలు ఆ దృశ్యఘటనలన్ని రసాయనిక, పదార్థవైజ్ఞానిక కార్యక్రమ సంభవము లని వాదింపసాగారు. అంటే జీవ, నిర్జీవ స్వభావములకు భేదమేలేదని చూప యత్నించారు.

ఉదాహరణకు మూత్రపిండములో మూత్రము తయారగు పనికి వడబోతయని చెప్పారు. ప్రేవులలో జరుగు ద్రవ పదార్థముల పీల్పునకు రసాయనిక, పదార్థ విజ్ఞాన శాస్త్రములకు సంబంధించిన వ్యాపకత్వము, సచ్ఛిద్రమైన అరలగుండా ద్రవములు ప్రవహించుట యని పేర్లు పెట్టారు.

శరీరశాస్త్ర విజ్ఞానము అభివృద్ధి చెందినకొలదీ జీవకృత్యములను గూర్చిన తేలిక భావనలవలన అసత్యమైన నిర్ణయములకు దారితీయుటే గాక సరియైన విజ్ఞానము కలుగకుండ చేయును. జీవశక్తి కార్యములను 'ఆత్మ' వలనగాని రసాయినిక పదార్థ విజ్ఞానశాస్త్ర కార్యములవలన గాని కలిగినవని చెప్పు శాస్త్రవేత్తలు నేటికికూడా వున్నారు. ఈ రెండు మతాల శాస్త్రవేత్తలు అశాస్త్రీయ పంథానే అనుసరిస్తున్నారు. ప్రకృతి సాధారణ ధర్మములను నిరూపించునప్పుడు, యితర సమూహములనుండి విభిన్నమైన విశిష్ట ధర్మములను స్పష్టముగా నిర్ధారణ చేయవలయును.

వివిధ ఇంద్రియముల యొక్క పోకడలను రూపస్వభావములను అభ్యసించి అనందిగ్ధంగా వెల్లడిచేసి వాటినుండి సామాన్య ధర్మముల

మీద ఆధారపడిన నిర్ణయములను చేయుచే దేహనిర్మాణశాస్త్రము యొక్క లక్ష్యము. ఇట్టి శాస్త్రీయ దృక్పథంతో చూచినచో శరీర శాస్త్ర సిద్ధాంతములు అవాంగ్మానస గోచరములైన 'ఆత్మ' 'జీవశక్తు'లంటైదములు కావని తేలుచున్నది.

## యౌవనదశ

పది రెండు పదునాలుగు సంవత్సరాల వయస్సుమధ్య యౌవన కాలమని పిలువబడే దశ మానవుని జీవితంలో ప్రారంభించును. బాల్య లక్షణమైన ఆటలయందు విపరీత ఆసక్తి కొంతవరకు మందగించును. శ్రద్ధ, ధ్యానములు పట్టుదల హెచ్చును.

ఈ దశ ప్రారంభించునప్పటికే అస్థిపంజరము గట్టిపడి బలపడుతుంది. అక్రమపద్ధతిలో అలవాటుగా కూర్చుండుటవలన కలిగిన వంకరను శరీరములో సరిదిద్దుట చాల కష్టమగును. మాంసకండరముల బలమును, ఖచ్చితమైన కదలికలును హెచ్చును.

ఆ వయస్సునందు వేగముగా పెరుగుచుండుట వలన రొమ్ము యొక్క పెరుగుదల కొందరు పిల్లలయందు సమముగావుండదు. హృదయంకూడా పెరిగి రక్తనాళములవలె పెద్దదియగును. ఆ సమయమందు హృదయముయొక్క వెడల్పునకును, ధమనుల పరిమాణమునకును తేడా కనుపించును. హృదయకోశము పెరిగినంత వేగముగా ధమనులు పెరుగవు. పైగా సంకుచితముగాకూడా నుండును. హృదయము గొప్పశక్తితో ముదుచుకొన్ననేగాని సన్నటి ధమనులగుండా శుద్ధరక్తము శరీరములోని వివిధ భాగములకు ప్రవహించదు.

యౌవన కాలములో హృదయమునకు అమితమైన శ్రమ కలిగించరాదు. యెక్కువ శరీర కష్టమొనర్చి హృదయ మబ్బునట్లుచేసి, హృదయమొనర్చు పనుల హాటంకము కలిగించరాదు.

మాంస గ్రంధులయొక్క ఆంతరంగిక స్రావములలో మార్పుకలుగును. స్త్రీ పురుష జననాంగములకు సంబంధించిన గ్రంధులు అభివృద్ధి చెందుతాయి. హార్మోనులు రక్తములో ఉద్భవిస్తాయి. జనన గ్రంధుల పరివర్తనముతో బాటు యౌవన లక్షణములైన స్వరములో మార్పు, ముఖమునందు వెంట్రుకలు, ఆకారములో మార్పులు సంభవించును.

జనన గ్రంధులలోని హార్మోనులు సేంద్రియముపై గొప్ప ప్రభావము చూపుతాయి.

యౌవన కాలము చాల సంవత్సరముల వరకు ఉండును. మానవ దేహములోని విభిన్న అంగములు విభిన్న కాలములలో వికసించును: బుద్ధి యిరువది ముప్పది సంవత్సరముల మధ్య సంపూర్ణముగా వికసించును. వెన్నెముక అభివృద్ధి యిరువదవ సంవత్సరముతో పరిపూర్తియగును. సర్వసామాన్యముగా మానవులు ఇరువది, ఇరువదిరెండు సంవత్సరముల వయస్సులో యుక్తవయస్కు లగుదురు. ఆ వయస్సునకు సేంద్రియము లన్నియు స్థిరత్వముచెంది, శరీరావయవముల లోని కణజాలముల కృత్యములన్నీ సహజముగా నుండును.

యౌవనకాలము స్వజాత్యభివృద్ధికి అర్హమైన కాలమని యెంచవచ్చును. స్వజాతి వ్యాపకము సర్వ జీవులయొక్క మూలధర్మము. జీవరాసులు యెడతెగకుండా బ్రదుకు చుండుటకు స్త్రీ పురుషుల దాంపత్యజీవితము మూలకారణమౌతుంది. మానవ ప్రవర్తన సహజ జ్ఞానము వలన కాక పరిసరముల ప్రభావమునకు లోబడిన చైతన్యము వలన నడుపబడుచుండును. దాంపత్య జీవితమునకు సంబంధించిన సమస్యలను మనము బాగుగా యోచించినగాని పరిష్కరింప బూనరాదు. ఈ సమస్యలు సమాజమునకు అత్యంతోప యుక్తములని మనము మరువరాదు. ఈ సమస్యల సక్రమ పరిష్కారపు విలువను సోవియట్ ప్రజానీకం గుర్తించింది.

సోవియట్ సమాజ నిర్మాణమునకు, ప్రతి సోవియట్ పౌరుడు ఆరోగ్య వంతులైన బిడ్డలను కనుట చాల అవసరము. మన బిడ్డలు దేహపటుత్వము కలిగి ఆరోగ్యవంతులై మనవలెను. అందుకొరకై దేహపటుత్వము అంగ సౌష్ఠవము కలిగిన తలిదండ్రులు మాత్రమే సోవియట్ సమాజ నిర్మాతలగు బలిష్ఠులు, దేహారోగ్య శ్రీ విలసితులు అగు సంతతికి కారకులగుదురని మనం గుర్తించవలెను.

లేత వయస్సునందే దాంపత్య జీవితమునకు పూనుకొనుట వలన జననాంగముల పటుత్వమును శుష్కింపజేయును గాన శారీరశాస్త్ర దృష్ట్యా అనారోగ్యకరము. అయుక్త వయస్కుల దాంపత్య జీవితము, దుర్బర మనస్కులు. సాముదాయక జీవనమునకు అసమర్థులు అగు సంతతికి కారకు లగుదురు. గాన అట్టి సంగమము సామాజిక దృష్ట్యా కూడ హానికరము.

# 1933 లో మాస్కోలో ప్రకటింపబడిన చరిత్ర పాఠ్యగ్రంథములోని భాగములు

## వర్గములు పుట్టుటకు ముందుసమాజం

మానవజననం: క్రిస్టియన్ పోప్‌లు, మహమ్మదీయ ముల్లాలు హిందూ పీఠాధిపతులు మొదలగు మతాచార్యులందరూ సర్వప్రపంచమూ, జంతుజాలమూ, వృక్షకోటి, మానవులతో సహా యావత్తు జీవరాసులూ పరమేశ్వరునిచే సృష్టింపబడినవని బోధిస్తారు. కాని ఆధునిక శాస్త్రములు సృష్టివివరణలను సాకల్యంగా పరిశోధించి యివన్నీ కట్టుకథలనీ, వీనిలో సత్యము సంపూర్ణముగా మృగ్యమనీ, యావత్తు జీవరాసులూ పరిణామ క్రమంలో ప్రకృతి నియమానుగుణ్యంగా ఉద్భవించినవే కాని మహాద్భుత ప్రజ్ఞావంతుడైన తాంత్రికుని తంత్రముల వలన సృష్టింప బడలేదనీ నిరూపించారు.

భూగర్భశాస్త్రజ్ఞులు: భూగర్భములో లోతుననున్న పొరలనుండి త్రవ్వి బయటికి తీయబడిన పురాణ మానవుని శల్యములు, యెన్నడోనశించి పోయిన జీవరాసుల శల్యములు సృష్టిక్రమమును గూర్చిన సత్యమును వెల్లడించినవి. ప్రథమ మానవు డెన్నడు, యేవిధముగా ఉద్భవించెనో, మానవ జీవరాశి తమ పురాతన స్థితినుండి ప్రస్తుతస్థితి కేవిధముగా మారెనో యీ శల్యముల సహాయముతో భూగర్భ శాస్త్రజ్ఞులు నిరూపించారు.

అతి ప్రాచీనమైన మానవుని శరీర శిథిలము జర్మనీ దేశములోని హీడెల్ బర్గు అను పట్నము వద్ద ఇరవై అయిదు మీటర్ల లోతున దొరికెను. ఈకారణముచేతనే క్రింది దవడయెముకను హీడెల్ బర్గు దవడ యెముక అని పిలుస్తున్నారు. భూమిపై యిరవై అయిదు మీటర్ల పొరలు యేర్పడుటకు రెండు మూడు లక్షలసంవత్సరములు పట్టిఉండునవియు అందుచేత మానవ జననము రెండు మూడు లక్షల సంవత్సరములకు పూర్వమే సంభవించి యుండుననియు శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

మన కాలమునకు 150 నుండి 50 వేల సంవత్సరములకు పూర్వము నివసించిన ప్రాచీన మానవుల సంపూర్ణ అస్థి పంజరములు, నిడి శరీర

భాగములను యూరప్‌లో వివిధ దేశములందు తరువాత తరువాత కనుగొనబడినవి. ప్రప్రథమున మానవజాతి శల్యములు దొరికిన స్థలమైన, జర్మన్ పట్నమైన డస్సెల్‌డార్ఫ్ సమీపంలోనున్న నియాండర్థల్ లోయనుబట్టి ఆకాలపు మానవుని నియాండర్థల్ మానవుడు అనిపిలిచారు.

నేటికి 50 నుండి 20 వేల సంవత్సరములకు పూర్వమేర్పడిన పొరలలో కనిపించిన మానవ అస్థిపంజరములు ప్రస్తుతమానవ అస్థిపంజరములనువిశేషించి పోలియున్నది.

## సామాజిక అసమత్వము ప్రత్యేకపుటాస్థుల పుట్టుక

వ్యావసాయిక, పశుపోషక సమాజములలో ఆదిలోనే అసమత్వమేర్పడింది. కుటుంబ సభ్యుల సంఖ్యలోని హెచ్చుతగ్గులను బట్టి వారు చేయగలుగు కృషిలో కూడ హెచ్చుతగ్గు లేర్పడ్డాయి. చిన్న కుటుంబాల అవసరాలు తక్కువ యగుట వలన ఒకప్పుడు కుటుంబ సంఖ్యపై ఆధారపడిన అసమత్వము స్పష్ట రూపము తాల్చలేదు. కాని దానికి తోడు యితర భేదములు జనించిన వెంటనే ఆభేదము తీవ్ర తరమయింది.

ఒక నూతనప్రాంతమును కొన్ని కుటుంబములకూటమి వ్యవసాయ యోగ్యంగా చేసి, కుటుంబములరీత్యా, తమలోతాము ఆ భూమిని పంచుకొన్నప్పుడు, అన్ని కుటుంబములకూ, మేలు కీళ్ళ వరుసను సమభాగములు లభ్యమగుట దుస్సాధ్యముగా నుండెడిది. భూసారములోని తేడాలనుబట్టి ఫలసాయములోకూడ తేడా లేర్పడ్డాయి. విస్తరించే ఒక కుటుంబమునుండి కొందరు సభ్యులు విడిపోయి ప్రత్యేక కుటుంబముగాయేర్పడునప్పుడు సమిష్టిఆస్తినుండి వారు పొందుభూభాగము తరుచుగా తక్కువ ఫలవంతమైనదిగా వుండేది. నూతన కుటుంబములో సర్వ సామాన్యముగా తక్కువసభ్యు లుండుటయు, వారిపాల బడుభూమి తక్కువ సారవంతమైనదగుటయు తటస్థించేది. వ్యావసాయిక కుటుంబ సమాజములు విడుచున్న కొలదీ వానిలో కొన్ని భాగ్యవంతములు, బలవంతములు, మరికొన్ని భాగ్య హీనములు, బలహీనములు అగుచు వచ్చినవి. అనారోగ్యము, పంటనష్టము, పశునష్టము మొదలగు యీతి బాధలు సంభవించి నపుడు గాని, తిరుగుడు గుంపుల దోపిళ్ళ వలనగాని, దుర్బల సమాజములు పూర్తిగా ఛిన్నా భిన్నమై పోతాయి. ఆ సమాజ సభ్యులు తిరిగి యితర

నూతన సమాజములలో చేరినప్పుడు సమిష్టి ఆస్థిపై అధికారములేక తమ ఆహారము కొరకై దైనందిన విశేషశ్రమపై ఆధారపడవలసి వచ్చేది. ఇట్టి భేదములే పశుపోషక సమాజములలో కూడ వుండేవి. వివిధ కుటుంబములకు వచ్చిన పచ్చిక బీళ్ళల్లో కొన్ని కొలనులకు, నదులకు దగ్గరగాను మరికొన్ని దూరముగానువుండేవి. తత్కారణంగాకొన్నిబీడులలో గడ్డి ఒత్తుగాను, మరి కొన్నింటిలో పలుచగాను ఉండేది. అందుచేత కొన్ని కుటుంబాలకు చెందిన పశువులు బలముగాను, హెచ్చు పాలనిచ్చునవిగాను మరి కొన్నింటికి చెందిన పశువులు నీరసముగాను, తక్కువ పాలనిచ్చునవిగాను ఉండేవి. ఒక కుటుంబము లోని సభ్యులు కొందరు విడిపోయి ప్రత్యేక కుటుంబముగా యేర్పడు నప్పుడు వారి పాలబడిన పశువులు, నీరసమైనవి, లేతవి అనారోగ్యకరమైనవి గాను, పచ్చిక బీడులు చెడ్డవి, యితర కుటుంబముల ధాడి అపాయమునకు సమీపంగా వుండునవి గాను ఉండేవి. ఈ విధంగా పశుపోషక కుటుంబములలో కూడ కొన్ని బలమైనవి ఐశ్వర్య వంతమైనవి గాను, మరికొన్ని బలహీనమైనవి ధనవిహీనమైనవి గాను బయల్దేరాయి.

మారకం ప్రారంభ మగుటతో కుటుంబముల మధ్య అసమత్వం మరింత హెచ్చింది. తమ అవసరములకన్న అధిక వస్తువులను కలిగియున్న కుటుంబములు మాత్రమే మారకము చేయ గలిగేవి. అందుచేత బలహీన ధనహీనమైన పశుపోషక కుటుంబాలకు సరిపడునంత ఆహారము లభ్యమయ్యేదికాదు. బలహీనమైన ధన విహీనమైన వ్యావసాయక కుటుంబాలకు వలయునంత ఉన్ని వస్తువులు లభ్యమయ్యేవి కాదు.

కంచు ఉపరికరణముల రాకతో యీ అసమత్వం మరింత త్వరితంగా అధికమైంది. రాయి ప్రతిచోటా దొరికేది : రాతి పరికరాలు ప్రతిచోటా ప్రతివారూ చక్కగా తయారు చేసుకొన గలిగేవారు. కాని రాగి, తగరము ప్రతిచోటా దొరికేవి కావు. అందుచేత కంచు ఉపకరణములు అన్ని చోటులయందూ తయారు చేయుటకు వీల్లుండేవి కావు. రాగి, తగరము గల కుటుంబ సమాజములు బలీయమైనవిగా ధనవంతమైనవిగా తయారయ్యాయి. అవి కంచు ఉపకరణముల ఉత్పత్తివలన ధనవంతమైనవిగా తయారయ్యాయి. కంచు బాణములు, బల్లెములు, కత్తులు, డాళ్ళు

మొదలైనవి యుద్ధములలో ఉపయోగించడంవల్ల బలీయమైనవి గామ వృద్ధిచెందాయి. దీనికితోడు రాగి, తగరము, కంచు వస్తువుల ఖరీదులు విపరీతంగా పెరిగిపోయాయి. ఆఖనిజములు దొరికి, ఆ వస్తు వ్యాపారము చేయు కుటుంబములు అదిక ధనవంతమయ్యాయి.

కుటుంబ సమాజాలలో కంచు ఉపకరణోత్పత్తి కళ ప్రారంభ మగుటతో సమాజములోని సభ్యులమధ్యకూడ అసమత్వం పెరిగింది. వారిమధ్య ఇదివరకే కొంత ఉన్న అసమత్వం ఇప్పుడధికమయింది. కుటుంబపెద్దలకు, సమాజ నాయకులకు యితర సభ్యులకు లభించు దాని కన్న ఉత్పత్తియైన వస్తువులలో అధికలాభం లభించేది, అందుచేత వారి మధ్య అసమత్వం అతిత్వరితంగా పెరుగనారంభించింది. అవసరములకు మించిన వస్తువులు కలిగిన సమాజ సభ్యులుమాత్రమే వాటిని మారకము చేసి, రాగి, తగరము, కంచు ఉపకరణములను కొనగలిగెడివారు. ప్రధా నంగాకుటుంబ పెద్దలు, నాయకులు మాత్రమే అవసరములకు మించిన వస్తు వులుకలిగి యుండెడివారు. అందుచేత ఆహార పదార్థాములనేకాక, ఆయుధ సామగ్రినికూడా వారు కొన గలిగెడివారు, కొనెడివారుకూడ. కంచు గొడ్డళ్ళు. కొడవళ్ళు, కత్తులు, నాగేటి కర్రులు కలగియుండెడి కుటుంబ పెద్దలు, సమాజనాయకులు సమిష్టి వస్తువిభజన సమయంలో అధిక భాగ మును ఆర్జించేవారు. కంచుకత్తులు, బల్లెములు, బాణములు మొదలైన ఆయుధములు కలిగియుండుటచేత వారు బలప్రయోగముకూడ చేసి తమ కోర్కెలను సఫలము కావించుకునేవారు. ఈ విధంగా ధనిక బీద కుటుం బములతోబాటు, కుటుంబసభ్యులలోకూడ ధనికులు, బీదలు అను వర్గాలేర్ప డ్డాయి. సాధారణంగా కుటుంబంలోని వృద్ధులు, పెద్దలు ధనికులు; యువ కులు, మాతనులు బీదలు అయ్యుండేవారు.

## కుటుంబ సామాజిక మతం

దేవతలు, దెయ్యములు, భగవంతునిపట్ల నమ్మకములుయేర్పడలేదు. కాని ఒక అస్పష్టమైన మతాభిమానం ఏర్పడటం మొదలుపెట్టింది.

తమను గురించీ, తమ చుట్టూవున్న ప్రకృతినిగురించీ వేటగాండ్ర యిన పురాతన మానవులకు కలిగిన తప్పుడు భావనల వలన మతం ఉద్భ వించింది. వేటసమయంలో క్రూరజంతువుల సహాయమునకై వారుచేయ

మొదలిడిన ప్రార్ధనలతో మతం ప్రారంభమయింది. అనుభవంలో మానవునికన్న జంతువులు తరుచు బలీయమైనవిగాను, సువిశితబుద్ధి, కలవిగాను కనుపించాయి. జంతువులు మానవునికన్న వేగంగా పరు గెత్తుతాయి. మానవ ప్రవేశ దుస్సాధ్యములైన ప్రదేశములలో కూడ సులభంగా ప్రవేశిస్తాయి. తీక్షతర దృష్టిని, సూక్ష్మ తరమైన వినికిడి శక్తిని కలిగి ఉంటాయి. దూరమునుండి వివిధ వాసనలను, ముఖ్యంగా వరవాసనను పసికట్టగలిగిన శక్తిగలిగి ఉంటాయి. బలమైన కాళ్ళు, పంజాలు, గోళ్ళు, కొమ్ములు, కోరలు కలిగియుండు వివిధ క్రూర మృగములకు వేరుగా ఆయుధముల అవుసరములేదు. ఒక్కకాటుమాత్రం వేసి పాము మనుజులను చంపగలుగుతోంది. పక్షులాకాశవీధులలో యెగుర గలుగుతున్నాయి. కప్పలు, చేపలు మొదలైన జలజంతువులు నీటిలో నివసించ గలుగుతున్నాయి. ఇవన్నీ మానవాతీతమైనపనులే. ఈ శక్తు లన్నీ అద్భుత మైనవిగాను, అందుచేత పవిత్రమైనవిగాను వేటగాండ్రైన ఆదిమ మానవులకు తోచాయి. అందుచేతవారు అట్టి జంతుల వంకకు తిరిగి తమకు సహాయపడమనీ, తమను రక్షించమనీ ప్రార్థించ నారం భించారు.

జంతువుల ఆరాధన పద్ధతే మతములకుపునాది. కుటుంబ సమాజం లోనే ప్రప్రథమంగా ప్రారంభ మయింది. కుటుంబసమాజములు తరుచుగా అవి ఆరాదించు వివిధజంతువులయొక్క గావి, ఒక్కొక్కప్పుడు వివిధ వృక్షములయొక్కగావి పేర్లతో పిలుప బడేవి. సమాజమునకు ఏ జంతువు పేరు పెట్టబడునో ఆ జంతువు సమాజమునకు కులదేవతగా, రక్షకురాలుగా తలచ బడేది. యాత్రికులు ప్రప్రథమంగా ఆస్ట్రేలియా చేరిననాటికి, ఆస్ట్రేలియనుల మధ్య యిట్టి జంతుపూజ అతి ప్రబలంగా వ్యాపించి యుంది. మృగదేవతలు మానవుల ప్రార్థనల నాలకించి, వారికోరికలను మన్నించి, సఫలీకృతం చేస్తాయని హృదయపూర్వకంగా నమ్మేవారు. ఉదాహరణకు కంగారూ జంతు సమాజ సభ్యులు తాము వేటకు వెడలి నప్పుడు తమకులదేవతయైన కంగారూ తమ్మనుసరించి అపాయము సంభవించుటకు ముందు కేకేసి, తమ్ము హెచ్చరించి రక్షిస్తుందని నమ్మే వారు. ఈ విధమైన అనేక నమ్మకాలు వివిధ సమాజాలలో వారివారి దేవతలపట్ల ప్రబలంగా వ్యాప్తిలో ఉండేవి.

పైగా కొన్ని సమాజాలవారు తమ మృగదేవతలే, మృగదేవతలను పోలినవారే తమ పూర్వీకులనీ, వారి నుండే తాముద్భవించామనీ, నమ్ముతారు. ఉదాహరణకు కొన్ని ఆస్ట్రేలియన్ తెగలవారు తామూ, తమ మృగదేవతా కూడ అర్థమానవులనుండి, అర్థమృగములనుండి ఉద్భవించారని నమ్ముతారు. అట్టినమ్మకములు పూర్వమన్ని దేశములలోను వ్యాప్తిలో ఉండేవి. సోవియట్ యూనియన్‌లో యిప్పటికీ కొన్ని జాతులలో అట్టి నమ్మకాలున్నాయి.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B193 |
| పుస్తకం పేరు | సోవియట్ విద్యాలయాలు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | వుం |
| వెనుక అట్ట | వుం |
| మొత్తం పేజీలు | 167 |
| పెద్ద సైజు పేజీలు | వుం |
| ఖాళీ పేజీలు | వుం |
| లేని పేజీలు | వుం |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |